# ఛో మా ణో ఆఠో గుంఠో

[ఆరెకరాల ఎనిమిది కుంటలు]

ఒడియా మూలం:

ఫకీర మోహన సేనాపతి

తెలుగు రచన:

పురిపండా అప్పలస్వామి

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ముందుమాట

ఛొమాణొ అఠొ గుంఠొ గొప్పనవల. ఎంత గొప్పనవల అంటే ఇంతవరకూ దీనంతటిది కానీ, దీన్ని మించింది కానీ ఒడియాభాషలో రాలేదు. రచయిత ఫకీర మోహన సేనాపతి. ఆనాటి ఒడియా సాహిత్య యోధుల్లో మహారథి ఈయన. సుప్రసిద్ధుడు. సిద్ధహస్తుడు. బెంగాలీవాళ్ళకి బంకిం బాబు ఎలాగో, హిందీలో ప్రేమచందు ఎలాగో, ఒడియావాళ్ళకి ఫకీర మోహన సేనాపతి అలాగ. ఈయన కవి. కథారచయిత. అన్నిటినీ మించి నవలాకారుడు. వ్యావహారికభాష ప్రయోజనం గ్రహించి ఆనాడే తన యాభై అయిదోఏట ఈనవల వాడుక భాషలో రాశాడాయన. కనకనే దీనికింత ప్రచారమూ వచ్చింది ఒడియాలో.

ఫకీర మోహన సేనాపతిది సర్వతోముఖమైన పాండిత్యం. తెలుగుభాషకూడా అభ్యసించాడాయన. దశపల్లా మొదలయిన దేశీయ రాజ్యాల్లోనూ, సంస్థానాల్లోనూ దివానుగిరీ కూడా నిర్వహించాడు, సామర్థ్యంతో.

యాభై అరవై ఏండ్లకిందట సేనాపతీ, రాధానాథరాయీ ఇద్దరూ ఒడియా సాహిత్య నవ్య సౌధానికి రెండు స్తంభాలు. ఈ ఇద్దరికీ ఒడియా ప్రజలు తరతరాలుగా రుణపడి వుంటారు.

ప్రపంచమంతటా, మనదేశంలోనూ, అన్నిభాషల్లోనూ గొప్పగ్రంథాలున్నాయి. అవన్నీ అనువాదరూపంలో అన్నిభాషల్లోకీ రావాలి. అప్పుడే అనేకత్వంలో ఏకత్వం సిద్ధిస్తుంది సాహిత్యానికి.

వంగభాషలోంచీ, హిందీనించీ ఎంతో కొంత సాహిత్యం తర్జుమా చేసుకున్నాం మనం. తక్కిన భాషలోంచీ చేసుకోవలసింది ఎంతోవుంది. పక్కనే వున్న ఒడియాసాహిత్యం గురించి బాగా మనకి తెలియదు. ఆలాగే మనగురించిన్నీ వారికి తెలియదు. పరిచయముంటేనే కాని స్నేహమేర్పడదు. ఆ పరిచయం రాజకీయంగా కంటేముందు సాహిత్య పరంగానే కావాలి. దానికి అనువాద మొక సాధనం. ఈ అభిప్రాయమే నన్ను ఆనాడు కలాపహాడ్ తెలుగు చెయ్యడానికీ ఈనాడు ఛొమాణొ అఠొ గుంఠొ అనువదించడానికీ ప్రేరేపించింది.

ఛొమాణొ అఠొగుంఠొ తెలుగు చెయ్యవలసిందని మొదట పాతికేళ్ళకిందట చెప్పినవారు శ్రీ విక్రమదేవవర్మగారు. అప్పటి కాయన మహారాజు కాలేదు.

రెండోవారు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావుగారు. ఒడియానుంచి అనువదించవలసిన గ్రంథాల్లో మొదట ఇదే అనువదించండని వీరే సూచించారు. నావ్యాప

హరికృష్ణాంధ్ర మహాభారతం అరణ్యపర్వం అచ్చువేయడానికి రాజమహేంద్రవరం వచ్చాను. శ్రీ నాగేశ్వరరావుగారి సౌజన్యంతో వారి వసతిలోనే వున్నాను. దీని రచన ఇక్కడే ముగించి వారికిచ్చాను.

తెలుగు దేశంలో పేరు పొందిన గ్రంథమాలల్లో కీ॥ శే॥ అద్దేపల్లి లక్ష్మణస్వామి నాయడుగారి సరస్వతీ గ్రంథమాల కూడా వొకటి. తండ్రిగారికి మల్లేనే గ్రంథ ప్రచురణా పత్రికా ప్రచురణా సాగిస్తూ సారస్వత సేవ చేస్తున్నారు శ్రీ నాగేశ్వర రావుగారు; ప్రశంసనీయులు.

ఛొమాణొ ఆఠొగుంఠాలో అడుగడుగుకీ రచయిత ప్రతిభ కనిపిస్తుంది. హాస్యమూ, నిశితమైన వ్యంగ్యమూ రచయిత సొమ్ము అనిపిస్తుంది. నవల ఆరంభంలో ఆయిదో వాక్యంతోనే - కాదు నాలుగో వాక్యంతోనే ఆరంభ మవుతుంది అతడి వ్యంగ్యం, పుట్టలోంచి పడగెత్తుకు వచ్చిన కోడెతాచు లాగ. లోపం చూస్తే ఏ వాక్కుణ్ణీ విడిచిపెట్టడాయన. నిశితంగా వ్యంగ్యమూ, వక్రోక్తీ ప్రయోగించి చిదక గొట్టికాని వదిలిపెట్టడు. అటంబాంబులో లేని శక్తి వుంటుంది సేనాపతిగారి వ్యంగ్యంలో. విమర్శపట్ల బీభత్సుడీయన.

ఛొమాణొ ఆఠొగుంఠొ చదివితే ఆనాటి ఒడిశాదేశ చిత్రం అద్దంలోలా అవుపిస్తుంది మనకి, స్పష్టంగా. కొన్నేళ్లు ఆదేశంలో వున్నా తెలియని విషయాలు ఎన్నో తెలుస్తాయి, కూణ్ణంగా. రామచంద్రమంగరాజూ, చంపావంటి వ్యక్తులు ఈనాటికీ వున్నారు, అంతటా కాకపోయినా - అధికంగానే.

రచయిత పాఠకుల్ని తన గుప్పెటలోంచి పోనివ్వడు. ఒక్కొక్కప్పుడు పిలిచి మరీ మనతో మాట్లాడతాడు; వాదిస్తాడు; చీవాట్లుపెడతాడు. అలాంటి చోట్ల నవల ఉపదేశాత్మకమూ అవుతుంది. అలాఅని కథకి లోపంరాదు. అందు కని అతడే అంటాడొక దగ్గర "మా కలం అటూఇటూ పరిగెడుతోంది నిజమే. కాని అసలు కథ సడిలిపోదు. తిన్నగా నడుస్తూనే వుంటుంది" అని.

బెంగాలీ హిందీ నవలతో - విశేషించి బెంగాలీ నవలలతో పరిచయమున్న తెలుగువారికి ఈ ఒడియా నవల తల వూపిస్తుంది. సందేహం లేదు. అపుడు నాప్రయత్నలేశమూ సార్థకం కాకపోదు. ఈనమ్మకంతోనే తెలుగువారి ముందు పెడుతున్నాను ఛొమాణొ ఆఠొగుంఠొ - ఆరెక రాల ఎనిమిది కుంటలు.

రాజమహేంద్రవరం
9 — 1 — 1956

# ఛో మా ణో త్రె రో గుం రో

## రామచంద్ర మంగరాజు

రామచంద్ర మంగరాజు వొక పల్లెటూరి జమీందారు. వ్యాపారం కూడా వుండేదాయనికి. నగదు లావాదేవీలకంటే ధాన్యం ఇచ్చి పుచ్చుకోవడం హెచ్చు. ఇటు నాలుగు కోసులూ, అటు నాలుగుకోసులూ – ఈమధ్య మరొకరి వ్యాపారం సాగదని వినికిడి. మనిషి మంచి ధర్మబుద్ధి కలవాడు. సంవత్సరం పొడుగునా ఇరవై నాలుగు ఏకాదశులూ పాలించేవాడు. ఒకవేళ నలభై వచ్చినా, అందులో వొక్కటీ కూడా నాగా పడుతుందని చెప్పడానికి సాహసించలేం. ఏకాదశి నాడు తులసిజలం మాత్రం సేవించేవాడాయన. ఆవాళ మంగరాజుగారి మంగలి జగన్నాథం ఏదో చెపుతూ చెపుతూ చెప్పేశాడు – ప్రతీ ఏకాదశినాడూ సాయం కాలం మర్నాటి ద్వాదశిపాలనకోసమని బాబుగారి పడకగదిలో వొక శేరు పాలూ, ఇన్ని పాకంపట్టిన పేలాలూ, పంచదారా, అరటిపళ్ళూ వుంచుతారట! ద్వాదశి నాడు ఉదయాన్నే వాడు ఖాళీపాత్రలుతోమి బాగుచేస్తాడట! ఈ మాటలు విని వొకరి మొహాలు వొకరు చూసుకున్నారు కొందరు; ముసిముసి నవ్వులు నవ్వు కున్నారు.

"నీళ్లలో మునిగి నీళ్ళు తాగేస్తే ఈశ్వరుడేకాదు, ఈశ్వరుడి తాతయినా కనుక్కోలేడు" అని వొకరు అనన్నూ అనేశారు. దీని అర్థమేమిటో మాకుసరిగ్గా బోధపడలేదు. కాని ఇది నిందించేవాళ్ళు అనవలసినమాట అని మాత్రం భావించు కున్నాం. అది అలావుండ నియ్యండి – మంగరాజుగారిపక్షం నుంచుని వాదించా లంటే మేం వాదించగలం. ముఖ్యంగా వొక సంగతి చూడండీ. పాలగిన్నె ఖాళీఅయింది అంటే అది మంగరాజుగారి ద్వారాన్నే అయిందని చెప్పడానికి, చూసిన సాక్షి ఎవడున్నాడు? విన్నమాట కాని, ఊహించి చెప్పిన మాటకానీ ప్రమాణంగా స్వీకరించడమంటే వొప్పుకోలేం. కోర్టుల్లో న్యాయమూర్తుల తీర్పులు చూడండీ, ఇలాగే వుంటాయికదా మరి!

మరోవిషయం చూద్దాం – ద్రవప్రదార్థం యావత్తూ ఆవిరిరూపంలో ఎగిరిపో తుందని విజ్ఞానశాస్త్రం చెపుతూవుంది. పాలు ద్రవప్రదార్థమేకదా! జమీందారుగా రింటి పాలని విజ్ఞానశాస్త్రం భయపడుతుందా! అదీకాక, ఆ ఇంట్లో ఎలకలూ, చుంచెలకలూ, పందికొక్కులూ వున్నాయి. నల్లులూ, ఈగలూ, దోమలూ వుండని

ఇల్లే వుండదుకదా! కదుపుకోసమని ప్రతిప్రాణీ దేవులాడుతుంది. విశేషించి మంగరాజుగారి లాగ అవేవీ హరిభక్తి మాహాత్మ్యం విన్నవి కావుకదా! అంచేత, ఇవన్నీ ఆలోచించి మంగరాజుగారి ధర్మనిష్ఠ విషయంలో సందేహించడమంటే మహాపాపమని మా ఉద్దేశం.

అంతేకాదు, మిగిలిన విషయాలుకూడా ఆలోచించడం అవసరమంటాం. మంగరాజుగారు ఉప్పుడుబియ్యం ముట్టరు. — ఇక చేపలూ మాంసం సంగతి వేరే చెప్పాలా? ద్వాదశినాడు బ్రాహ్మణ భోజనం చేయించాక కాని ఆయన ఎంగిలి పడరు.

మంగరాజుగారు మాంచి హుషారయిన మనిషి. బ్రాహ్మణ సంతర్పణవంటి మహత్కార్యం ఎన్నడూ విఘ్నం కలగకండా మంచి ఏర్పాటు చేసేశాడాయన. ఒక కెవుట వాడికి * ఎకరంభూమీ వొక గుడియా వాడికి ♦ ఎకరం భూమీ జాగిలీ ఇచ్చాడు. ద్వాదశినాడు తెల్లవారేసరికి కెవుటవాడు ఆరుకుంచాల అటుకుళ్ళూ, గుడియావాడు రెండుపదలాల బెల్లమూ తెచ్చి దాఖలుచేసి వెళతారు. గోవిందపురం అగ్రహారం ఇరవై ఏడు ఇళ్ళ బ్రాహ్మలూ ఆహ్వానింపబడి వస్తారు. వేళ ఆరు ఘడియలు దాటకండా బ్రాహ్మణ భోజనం జరిగిపోతుంది. మంగరాజుగారు స్వయంగా బ్రాహ్మలికి వడ్డన చేస్తారు. ఆకుల్లో వొక్కసారే అటుకుళ్ళూ, బెల్లమూ వడ్డించేసి, చేతులు జోడించి గట్టిగా అనేవాడాయన.

"అయ్యగార్లూ, చెప్పండి, ఇంకా ఏమన్నా కావాలేమో! కావలసినంత ఫలహారమూ, కావలసినంత బెల్లమూవుంది. కానైతే, నాకు తెలుసు. తమ కళ్ళు పెద్దవి : కడుపులుమాత్రం చిన్నవే. వడ్డించింది మీ కడుపుకిమించిపోతుంది."

ఇలా అన్న తరవాతకూడా ఎవడన్నా కక్కుర్తి బ్రాహ్మడు ఫలహారం కావాలని అడిగాడో మంగరాజుగారు స్వయంగా మూడు మునివేళ్ళతో అయిదు ప్రుంజీల అటుకుళ్ళు పట్టుకువచ్చి విస్తట్లో పడేసేవారు. దాంతో బ్రాహ్మలంతా

---

* కెవుటవాళ్ళు = ఒడిశాలో వొకజాతివాళ్ళ కెవుట లంటారు. చేపలు పట్టడమూ, అటుకుళ్ళూ, పేలాలు అవి చేయడమూ వీళ్ళ వృత్తి. విశాఖ జిల్లా సాలూరూ ఆప్రాంతంలోవున్న నెయ్యిలవాళ్ళతో వీళ్ళని పోల్చవచ్చు.

♦ గుడియా వాళ్ళు = గుడము అంటే బెల్లం. బెల్లంతో తినుబండారాలు చేసే వొక తెగవారిని ఒడియాలో గుడియా లంటారు.

"సంపూర్ణమైంది, సంపూర్ణమైంది. గోవిందా, గోవిందా" అంటూ తేన్చుకుంటూ ఆకులు వదిలిపెట్టి లేచిపోయేవాళ్ళు. *

బ్రాహ్మణ సంతర్పణ అయాక, మిగిలిన అటుకుల్నూ బెల్లమూ భక్తి భావంతో మంగరాజుగారు సేవించేవారు.

పాఠకులు సందేహించవచ్చు, మూడుకుంచాల అటుకుళ్ళతో ఇరవై ఏడుగురు బ్రాహ్మల కడుపులు ఎలా నిండాయని ఇలాంటి కుశంకలన్నిటికీ జవాబు చెప్పాలంటే మరి మారాత సాగదు. ఏసుక్రీస్తు రెండు రొట్టెముక్కలతో పన్నెండు వందల మందికి తిండిపెట్టాడు. ఇంకా నాలుగు బుట్టలు మిగిలిపోయిందట కూడాను. కామ్యకవనంలో శ్రీకృష్ణుడు దుర్వాసముని శిష్యులు పన్నెండు వేల మంది కడుపులూ చిన్న కూరాకుతో నింపేశాడు. ఈ మహాపురుషుల హస్తలాఘవం మీద మీకు నమ్మకం లేదంటారా, అయితే మంగరాజుగారి చరిత్ర చదవమని మిమ్మల్ని బలవంత పెట్టాడానికి సాహసం చాలదు మాకు. వినికిడి ఏమిటో తెలుసా? — మంగరాజుగారి పింతల్లి కొడుకు శ్యామమల్లు వొకసారి పట్నం వెళ్ళాడు. పాపం దాగలేదు. ఆయన వుల్లివేసి వండిన కాబేజీకూర తిన్నమాట మంగరాజుగారికి తెలియకండా దాగలేదు. ఈ పూట దాకా బూజుపట్టి వుండవలసింది శ్యామమల్లు. [జాతిచెడడంవల్ల మంగలికూడా అతడికి క్షవరం చేసేవాడు కాడు] మంగరాజుగారు స్వల్పంలో తేల్చేశారు. శ్యామమల్లు పిత్రార్జితం ఏడెకరాలనర పల్లంలోంచి మూడుమ్ముప్పాతిక ఎకరం మాత్రం పుచ్చుకుని వొదిలిపెట్టేశారు. ఒకనాడు శ్యామమల్లుని ఆయన స్వయంగా పిలిచి చెప్పారు:

"చూడమా, శ్యామా! ఇకముందు జాగ్రత్తగా మసులుకో. నేనంటూ వుండబట్టీ, నా ఇదివల్ల పదిమందీ నిన్ను కూడదీశారు. లేకపోతే నువ్వు కిరస్తానుల్లో కలిసిపోయి వుందువు. నీ ఏడుతరాల పితరులూ అహీనరకంలో పడివుండేవాళ్ళు. నేనని నీభూమి ఎకరం ఇరవై రూపాయలికి పుచ్చుకున్నాను. మరొకడయితే ఎనిమిది రూపాయలకన్నా ముట్టేవాడు కాడు. ఏమయినా నువ్వు నా తమ్ముడివి కదా! నిన్ను పారేసుకుంటానా మరి! కానైతే, ఆపదా గీపదా వస్తే నేనూ, — మంచపుడు ఎవడూ అక్కర్లేదు! ఆవాళ గౌడు భీమన్న క్రిమినలు కేసులో నిన్ను సాక్ష్యం చెప్పమన్నాను. ఇంట్లో దాగున్నావు. కనిపించావు కావు!"

---

* బ్రాహ్మలుకాక ఇతర జాతులవారు బ్రాహ్మణ సంతర్పణచేస్తే అటుకులూ బెల్లమో, పాకంపట్టిన పేలాలూ, గోధుమ పాయసమో పెడతారు.

రామ రామ! ఏదుష్టులు క్రీస్తుని శిలువ వేశారో, ఎవళ్ళు సీతమ్మతల్లిని అడివికి తోలారో — వాళ్ళ వంశస్థులు ఏకాదశీ వ్రత పరాయణుణ్ణి, పరోపకార పురుషుణ్ణి, మంగరాజుగారిని నిందిస్తున్నారంటే ఇందులో విచిత్రమేముంది? దుష్టులేపైతే చెప్పుకుతిరుగుతున్నారో, విధిలేక మేమూ అవే చెప్పవలసివస్తున్నది.

వాళ్ళు అంటూ వుంటారు: "నాలుగు కోసుళ్ళమధ్య మంగరాజుగారు ఎవ్వరికీ గోష్పాదమంత భూమి మిగలనివ్వలేదు. ఒక్క పింతల్లి కొడుకుమాత్రం మిగిలి పోయాడు. సందు వెదకి వెదకి ఇన్నాళ్ళకి అతణ్ణీ పట్టేశారు." అని.

శ్యామమల్లు వుల్లితిని బ్రాహ్మణ సంతర్పణ చేయించాడు. మంగరాజుగారి ఆడవాళ్ళు చంపాని పంపి సంతలోంచి వుల్లిపాయలు తెప్పించేవాళ్ళు. సరేనండీ, మాటవరసకి మేమూ వొప్పుకుంటాం చంపా వుల్లిపాయలు తెచ్చిందని. అయితే తిన్నారని రుజువేదీ?

"పలాండు గుంజనం చైవ" — మను ధర్మశాస్త్రంలో తినడమే నిషేధం. కాని కొన్నంత మాత్రాన పతితులై పోతారన్న నియమం ఎక్కడుంది? అయితే తగుమనుష్యుల ఇంటి ఆడవాళ్ళ దోషాదోషాలు ఆడిపోసుకునే దుష్టుల మాటలు విని జవాబు చెప్పడమంటే ఎంత మాత్రమూ నచ్చదు మాకు.

# 2

## స్వ నా మ పు రు షో ధ న్యః

మంగరాజుగారు వొక బీదకుటుంబంలో పుట్టారు. ఏడేళ్ళప్పుడు తండ్రి పోయి ఆయన దిక్కులేకుండా తిరుగుతూ వుండేవాడని వినికిడి. డబ్బులేక తండ్రి దినవారాలు జరగలేదు. ఇంటిమీద చొప్పలేక గోడలు కూలిపోతూ వుండేవి. ఆయన బాల్యజీవనమూ, చదువుసంధ్యలూ, కర్మక్షేత్రంలో కాలుపెట్టడమూ మొదలయిన సంఘటనలన్నీ విచిత్రమైనవి. ప్రపంచంలో ఏ ప్రధానవ్యక్తి జీవితచరిత్రమయినా తీసుకోండి - అందులో అలౌకికమైన సంఘటనలు లేకుండా వుండవు. అవన్నీ రాయడానికి కూచుంటే ఎంతోసమయమూ, కాగితమూ, సిరా కావాలి. మితవ్యయం వొక గొప్పగుణం. ఈవిషయంలో మంగరాజుగారు మాకు గురువు. అర్థనీతిలో మహాపండితు డనిపించుకున్న బెంజిమిను ఫ్రాంక్లిను చేసిన ఉపదేశం లోని మర్మం, మేము తెలుసుకున్నది ఇది. బజారునించి కాగితంకొని తేవడం

సుళువే. కాని అది వాడడమే కష్టం. అందుకని అన్నిమాటలూ సంగ్రహంగా రాసి మంగరాజుగారి అర్థనీతిగౌరవం నిలబెట్టడానికి ప్రయత్నిస్తాం.

మంగరాజుగారి జమీందారీపేరు ఫతేపుర సరషంప. ఆదాయం డౌలు అయిదువేలు. అయిదువందలఅరవై ఎకరాలు మాగాణి లఖరాజు.* మూడు వందల ఇరవైఏడు ఎకరాలు బాజ్యాప్తి.† ఇందులో ఇరవైఏడు ఎకరాలకి వొక పాటూదారు వున్నట్టు జడ్జీకోర్టు అపీలు దాఖలై వుంది. మంగరాజుగారు నలభై యాభై వేల రూపాయలు వ్యాపారంలో పెట్టారని లోకులు అంటారు. గొప్పవాళ్ళ ఇంటికి మాటలు గొప్పగానే వినిపిస్తాయి. మా అనుమాన మేమిటంటే, పదిహేనువేల కంటే హెచ్చు వుండదని అబద్ధం చెప్పడం మా ధర్మం కాదు. ఇన్‌కమ్ టాక్సు ఇలాకావాళ్ళదగ్గిర విని ఈ మాటలు చెపుతున్నాం మేము. ధాన్యం వ్యాపారం కాగితాలు ఇరవై సంవత్సరాలయి తేలలేదు. అంచేత సరయిన లెక్కలు చెప్పడం వల్లకాదు. గతఏడు కొత్త సంవత్సరం తరవాత ధాన్యకొట్టు గుమాస్తా దాఖలుచేసిన లెక్కల ప్రకారం షెరశి మొత్తం మేము తెలుసుకున్న దేమిటంటే, రెండువేల బళ్ళా పదిహేనుమానికల ఆరుసోలల రెండు గిద్దెలు ధాన్యం ధాన్యకొట్లలో జమ వుందని.

ఇల్లు అయిదు వరసల లోగిలి. మూడింట్లో ముగ్గురు కొడుకులూ, ఒక వరసలో మంగరాజుగారూ, అమ్మగారూ, చిన్నకూతురు మాలతీ వుండేవారు. బైటి వరసలో కచేరీ వుండేది. కచేరీ అయిదు వుద్దీలు (పట్టీలు) వేసి కట్టిన ఇల్లు. ఊద్దీల పలకలమీద పులీ, ఏనుగూ, పిల్లీ, రాధాకృష్ణులూ, కోతులూ చెక్కి వున్నాయి. గోడలమీద నీలీ, ఎరుపూ, తెలుపూ, పచ్చా, వంగపండూ మొదలయిన రకరకాల రంగుల్తో పద్మాలూ, కలవలూ, మాలతీ పువ్వులూ, పూలహారాలూ, వానరసైన్యమూ రాక్షసదండూ వున్న రామరావణ యుద్ధమూ మొదలయిన పౌరాణికచిత్రాలూ చిత్రించి వున్నాయి. రాజపుతానాలో ఎక్కడో వొక దిస మొల ఆడబొమ్మనిచూసి, భారతదేశంలో పూర్వం స్త్రీలు దిసమొలతో వుండేవాళ్ళని టాడ్‌దొర వూహించాడు. అయ్యయ్యో, మంగరాజుగారి గోడమీద బొమ్మలు చూపించి టాడ్‌దొరగారి మూర్ఖత్వం తొలిగించే అవకాశం లేకపోయింది మాకు. గోడమీద బొమ్మల్లో చెలికత్తెల మధ్య రాధ జేగురురంగుమీద

---

* లఖరాజు: సర్కారు శిస్తులేని భూమి.

† బాజ్యాప్తి: మొదట శిస్తులేకండావుండి, తరవాత శిస్తువేసిన భూమి.

కుంకుమసిలాంటి నల్లటి బుటాల గాగరా చూసివుంటే ఆదొరగారి మూర్ఖత్వమూ, భ్రమా పటాపంచలై పోయేవి.

శుభోమ్మోల్ ప్రాయడానికి ఎక్కణ్ణుంచో చిత్ర కారులు తెప్పించవలసిన అవసరం రాలేదు. అన్నీ చంపా స్వహస్తంతో చిత్రించినవే. చంపా ఎన్ని రకాల జంతువుల చిత్రించగలదో తెలుసా. కలకత్తా జ్యాయలాజికలు గార్డెన్సులోకూడా అన్నిరకాలు వెదికి చూడలేరు మీరు.

మంగరాజుగారి లోగిలికి ఆంటిపెట్టుకుని వారిదొక తోటవుంది. పెరట్లో పెద్ద చెరువూ, చెరువుచాలుగుదిక్కులా కొబ్బరిచెట్లూ, వాటి వెనుక అరిటిచెట్లూ, పనసచెట్లూ, మామిడిచెట్లూ అవీ వున్నాయి. తోటకి పెండె లాగ వెదురుచెట్లు బాగా బలిసి వున్నాయి. అవొక ప్రాకారంలాగ అవుపిస్తాయి.

మంగరాజుగారి లాంటి స్వార్థత్యాగుల్ని చాలా తక్కువమందిని చూస్తాం. ఆయన చేసిన ప్రతిపనీ పరోపకారం కోసమే. గోవిందపురంలో సంత జరగ డానికీ, దాని అభివృద్ధికీ మంగరాజుగారి ఈ పెద్దతోటే మూలకారణం. ఈ తోట లోంచి కొబ్బరికాయలూ, అరిటిగెలలూ, పంకాయలూ, గుమ్మడికాయలూ, తోట కూరా, పచ్చిమిరపకాయలూ వెళ్ళకపోతే సంతలోసందడే వుండేది కాదన్నమాట. మంగరాజుగారితోట కాయకూరలు అమ్ముడుపోయేదాకా పైవాళ్లెవరూ అమ్మడా నికి అధికారంలేదు. అది సబబేకూడాను. ఏమంటారా, మంచి దినుసు అమ్ముడు పోకుండా, చెడ్డదినుసు ముందు అమ్ముడు పోవడం న్యాయం కాదు కదా! సంత మంగరాజుగారి స్వంత జమీందారీలో జరుగుతుండాయె. స్థలం పైవాళ్ళదయితే అదివేరేసంగతి. కొత్తసంవత్సరమనీ, దసరాఅనీ, పండుగులనీ, పబ్బాలనీ నజరానా వచ్చే గుమ్మడిపళ్ళూ, పంకాయలూ, అరటిగెలలూ తిన్నగా సరాసరి సంతకి వెళ్ళి పోయేవి.

చైనా గ్రేటువాల్ తయారైపోయాక చైనా చక్రవర్తి దేశంలో వున్న చరిత్రకారులందరినీ పట్టితెచ్చి హత్యచేసేశాడు. దానికి కారణం, గోడకట్టడంకోసం ఎంతఖర్చయిందో ఆవివరాలు చరిత్రలో వాళ్లు రాసేస్తారేమో అనే. దీనివల్ల చైనా చక్రవర్తిని నిరహంకారపురుషుడే అంటాం మేం. గొప్ప వ్యక్తులు గొప్ప కార్యాలు సాధించినప్పుడు, దానికోసం ఎన్నిరూపాయలు ఖర్చయాయో, అది చెప్పుకు తిరగరు. మంగరాజుగారి నడగండీ "తమలోగిలికట్టడానికి ఎంతసొమ్ము ఖర్చయిం దండీ!" అని. జవాబేమివస్తుందో తెలుసా! "ఎంతో సొమ్ము, ఎన్నో రూపా యలు మంచినీళ్ళలా ఖర్చయిపోయాయి. దాంతో నేను కుదేలే అయిపోయాను"

అంటాడాయన. పాఠకులు అంతమాత్రాన అధైర్యపడి పోకండి. నిరాశ చేసుకోకండి.

పురాతత్వవిద్యవల్ల పురాతనవిషయాల రహస్యం తెలిసిపోతుంది. తొమ్మిది వందల సంవత్సరాలయాక వొక దొరగారు వచ్చి పూరీ జగన్నాథ దేవాలయం కట్టడంలో ఎంత ఖర్చయిందో లెక్కలుకట్టి, జాబితా వేసి చూపించారు. మంగరాజుగారు కొయిగూర అమ్మిన లెక్కలుగూడా వున్నాయి. అలాంటపుడు ఇల్లు కట్టడంలో అయిన ఖర్చు దొరకదూ?

దివాను గంగాధర గోవింద సింగుగారి తల్లి దినవారాల్లాంటి దినవారాలు భారతదేశంలో ఇంతవరకూ ఎవ్వరూ ఎక్కడా చెయ్యలేదు. ఇక ముందు చెయ్యబోరు కూడాను. బంగాళా దేశంలోవున్న జిల్లాకలెక్టర్లు అందరూ పప్పూ, బియ్యం, మైదా, నూనే, నెయ్యీ, కొబ్బరికాయలూ, అరటిగెలలూ కొని వారికి పంపించాలని వైస్రాయిగారు స్వయంగా తాకీదులు పంపారు. గోవిందసింగుగారు చేసినప్రకారం తనతల్లి దినవారాలూ చెయ్యాలని నవద్వీపంరాజా శివచంద్రుడుగారు జాబితాకోసం కబురంపారు. దివాను గోవిందుసింగుగారు జాబితా ఏం పంపారో తెలుసా? గంజాయీ, నల్లమందూ, పొగాకూ - వీటి జాబితామాత్రం పంపించి, తక్కిన సామాగ్రి యావత్తూ వీటినిబట్టి ఊహించుకోండి అని వ్రాశారు. ఒక్క వీటికే అయినఖర్చు ఎంతంటారు? డబ్బయిరెండు వేల రూపాయలు.

మంగరాజుగారు ఇల్లుకట్టడంలో నగదురొక్కంమాట అటుంచి, జమీందార్లు అంతటినించీ వెట్టిగా ఎన్నోవస్తువులు వచ్చాయి. ఖర్చులో వొక్కపద్దు వివరిస్తాం మేం. దాన్నిబట్టి ఇల్లంతా కట్టడానికి ఎంతయిందో బుద్ధిమంతులయిన చదువరులే ఊహించుకుంటారు. ధాన్యకొట్టు విషయంలో మేము సరయిన లెక్కలు సంపాదించాము. వడ్రంగీ, కమ్మరీ, వెట్టికూలీలూ - వీళ్ళకింద పదిహేనుబళ్ళా ఇరవైరెండు మానికలు ఖర్చుపడింది.

మంగరాజుగారి నోట ఎన్నోసంగతులు వింటూ వుంటాం. ఆయన పైవాళ్ళ కష్టం సహించలేడు. అంచేత ధాన్యమూ, నగదూ అప్పిస్తూ వుంటాడు. అంతే కాని అందులో ఆయన స్వలాభమేమీలేదు. పైగా నష్టమే అంటాం మేం. ధాన్యం మూడుమానికలిస్తే మానెడువడ్డీ! ఇందులో లాభమేముంది? ఇచ్చినప్పుడు పాత ధాన్యం, ఎండిన ధాన్యం ఇస్తారు. పుచ్చుకున్నప్పుడు కొత్తధాన్యం పుచ్చుకుంటారు. అదీ పచ్చిగా వుంటుంది. మీరు తడిబట్టా, పొడిబట్టా తూకం వేసి చూడండీ! అప్పుడు తెలుస్తుంది. పచ్చివాటికీ ఎండినవాటికీ ఎంత తేడా వుంటుందో,

గతఏటి లెక్కలు గుమాస్తా దాఖలు చేసినవాట్లో సంవత్సరం మొత్తంమీద వడ్డీ వ్యాపారంలో ఎనిమిది రూపాయల ఆరణాల ఏగానీ టోలీ పారుబాకీకింద వదిలి పెట్టేసినట్టువుంది. ఇన్ని రూపాయలు పారుబాకీకింద వేశావని గుమాస్తా పుచ్చు చీవాట్లుతిన్నాడు. అతడుచెప్పిన కైఫీయతులోంచి వొకపద్దు టూకీగా చెపుతాం. వినండి.

భికారిపండా అప్పు పుచ్చుకున్నది అసలు అయిదురూపాయలు. దీనివడ్డీ చక్రవృద్ధి ప్రకారం పన్నెండు రూపాయల అయిదణాల పదకొండు దమ్మిడీల నర. వెరశి మొత్తం రెండుపద్దులకింద జమ పదిహేడు రూపాయల అయిదణాల పద కొండు దమ్మిడీలు పోను పారుబాకీకింద వదలి పెట్టింది అరదమ్మిడీ.

# 3

## వాణిజ్యేవసతేలక్ష్మీ స్తదర్ధంకృషికర్మణి అస్యార్థః

వాణిజ్యం లక్ష్మీనివాసం. అందులో సగం వ్యవసాయం. ఎవడో ఛాందస కవి ఈకవిత్వం చేసి వుంటాడని మా అభిప్రాయం. ఈనాటి కొత్తకవి అయితే ఇలా చెప్పేవాడు:

వాణిజ్యం లక్ష్మీనివాసం. అందులో సగం బి. ఎల్. పాసవడం. మంగరాజు గారి లోగిలిచూస్తే అదివొక బి. ఎల్. పాసయిన అడ్వకేటుగారి ఇల్లనీ పదిమంది కొంపలు కూల్చి కట్టిందనీ అనుకుంటారు తెలియనివాళ్ళు. అసలు సంగతి ఏమిటో తెలుసా? "భాగ్యం ఫలతి సర్వత్ర" కచేరీ వరండాలమీద గబ్బిలాల లాగ దేకురుతున్నారే ఈవకీళ్ళు, వీళ్ళలో వొక్కడయినా దొరుకుతాడా, మంగ రాజుగారిలాగ పదేసి పదేసి కొంపలు మాపేసి ఇల్లు కట్టగల మగాడు?

పరాయిసొమ్ము పైసా అయినా ముట్టనని మంగరాజుగారు స్వయంగా చెపుతారు. స్వయంకృషివల్ల, స్వయంగా చెమటోడ్చి మట్టిలోంచి బంగారం పుట్టించాడాయన. మేం విన్నదేమిటంటే — వినడమెందుకూ; స్వయంగా మాకు తెలుసు — మంగరాజుగారు వూళ్ళో నాయుడుదగ్గిర ఓంప్రథమంలో రెండు ఎకరాల పొలం భాగానికి పుచ్చుకున్నారు. ఇప్పుడో ఆయన స్వంతసేరీ

ఎనభై ఆరు ఎకరాలుండి. ఇది కాక ఆరువేల పదిహేడు ఎకరాల భూమి భాగాని కిచ్చారు. పొలమంతా లాఖరాజ్. కొంచెం సిక్షీబాజ్యాప్తి * కూడా వుంది. హెచ్చుభాగం ఖరీదా బ్రహ్మోత్తరం. * దుక్కికోసం పదిహేను జతల ఎడ్లు న్నాయి. పన్నెండుగురు కంబార్లున్నారు. వీళ్ళ సంవత్సరం జీతగాళ్ళు. అందులో ముగ్గురుమాత్రం పాణుజాతివాళ్ళు. తక్కినవాళ్ళు బారుసులు. తోటా, పొలమూ వీరి పూచీలో వుంటుంది. మంగరాజుగారి ఉపదేశంవల్లా, హెచ్చరీవల్లా, వీళ్ళంతా కర్మవీరులు; ఉత్సాహవంతులు.

బ్రాహ్మీముహూర్తంలో పక్కమీంచి లేవాలన్నది ఆరోగ్యశాస్త్రంలోని నియమం. ఎండాకాలం కానీండీ, వానాకాలం కానీండీ, తుఫాను రానివ్వండీ, ముసురు పట్టనివ్వండీ — మంగరాజుగారు ఈ నియమం తప్పారన్న సంగతి ఎవరూ చూడలేదు. శాస్త్రంలోవుంది: "నదులన్నీ సముద్రంలో కలుస్తాయి. కలిశాక, వాటిస్వంతగుణం మరిచిపోతాయి. అన్నీ ఉప్పుగానే తయారవుతాయి." అని.

నిజమే అది. అలాగే ఇంటిఆడవాళ్ళూ, దాసీలూ, నౌకర్లూ అందరూ మంగరాజుగారి పద్ధతే అలవరుచుకున్నారు. వారింటి దాసీజనం చూసి మేమిదే గ్రహించాము. బ్రాహ్మీముహూర్తంలో మంగరాజుగారు పళ్ళు తోముకునే వారు. కలకత్తా నగరంలో రెండుసార్లు ఫిరంగి పేల్తుంది. ప్రాతఃకాలంలో పేలే ఫిరంగి రాత్రివెళ్ళిపోయిందని తెలియచేస్తుంది. మంగరాజుగారు కచేరీ గడపమీద నుంచుని కంబార్లని కేకవేశారంటే, వూళ్ళో వాళ్ళు కళ్ళుమూసుకునే గ్రహించేసే వాళ్ళు, తెల్లవారిపోయిందని. ఇళ్ళఆడంగులులేచి పాచిపని ప్రారంభించేసేవాళ్ళు. పల్లెటూరిప్రజ ఘాచీలూ గీచీలూ ఎరగరు. పొద్దు నెత్తిమీదికి వస్తే ఏరువిప్పి ఎడ్ల మీంచి పూజులు కింద పెడతారు. చుట్టుపక్కల రైతులు దూరంనుంచే చూసేవాళ్ళు, మంగరాజుగారి పెద్దతాటాకు గొడుగు గట్టుమీంచి లేచిందా లేదా అని.

---

* సిక్షీబాజ్యాప్తి : లాఖ్‌రాజుభూమి ఇంగ్లీషు గవర్నమెంటు బజ్యాప్తిచేసి సగం పన్ను వేసింది.

* ఖరీదా బ్రహ్మోత్తరం : దానం చేసినభూమి దానంపుచ్చుకున్న వ్యక్తికాని ఆతడి ఉత్తరాధికారికాని విక్రయించినప్పుడు ఆ కొన్నవ్యక్తికి శిస్తులేకుండా అనుభ వించే అధికారం వుండదు. అలాంటపుడు దానిమీద శిస్తుపడుతుంది. అలాంటి వృత్తిని ఖరీదా బ్రహ్మోత్తరం అంటారు.

మంగరాజుగారు తమ కంబార్లని కన్నకొడుకుల్లాగ చూసేవారు. తల్లిదండ్రులు స్వయంగా పిల్లల తిండీతిప్పలూ చూస్తేకాని వాళ్ళకి తృప్తి వుండదు. కంబార్లు వరాసగా తిండికి కూర్చోగానే మంగరాజుగారు పెద్దకేకవేసి వంటవాణ్ణి పిలిచేవారు "తరవాణి పట్టుకురావోయి, తరవాణి. వీళ్ళ గొంతుకలు ఎండిపోతున్నాయి" అని. వంటవాడు రివాజు ప్రకారం ప్రతీ వొక్కడికీ రెండేసి కంచాల తరవాణి తెచ్చిపోసేవాడు. ఎవడన్నా కంబారి అంత తరవాణి తాగడానికి ఇష్టపడకపోతే, మంగరాజుగారు తరవాణి తాలూకు ఉపకారం గురించీ, అదిచేసే పుష్టిగురించీ చిన్న ఉపన్యాసం చేసి, వాడిచేత అది తాగించేసేవారు. తరవాణి అయిపోయాక, వాళ్ళకి అన్నం వడ్డించమని చెప్పేసి, ఆయన స్నానానికి వెళ్ళిపోయేవారు.

మంగరాజుగారి తోటలో పదిహేడు మునగచెట్లుండేవి. మునగకూర జీర్ణానికి ప్రసిద్ధి. జలకారకం. రోగనాశకం, రుచికరం. రోగులికి పథ్యం. వస్తుగుణ ప్రకాశికలో ఈగుణాలు చెప్పారో లేదో మాకు తెలియదు. ఏమంటే అవిద్య మాకు సుతరామూ తెలియదు. కాని మంగరాజుగారి నోట 'యథాశ్రుతం తథా లిఖితం' అంచేత తోటలోంచి మునగకూర పిడికెడయినా సంతకి వెళ్లేది కాదు. కంబార్ల బలవృద్ధికోసం, పుష్టికోసం అంతా ఖర్చయిపోయేది. చూశారూ, రాలిపోయిన మునగపువ్వులున్నాయే, వాటినిమించిన పదార్థం ప్రపంచంలో లేదు. అవి ఇన్ని తీసి ఆవపెట్టి వంటచేస్తే మరిచెప్పేదేముంది!

పరమేశ్వ సృష్టిలో మంచీచెడ్డా కలిసి వుంటుంది. చూడండీ, పనస తొనలు ఎంత తియ్యగా వుంటాయి! కాని వాటి లోపలవుండే పొట్టు మహా చెడ్డది; జీర్ణం కాదు. అయితే జ్ఞానవంతునికి మాత్రం తెలియందంటూ వుండదు. మంచిదేదో చెడ్డదేదో వాళ్ళు ఎంచి తీసేస్తారు. మునగచెట్టులో అంతా మంచిదే కాని దానికాడలుమాత్రం మహాచెడ్డవి; జీర్ణం కావు. అంచేత కంబార్లు కానీ నౌకర్లు కానీ మునగ కాడలు ముట్టరు. అవి సరాసరి సంతకి వెళ్ళవలసిందే.

## 4

## అయం నిజః పరోవేతి గణనా లఘు చేతసాం

మంగరాజుగారికి వ్యవసాయ విషయంలో తనదని పైవాళ్లదనీ భేదం లేదు. తక్కువబుద్ధి కలవాళ్ళ మాత్రం ఇదినాదీ, ఇది పైవాళ్లదీ అనుకుంటారని శాస్త్రం చెప్తోంది. మంగరాజుగారికి తమ స్వంత సేరిమీద ఎంత శ్రద్ధో, పైవాళ్ల

స్వశసాయంమీదా అంతే శ్రద్ధ. ఒకనాటి విషయం మేము చెప్పామంటే, బుద్ధి మంతులయిన పాఠకులు అది గ్రహించేస్తారు. కుండలో అన్నం సంగతి తొక్క మెతుకు పట్టి చూసేస్తే తెలిసిపోతుంది.

కంబార్లపెద్ద గోవిందప్రహాణ ఉదయాన్నే వచ్చి మనవి చేశాడు :

“ బాబుగారూ, ఎకరంనర పొలం వూడుపు కాకండా వుండి పోయింది. ఆసు లేదు ” అని.

“ హూఁ ” అనేసి వూరుకున్నారు మంగరాజుగారు. కంబారి చేతులు కట్టుకుని ద్వారందగ్గిర నుంచున్నాడు.

మంగరాజుగారు పొలం చూడ్డానికి బయల్దేరారు. నూనె జిడ్డోడుతూవున్న చిన్న పొత్తిపంచ కట్టుకున్నాడాయన. నడుంకి జేగురురంగు గావంచాగుడ్డ చుట్టు కున్నాడు. భుజంమీద పెద్ద తాటాకు గొడుగుంది. పొలం మంచిచెడ్డలు మనవి చేస్తూ గోవిందప్రహాణ వెనక నడుస్తున్నాడు. మరో కంబారి కూడా భుజాలమీద రెండు బ్రాబాలు పట్టుకుని వెనక వస్తున్నాడు. వాడిపేరు పాండియా. ఊళ్లో అందరూ మేలుకోలేదింకా. దార్లో శివన్న పండితులుగారు అవుపించారు.

శివన్నగారు పొడుం పీలుస్తూ నడుస్తున్నారు. ఎడమచేత్తో చెంబు పట్టుకుని బహిర్భూమికి వెడుతున్నాడాయన. హటాత్తుగా మంగరాజుగారిని వెనకాల చూసి కంగారుపడిపోయి, ఏడున్నరమూరలు వెనక్కి తప్పుకున్నారు. చెంబు కింద పెట్టేసి, పింటిబిద్దలా ముందికి వంగి “అంజలి బద్ధోభూత్వా రాజుగారి కీర్తి మాయుర్యశః శ్రియం—” కోరారు. మంగరాజుగారి దృష్టి అటు కి నేలేదు. ముక్కుకి సూటిగా వెళిపోతున్నారాయన. ఆయన కొంతదూరం వెళ్లిపోయాక చెంబు చేత్తో తీసుకుని పండిత శివన్నగారు శ్లోకం చదివారు :

“ అద్య ప్రాతరేవానిష్ట దర్శనం
జాతం నజానే కిమన భిమతం
దర్శ యిష్యతి. ” *

శ్లోకాలు చదవడం పండితుల కొక అలవాటు. దాన్లో మాకు వచ్చేదేముంది!

శ్యామ గోచ్చాయిత కులానికి చారికి. ఊరికిందే వాడి పొలం. వేగంగానే వూడుపులు పూర్తిచేసేశాడు వాడు. అంచేత నవనవలాడుతూవుంది చేను. శ్యామ

---

* ఉదయాన్నే చెడ్డచూశాను. తరవాత ఏం ఆపద మూడుతుందో ఏమో!

మడిగట్టు సరిచేస్తున్నాడు. మంగరాజుగారు దగ్గిర నుంచుని ఆప్యాయంగా వాణ్ణి పలకరించారు:

"ఏంరా శ్యామా!"

హఠాత్తుగా రాజుగార్ని చూసి తుళ్లిపడ్డాడు శ్యామ. చేతిలోని పార అయిదు మూరల దూరం పారేసి కింద బురదలో పడుకుని సాష్టాంగ నమస్కారం చేశాడు.

"లే, లే, శ్యామా, లేరా లే."

ఎంతో ఆదరంగా అన్నారు మంగరాజుగారు. లేచి, చేతులు జోడించుకుని పదిమూరల దూరంలో నుంచున్నాడు శ్యామ. శ్యామా—మంగరాజుగార్ల మధ్య ఎంతోసేపు కష్టసుఖాల సంభాషణ సాగింది. అదంతా రాస్తే బహుశా పాఠకులు చికాకు పడవచ్చు. అంచేత సారాంశం మాత్రం రాస్తాం.

శ్యామ కుటుంబంమీద మంగరాజుగారికి చాలా దయ. శ్యామ తండ్రి అప్పట్లియా రోజూ సాయంకాలం మంగరాజుగారి దగ్గిరకి ఒ పొలం మంచి చెడ్డలు మనవిచేసేవాడు. ఎలా సాగుచేస్తే ధాన్యం బాగా పండుతాయో అదంతా అడిగి తెలుసుకొనేవాడు. అయితే శ్యామ మాత్రం అలా చెయ్యడంలేదు.

ఇంతలో అకస్మాత్తుగా మంగరాజుగారి దృష్టి శ్యామ తాలూకు పొలం మీద పడింది. తుళ్లి పడ్డట్టయి, పెద్దరికం కనపరుస్తూ అన్నాడాయన:

"ఆరే శ్యామా, ఏమిటిరా ఇది! ఎంతపని చేశావు? నువ్వు వొట్టి తెలివి మాలిన దద్దమ్మవి. వ్యవసాయమంటే ఏమీ తెలీదు నీకు. ఆకు ఇంత దగ్గిరదగ్గిర వుడిస్తే ధాన్యం పండుతుందిరా? తీసెయ్యి, తీసెయ్యి. సగం వూడపెరికెయ్యి."

కంబారి గోవిందం మడిదిక్కు తేరి పారచూశాడు. మంగరాజుగారి మాట సమర్థించాడు. శ్యామ ఆపాదమస్తకం గడగడ వడికిపోతున్నాడు. చేతులు జోడించి మనవిచేశాడు.

"ప్రతీయేడూ ఇల్లాగే వుడుస్తున్నాను బాబయ్యా! అందరూ ఇలాగే వుడుస్తున్నారు."

మంగరాజుగారు విసుక్కుంటూ అన్నారు:

"ఓరి దద్దమ్మా. మంచి చెపితే వినవేమిరా?"

గోవిందం దిక్కుచూసి ఇసారాచేస్తూ అన్నారాయన:

"ఒరే గోవిందం, చేసి చూపెట్టరా!"

మంగరాజుగారి నోట్లోంచి మాటవచ్చిందో లేదో గోవిందమూ, పాండియా మడిలోకి దిగిపోయి, మడిసగం ధాన్యం మొక్కలు పీకేశారు.

కేకలువేసి బతిమాలుతూ మంగరాజుగారి పాదాలముందు దొర్లుతూ మొత్తుకుంటున్నాడు శ్యామ. మంగరాజుగారికి కోపం వచ్చేసింది. శ్యామని తన శ్యాల కుడిస్థానంలో చేర్చి గద్దించారు.

"నీకు అసలు వ్యవసాయం తెలీదు. తెలుసా? అప్పుపట్టుకెళ్లిన ధాన్యం అసలు వడ్డీలు గిద్దెడు బాకీపెట్టావంటే అప్పుడూ, నా తడాఖా ఏదో చూపిస్తాను."

శ్యామ భయంతో కొయ్యబారిపోయి బొమ్మలా నుంచుండి పోయాడు.

"ఒరే గోవిందం వుండనీరా. వాడి ఇష్టం ఎలా వుంటే అలా చేసుకోనీ వాడు," అనేసి, రెండు మోపుల నారూ పట్టించుకుని, ఊడుపు కాకుండా వుండి పోయిన తమ పొలం దిక్కు వెళ్లిపోయారు మంగరాజుగారు.

# 5

## మంగరాజుగారి కుటుంబం

రామచంద్ర మంగరాజుగారు చాలామందిని పోషిస్తూ వున్న మనిషి. తిండికి ఇంట్లో కుటుంబం పెద్దది. తానూ, ఇల్లాలూ కాక, ముగ్గురు కొడుకులూ, ముగ్గురు కోడళ్లూనూ. నౌకర్లూ, దాసీలు కలిపి మొత్తం ఇరవై మంది పైచిలుకు. ఇలా రమారమీ ముప్పయిమంది మొత్తం. ప్రతీవాళ్లమాటా రాయాలంటే ఎంతో రాయాలి. మీకు మా స్వభావం తెలుసుకదా,—అబద్ధం రాయడమూ, విషయం పెంచి సాగదీసి రాయడమూ, అనవసరమైనవి రాయడమూ మా తత్వానికే పడదు. పైగా "మాలిఖేత్ సత్య మప్రియం" — అంటే సత్యంకూడా కొంతకొంత విడిచి పెట్టెయ్య వలసి వస్తుంది.

లోగిల్లో ఆడవాళ్ల సంఖ్య అధికం. మంగలి రాముణ్ణి మినహాయిస్తే ఇంచుమించు మగ గొంతుక వినిపించదు లోపల. మంగరాజుగారు జంజాటంలో పడివుంటూరెప్పుడూ. కొడుకులు ముగ్గురూ పహిలీపచ్చీసులో వున్నారు. పాచిక లాడడమూ, పిగిలిపిట్టలు పట్టడమూ, వూళ్లోవాళ్లతో కయ్యాలు తేవడమూ — వీటితోనే వాళ్లకి తీరుబాటు వుండేది కాదు. గంజాయి సేవించడానికీ కొంతసమయం కావాలి

కదా! గోవిందపురం సంతలో దుకాణం వాడొకడు, కొనడానికివచ్చిన వొకణ్ణి కోప్పడుతూఅన్నాడు; "పోవోయి, కొనకపోతే మానే. మంగరాజుగారి అబ్బాయి లకే చాలదు సరుకు!"

తండ్రీ కొడుకులూ కలుసుకోవడం వుండేది కాదు. ఒక పెద్దమనిషి వొక నాడు అడిగాడు; "ఏమండీ మంగరాజుగారూ, మీ కొడుకుల్ని మీదు దగ్గిర చేర నివ్వరేం?" అని. మంగరాజుగారు వెంటనే జవాబు చెప్పారు:

"అయ్యో, మీరు శాస్త్రం వినలేదూ?

లాలయేత్ పంచవర్షాణి దశవర్షాణి తాడయేత్.
ప్రాప్తేతు షోడశే వర్షే పుత్రం మిత్రవదాచరేత్.

అంటే అయిదేళ్లవరకూ కొడుకుల నోటినించి లాలాజలం, అనగా తేప కారు తుంది. పదేళ్ల వరకూ వాళ్లని తరమాలి. పదహారేళ్లయాక వాళ్లతో తిక్కన మిత్రు లతో మాదిరిగా, అనగా చెడ్డగా మెలగాలి."

నిజానికి చూస్తే మంగరాజుగారు కొంతమందితో నేస్తంకట్టీ, కొంతమందితో స్నేహం కలిపీ — వాళ్లతో దావాలు చేసీ, వాళ్ల భూములూ అవీ కాజేసీ చెడ్డగా మెలగడం కద్దు. కానైతే కొడుకుల విషయంలో మాత్రం ఆయన ఉపహ రించిన శాస్త్రప్రమాణం సరైందని అనిపించదు. కొడుకులు నిషావేసుకుని ఆస్తి పాడు చెయ్యడం మూలాన తండ్రీ కొడుకుల మధ్య విరోధం అని వినికిడి.

మంగరాజుగారిభార్య లోగిల్లో ఒక గదిలో పడివుంటుంది. ఎవ్వరితోనూ మాటా మంతీ వుండదు. పేదాసాదా, కుంటీ గూనీ, సన్యాసులూ సాధువులూ కోసం మాత్రం ఆమె చూసేది.

కొడుకుల్ల మాట రాయడం మర్యాద కాదు. పెద్దింటి వయసు పిల్లలమాట వీథిలో వేస్తే ఏమంటారు మనుష్యుల్ని. ఝాము పొద్దెక్కాక, పక్కమీంచి లేస్తారు వాళ్లు. రెండు మూడు గంటల్లో పళ్లుతోముకోవడమూ, స్నానాలు చెయ్యడమూ. ఏదో ఇంత ఆరగించడమూ — వీటితోనే పొద్దు పోయేది. తరవాత మళ్లీ పక్క మీద శరీరం వాల్చి నిద్రపోయేవాళ్లు. అవన్నీ రాస్తే ఏం లాభం? పొద్దు వాల్తూ వాల్తూ వుండగా లేచేవాళ్లు. ఇంత పఖాళీ అన్నం [అలవోద్దు] తినేశాక, ఫూల్లోని కబుర్లు వింటూనో, దాసీలమధ్య కయ్యాలు పెడుతూనో, వాళ్ల తగువులు తీరుస్తోనో, నవ్వుతూనో కూచుంటే సగం రాత్రి గడచిపోయేది.

రుక్మిణీ, మరువా, చెమ్మో, నకఘోడీ, తెరీ, విమలీ, శుకీ, పాట్లో, కాశులీ–వీళ్లు కాక ఇంకా ఎంతోమంది వున్నారు దాసీలు. వాళ్ల పేళ్లన్నీ మాకు తెలియవు. అందులో వొకతి బాల విధవ అయితే, వొకతి యువతీ విధవ. వొకతి అజన్మ విధవ అయితే వొకతి సధవ. — రకరకాల పిట్టలు వొక్క చెట్టుని ఆశ్రయించినట్టు వీళ్లంతా మంగరాజుగారిని ఆశ్రయించుకుని వున్నారు. మధ్యమధ్య ఎంతోమంది వస్తున్నారు, ఎంతోమంది పోతున్నారు. లెక్కా జమా లేదు. పనీ పాటూ లేని దాసీలు వొక్క దగ్గర పోగయితే ప్రపంచంలో కయ్యానికి లోటుండదు. మంగరాజుగారి లోగిల్లోనూ ఈ సనాతన ధర్మం తప్పలేదు. అర్ధరాత్రి దాటే దాకా చేపల బజారిలాగ అదేఘోష వినిపిస్తూ వుంటుంది.

# 6

## చంపా

లోగిల్లో ఎంతమందో వున్నారు. వాళ్లల్లో చంపా, వురఫు చంపాఅమ్మగారు, వురఫు హరకళతో మంగరాజుగారికి ఎలాటి సంబంధమో ఎవ్వరికీ తెలియదు. ఆమె జాతీ, కులమూ, పితృవంశమూ — ఈ వివరాలుకూడా ఎవ్వరూ ఎరగరు. చంపా మంగరాజుగారింట్లో దాసీయో, యజమానురాలో కూడా దాని నడవడి బట్టి తెలుసుకునే శక్తి ఎవ్వరికీ లేదు. అయితే మంగరాజుగారింట్లో చంపాకి వున్న అధికారం అపరిమితం అని మాత్రం చెప్పగలం. అధికమంటే, అది ఇంతా అంతా కాదు, మంగరాజుగారికంటే కూడా హెచ్చు. బైటి పాలేర్లు మొదలుకుని కచేరీ గుమాస్తా వరకూ — ఆమెదగ్గిర చేతులు జోడించవలిసిందే.

చంపాకి హరకళ అని మరోపేరుంది, నిజమే. కాని ఆ పేరుపెట్టి ఆమెని పిలవడం విన లేదు. హరకళ అన్నశబ్దానికి వ్యుత్పత్తి ఏమిటో, ఆ పేరు నింద్యమో, ప్రశంసనీయమో ఇది చెప్పడంకూడా మావల్ల కాదు. లోకులు ఆమెని హరకళ అంటారని చెంపా చెవిలో ఎవరో వేశారు వొకనాడు. విని అగ్గిమీద గుగ్గిలం అయిపోయిందామె. ఏడ్చుకుంటూ వెళ్లి మంగరాజుగారితో ఫిర్యాదు చేసింది. చాలా రగడ జరిగింది. అలా ఎవ్వరన్నారో తెందురోజులదాకా దర్యాప్తు జరిగింది. కాని హరకళ శబ్దం ఎక్కడినించి ఉత్పత్తి అయిందీ, ఎంతదూరం వ్యాపించిందీ ఏమీ అంతూ పంతూ చిక్కలేదు. చివర్ని మంగరాజుగారు సతాయిస్తూ అన్నారు:

“ కానీ చూద్దాం. ఖబర్దార్, చంపాని ఎవరూ హరకళ అనకండి. ”

అవాళ గ్రామం ఈ చివరనించి ఆ చివరదాకా, ఇంకా చుట్టుపట్ల మూడు నాలుగు వూళ్లలోనూ అందరినీ అందరూ హెచ్చరించుకున్నారు —

"ఖబర్దార్, చంపాని ఎవరూ హారకళ అనకండి."

నెలా, రెణ్ణెల్లూ, నాల్నెల్లూ ఆర్నెల్లూ, — చిన్న అమ్మాయిలు మొదలుకుని ముసలమ్మలదాకా, కుర్రాళ్లు మొదలుకుని ముసలాళ్లదాకా — జట్టు కలిసిన వాళ్లు కలుసుకున్నారో — అటూ ఇటూ చూసి చిరునవ్వుల్తో హెచ్చరిక చేసుకునే వాళ్లు :

"ఖబర్దార్, చంపాని ఎవరూ హారకళ అనకండి."

క్రమంగా ఆమాట పొట్టిదిగా తయారైంది.

"ఖబర్దార్ ఎవరూ చంపాని — "

"ఖబర్దార్ చంపాని —."

"ఖబర్దార్ —." ఇలాగ. ఆడపిల్లలూ, కుర్రాళ్లూ చప్పట్లు కొడుతూ వీధిలో గెంతేవాళ్లు.

"ఖబర్ దార్ !
గొబరాజైనా చాకి దార్ !"

పిల్లలంటేనే అల్లరి మూక. వాళ్లమాట పాటించకండి. అదంతా అనవసరం. అలావుండనివ్వండి. చంపాకీ మంగరాజుగారి ఇంటికీ అవినాభావ సంబంధం. ఆమె పేరు అనేకసార్లు వింటారు పాఠకులు. అందుకని ఆమె రూపమూ, స్వభావమూ విశదపర్చి చెప్పడం మా విధి. అంతేకాదు, సాహిత్యశాసనాలప్రకారం గ్రంథంలోని నాయికానాయకుల స్వభావ స్వరూపాలు రచయితలు వర్ణించి తీరాలి. పైగా ఈ సనాతన విధానం ఉల్లంఘించడం మాశక్తికి మించినపని. అదీకాక, గ్రంథకర్తలికి వొక దురభ్యాసం కూడా వుంది. ఒక నాయిక దొరికిందంటే బెల్లంకుండ దొరికినట్టు, తక్కినవన్నీ మరిచిపోయి ఆమెనఖశిఖపర్యంతం వర్ణించడానికీ, ఆమె స్వభావం తు చ తప్పకండా రాసెయ్యడానికీ గబగబా కూచుండి పోతారు. రూపమూ, గుణమూ వర్ణించడంలో మేము మాత్రం చేతకాని వాళ్లమనికాదు.

చూడండీ – అరిటీ, పనసా, మామిడీ, దబ్బా–ఇలాంటి చెట్లూ, ఆకులూ, పళ్లూ పువ్వులూ వున్నాయా! వీటితో చంపా శరీరంలో వొక్కొక్క భాగమూ తీసి కలిపేస్తేసరి, రూపవర్ణన పూర్తయి పోతుంది. కాని ఈదినాల్లో అలాంటి

పాతకాలపు వర్ణన పనికిరాదు. ఇంగ్లీషుచదువుకున్న పాఠకులికి రుచికరమైనట్టు ఇంగ్లీషుపద్ధతి వర్ణన అవసరం.

భారతదేశం కవులు అందమైన స్త్రీని "గజేంద్రగామిని" అంటారు. అలా అంటే ఇంగ్లీషు వాళ్ళు "ఛీ ఛీ!" అంటారు. "అలాకాదు, గుర్రంలాగ గేలప్ నడక నడిచే అమ్మాయి అందకత్తె" అంటారు వాళ్ళు. ఆషాఢం ఆఖరంలో మహానది వరదలాగ ఈదేశం ముంచుకు వస్తోంది ఇంగ్లీషునాగరికత. దీని వైఖరి పరికిస్తే, నవనాగరిక చదువు చదువుకున్న మనబాబులు తమ తమ అర్ధాంగలక్ష్ములకి గేలప్ నడక నేర్పడంకోసం కమ్చీలు కావాలని తీర్మానిస్తారేమో అనిపిస్తోంది.

ఆవిషయం ఎలావున్నా, అందకత్తెల నడకకోసం ఉపమేయ పదార్థం పాత కవులు ఎవ్వరూ నిర్ణయించలేక పోయారనే మా అభిప్రాయం. ఏమంటే, మీరే ఆలోచించండి–గుర్రాలూ, ఏనుగులూ, నాలుగు కాళ్ళతో నడుస్తాయి. మనచంపాకి రెండు కాళ్ళేవున్నాయి. అధికంలేవు. కనక ఆమెని గజేంద్రగామినీ అని కానీ, అశ్వవరగామినీ అని కానీ అనడం కేవలం అసందర్భం. పోనీ చంపా వంగి చేతులతోనూ కాళ్ళతోనూ నడిస్తే ఎలా అవుపిస్తుందో అంటే అదీ చెప్పడానికి శక్తి లేదు మాకు. కాళ్ళ సంఖ్యనిబట్టీ చూస్తే హంస సరిపోతుంది. అంచేత ఆమెని మరాళగామిని అంటే తప్పులేదు. అలంకారశాస్త్ర సంప్రదాయం నిలబెట్టాలంటే ఉపమానమూ ఉపమేయమూ సరిపోవాలి. మరాళం (హంస) వొకప్పుడు వుత్తి పాదాలతోనూ, వొకొక్కప్పుడు రెక్కలుచాపీ, కొంచెం కొంచెం ఎగురుతూ పోతూ నట్టు నడుస్తుంది. మనచంపా వీధిలో గోర్జిమధ్య మణియాబంది * పైటచెంగు ఎగరవేస్తూ, రెండు రెక్కలూ వూపుకుంటూ నడిచినప్పుడు సరిగ్గా ఆమెని మరాళగామిని అనవచ్చు.

చంపావయస్సు మాఊహ ప్రకారం ముప్ఫయి దరిదాపు. కాని ఆమెనోట అనేక సార్లు విన్నదేమిటంటే, మంగరాజుగారి పెళ్ళినాటికి ఆమె ఇరవై వొక్క రోజులపిల్ల అని. ఈలెక్కనిచూస్తే ఆమె వయస్సు చాలా లేత వయస్సు. ఇలాంటి యువతి రూపం వర్ణించాలంటే చాలా జాగ్రత్త కావాలి. చాలా తెలివి తేటలూ కావాలి. బహుముఖ పాండిత్యమూ కావాలి. విదేశీవస్తువులతో పాటు అభిరుచి అనే పదార్థం కూడా విశేషంగా ఈ దేశానికి దిగుమతి అయింది. దాని మీద దృష్టిపెట్టకపోతే మీపని పుస్సు మంటుంది. మీరు మాఘులకింద జమఅయి

---

* మణియాబంది : బడంబా (ఒరిస్సా)లో మణియాబంధ అన్న చోట పట్టంచువేసి నేసిన నేతచీర.

పోతారు. అవేళ ఉపేంద్రభంజుగారి దురవస్థ చూసి మాకు బుద్ధివచ్చింది. తన తలిదండ్రుల పుణ్యబలంవల్ల అయనేదో తప్పిపోయాడు. కాని లేకపోతే లక్ష్మీపతి మొదలుకుని లక్ష్మీపుత్రులదాకా అందరూ వొక్కే పల్లవి పట్టారు కదా ! ఆయన అదృష్టం ఏమైవుండేదో, భగవంతుడికే తెలియాలి.

అంత మహారథికే అలాంటి దశ ! మాబోట్లు లెక్కా- జమా ? గురువుగారి దయవల్ల మేమూ కసింత భావకవిత్వం కట్టగలం. వీడు వొఠి కోతలరాయడనీ, ఏమీ తెలీదని అనుకునేరు మీరు. కాదు వినండి :

అర్థవక్షు-ఉల్లంగినీ, మందహాసినీ,
వస్త్రశూన్యా, రిక్త హస్తా, తురంగగామినీ,
మార్జాలనయనా, తామ్రకేశా,
స్వాధీన భర్తృకా,
అహో, అపరూప స్వర్గవిద్యాధరీ !

ఇక, అభిరుచి లేని ఉపేంద్రభంజు కవిత్వం వింటారా ?

" అవనిపైనుండుగా కనటికంబము లెట్టు
లనటి కంబములపై అవని నిలిచె. "

పైన రాయడానికి సాహసం చాలడంలేదు. ఏమో పిడుగేపడుతుందేమో ! మేం భావకవిత్వం రాయగలం. నిజమే. కాని రెండురోజులు తరవాత వచ్చి అబద్ధాలు రాయడానికి సాహసం కలగలేదు. ఫలానా బలిపట్నం బాలికా విద్యాలయంలోని పంచమశ్రేణి విద్యార్థిని శ్రీమతి చెమీబెహరా మొదలుకొని బేథూను స్కూలు పెద్ద తరగతి విద్యార్థిని మిస్. ఎస్. ఎం. రే-వురపు శశిముఖిరాయి వరకూ చూశాంకదా, ఎవరూ భావకవిత్వంలోని సౌందర్యం పెంచి పిల్లికళ్ళలా చెయ్యలేక పోయారు. ఇటునిజం రాస్తే మేం అనాగరికుల్లో జమ అయిపోతాం. అబద్ధం మా కలంలోంచి రాదు. ఏమిటి సాధనం ? రఘువంశం రాయడానికి కూచున్నప్పుడు కాళిదాసు కలం సాగలేదు. అప్పు డతడన్నాడు :

అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వ సూరిభిః,
మణౌ వజ్రసముత్కీర్ణేసూత్రస్యేవాస్తి మే గతిః

ఇప్పుడు కొంత దారిదొరికింది. స్వయంగా కాళిదాసే చంపా రూపవర్ణనకి నమూనా రాసి పెట్టేశాడు. ఆయన ఏమన్నాడంటే-

తన్వీ శ్యామా శిఖరిదశనా పక్వబింబాధరోష్ఠీ

అస్వార్థ — తను అంటే శరీరం. చంపాకి తనువుంది కనక ఆమె తన్వి. శ్యామా అంటే నలుపూ కాదూ, తెలుపూ కాదు. శ్యామల వర్ణం. చంపా శ్యామల వర్ణి. శిఖరి దశనా — శిఖరి అంటే కొండ. దశనమంటే పన్ను. చంపా ముందరి పళ్లు వొకదానిమీద వొకటి ఎక్కి కొండశిఖరంలాగ పైకి వచ్చి వున్నాయి. అంచేత ఆమె శిఖరి దశన. ఇక పక్వబింబాధరోష్టి — పక్వమంటే పండిన, బింబ మంటే కాకి దొండ. అధరోష్ఠమంటే కిందిపెదవీ మీదిపెదవిన్నీ. అనగా తాంబూలం వేసుకోవడంవల్ల చంపా రెండుపెదవులూ ఎర్రగా వుంటాయి. అంచేత ఆమె పక్వబింబాధరోష్టి. ఇత్యాది —

కాళిదాసు ఇంకా — "మధ్యేక్షామా — స్తోకనమ్రా —" మొదలైనవి ఎన్నో అన్నాడు. కాని చంపా తాలూకు ఆ అవయవాలన్నీ వస్త్రంతో కప్పేసి వున్నాయి. అంటే మాకు అవి ఏవీ అవుపించవు. అంచేత వాటిని వర్ణించడం మాకు ఇష్టంలేదు. కాళిదాసు మాట అలా వుంచండి. —రెండు కళ్లతోనూ చూడకపోతే గురువు చెప్పినా రాయం. కాగా చూసినవి మాత్రం వర్ణించకండా వదిలే రకం కూడా కాదు మేం. వినండి.

కాటుక పూసిన కళ్లూ
కారా కిల్లీ నమిలే పళ్లూ
పసుపూ నూనే రాసిన దేహం
కుక్కలా వేగం దూరును గేహం
కట్టిందనిమిది గజాల చీరా
సిగలో పువ్వుల హారం భళిరా
గబగబ దబదబ చలితం తస్యా
నటనో పరుగో విషమ సమస్యా
కరముల గాజులు కంకణమ్ములూ
కాళ్లకి పిల్లేళ్లూ కడియాలూ
గోష్ఠి మధ్యలో అడుగులు వేస్తూ
నడుస్తు పోవును దిక్కులు చూస్తూ
చూసిన గ్రామస్థులు తుళ్లి పడీ
పారిపోదు రటునిటు భయం పడీ
ఇతి రూపవర్ణనం విముక్త ఛందే
అతః గుణవర్ణ్యతే వివిధ ప్రబంధే.

# 7

## గ్రామదేవత మంగళ

యా దేవీ వృక్షమూలేషు శిలారూపేణ సంస్థిత,
నమస్తస్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః
మృత్తికాశ్వగజారూఢా । వంధ్యాయాః। పుత్రదాయినీ,
శోకసంహారిణీ దేవీ నారాయణీ నమోస్తుతే.

అసురదిబ్బ పడమటిమూల, ఊళ్ళోనించి దిబ్బకి వెళ్ళే దార్లో కుడిచేతి పక్కగా ఒక పెద్ద మర్రిచెట్టుంది. చెట్టు మొదలు అవుపించదు. ఇరవై ముప్ఫయి వూడలు దిగి, కొమ్మలు ఒకదాన్ని ఒకటి పెనవేసుకుని సుమారు పన్నెండు పదమూడు కుంటలు * నేల ఆక్రమించుకుని వుంది చెట్టు. ఆకులూ, చిన్నచిన్న కొమ్మలూ ఎంతదట్టంగా అల్లుకుని వున్నాయంటే ఎంతవేడి పిసరంతైనా చెట్టు మొదటికి తగలదు. చాలపెద్ద కాలంచెట్టు. ఇది సత్యయుగం నాటి అమ్మవారి చెట్టని చెపుతారు ముసిలాళ్లు. వాళ్ళు చిన్నప్పటినించీ చూస్తూ వస్తున్నారు. పెరగడం కాని తరగడం కానీ లేదు చెట్టు. గతపడుతుల మాసం అమావాస్యనాడు పెద్ద తుఫాను వచ్చింది. ఊళ్ళోని మునగచెట్లూ అరిటిచెట్లూ ఇంచుమించు అన్నీ విరిగిపోయాయి. కాని ఈమర్రిచెట్టు నుంచి చిన్న ఆకుకూడా రాలలేదు. అమ్మవారి మహిమ.

మధ్య నాలుగు వూడలు చెట్లమల్లే నుంచుని వున్నాయి. వాటి మధ్య గ్రామదేవత ఆస్థానం. అమ్మవారిపేరు బుఢీమంగళా. అమ్మవారి దేవస్థానం భూమి రెండున్నర ఎకరాలుంది. అమ్మవారి ఆస్థానపీఠం యాభై సెంట్లు. తక్కిన రెండు ఎకరాల మాగాణీ అమ్మవారి పూజచేస్తూ పూజారి అనుభవిస్తున్నాడు. గ్రామంలో ముఖ్యంగా ఆడవాళ్ళ మధ్య చెప్పలేనంత పలుకుబడి పూజారిది. అమ్మవారు పూజారికి కల్లోకనపడుతూ వుంటుంది. అన్నీ చెపుతూ వుంటుంది. పెరట్లో కాసిన అరటిగెల కానీయండీ, వంకాయ కానీయండీ, గుమ్మడికాయ కానీండీ అమ్మవారికి ఇవ్వకుండా ఎవ్వరూ తినరు.

అమ్మవారి మండపం డాబా. డాబాకింద అమ్మవారి విగ్రహం. విగ్రహం బాగా పెద్దది. బరువు పదిమణుగులికి తక్కువ వుండదు. రెండుమూడు రుబ్బురోళ్ళ

* కుంట అని మనదేశంలో కొన్నిచోట్ల అర ఎకరం కింద వాడతారు. ఇక్కడ కుంట అంటే నాలుగు సెంట్లు.

కలిస్తే ఎంతబరువో అంతకంటె అధికమే వుండవచ్చు. విగ్రహం నిండా నాలుగంగుళాల దళసరిని సిందూరంపూసి వుంటుంది. పెద్దవిగ్రహం కాక మరి నాలుగు చిన్నవిగ్రహాలూ వున్నాయి. మంటపం కుడిపక్క కొంచెందూరంలో మట్టివి విరిగి పోయిన గుర్రాలూ, ఏనుగులూ, బొమ్మలూ వందో వందన్నరో కుప్పపడి వున్నాయి. అమ్మవారి వాహనం కోసం మట్టి ఏనుగులూ, గుర్రాలూ ఇస్తే చిన్న పిల్లల జబ్బులు వదిలిపోతాయి. అప్పుడప్పుడు పెద్దవాళ్ళ జబ్బులు కూడా వదలడం కద్దు. అంచేత అమ్మవారి పశువుల పాక ఎప్పుడూ ఖాళీగా వుండేది కాదు.

అమ్మవారి పూజ రోజూ జరిగేది కాదు. ఎండుటాకులూ, చెత్తా, చెదారమూ అమ్మవారిమీద కుప్పపడి వుండేది. గ్రామంలో ఎవరికయినా పెళ్ళికానీ, పునస్సంధానం కానీ జరిగినప్పుడూ, లేదా ఎవళ్ళ దయినా మొక్కుబడి వున్నప్పుడూ మాత్రం పూజా అదీ జరిగేది. ఊళ్ళో కలరావస్తే ఇహ చెప్పే అక్కర్లేదు. ఎడతెరిపి లేకండా జరిగేదిఅమ్మవారి పూజ. కచేరీ సమాస్తాలకిమల్లే అమ్మవారికి నెలజీతం లేదు. ఆపదవస్తే వకీళ్ళవాకిటా, డాక్టర్లవాకిటా జనం వుంటారే, అదిగో అలాగ. ఆపద వచ్చి పడ్డప్పుడు అమ్మవారిగుడి దగ్గిర జనం కిట కిట లాడేవారు. ఊళ్ళో చందా డబ్బులతోనే పూజ జరిగేది.

అమ్మవారు చాలా ప్రత్యక్ష దేవత. ఆమె అనుగ్రహం మూలాన గ్రామంలో ఏ ఆపదా వుండేది కాదు. అప్పుడప్పుడు గొట్టాలమ్మ శివాలెత్తి వూళ్ళో ప్రవేశించేది. కాని అమ్మవారిని బాగా పూజిస్తే, పందొమ్మిదిమందికంటె హెచ్చుమందిని తీసుకువెళ్ళలేకపోయేది. వదిలేసి వెళ్ళిపోయేది.

మీరు నాగరికతగల పాఠకులు. ఇది విని నవ్వుతారు. వైజ్ఞానికశాస్త్రం జోడించి, రోగంవస్తే మందుతినాలి కాని, అమ్మవారి పూజలేమిటయ్యా అని అడుగుతారు. బంగాళాదేశంలో ఎపెడిమిక్కు ఫీవరూ, బొంబాయి ప్రత్యేక గౌరవం పొందడమూ దీనికి కారణము.

ఎవరెవరు ఎంతమంది గొడ్రాళ్లు అమ్మవారి వరంవల్ల సంతానవతులయ్యారో ఆ వివరాలు అధికంగా చెప్పలేం. ఊళ్లో సంతానం కన్న స్త్రీలు వివాహానికిముందు గొడ్రాళ్లుగానే వుండేవాళ్లు. ఇది మాత్రం నిజం.

దీఘికి వెళ్లడానికి అమ్మవారిముందునించి వొకదారివుందని ముందే చెప్పాం. ఊళ్లోని ఆడవాళ్లు ఆదారినే రాకపోకలు చేసేవాళ్లు. ఒక స్త్రీ – వయస్సు బహుశా ముప్ఫయి వుంటాయి – ప్రతిరోజూ దీఘిలో స్నానం చేసి వచ్చి, చంకలోని నీళ్లకడవ అమ్మవారిముందు కింద దించేది. జీడికంపతీసి అమ్మవారి ఎదటి

భాగం పూడ్చేసేది. పుడిసెడునీళ్లుతీసి అమ్మవారిచెట్టుమొదట పోసేది. నేలమీద నుదురు తగిలించి నమస్కారం చేసేది. మెల్లి మెల్లిగా ఏదో అమ్మవారికి విన్న వించేది. ప్రతీ సాయంకాలం వొక వత్తి వెలిగించి తెచ్చి అమ్మవారి గద్దెదగ్గిర సంజ దీపం పెట్టేది. మళ్లీ ఏదో మొక్కుకుండేది. ఆమె ఇలా చెయ్యడం ఆరు మాసాలనించీ చూస్తున్నారు జనం. ఆమె మనసులోని మాట ఎవ్వరికీ తెలియదు. ఏమంటే ఆమెకి సిగ్గు హెచ్చు. ఎల్లప్పుడూ ముసుగుతోనే వుంటుంది. ఎవ్వరితోనూ కలిసేద్ది కాదు. ఎవ్వరితోనూ మాట్లాడేది కాదు.

ఊళ్లోని సామ్ములు కాపు కుర్రాళ్లు ఎండప్పుడు మైదానంలో పశువులు వది లేసి, అమ్మవారి చెట్టుకింద నీడలో ఆడుకునే వాళ్లు. అవాళ హటాత్తుగా ఆట మానేసి మునకాల కర్రలు పట్టుకుని అందరూ మూకగా నుంచుండిపోయారు. వాళ్లని చూసి వూళ్లో పది పదిహేనుమంది వచ్చి అక్కడ మూగారు. నిన్న అమ్మ వారిపూజ జరగలేదుకదా, అమ్మవారిదగ్గిర పూజాసామగ్రి ఎలా వచ్చింది? మందార పువ్వులూ, గన్నేరుపువ్వుల దండలూ, పాకం పట్టిన పేలాలూ, నెయ్యిలూ చుట్టూ విరజల్లి పడివున్నాయి. అమ్మవారి విగ్రహంమీద కొత్తపశువు రాసివుంది. ఏమిటిది?

అమ్మవారి పూజ గ్రామంలో వొక ప్రధాన విషయం. చందాలు వసూలు చేస్తారు. బాజాలు వాయిస్తారు. ఊళ్లో అంతా చూడ్డానికి వస్తారు. పూజ సాయంకాలమవు డవుతుంది. మొక్కుబడి పూజలుకూడా అలాగే అవుతాయి. ఏదీ, నిన్న బాజాలు మ్రోగలేదే? సాయంకాలం పూజ జరగలేదే? ఇవన్నీ ఎలా వచ్చాయి?

ఒక కుర్రాడు అరుస్తూ అన్నాడు: "ఇదేమిటి? ఇదేమిటి?" అని. అందరూ పరుగెత్తివెళ్లి చూశారు. అమ్మవారి వెనకాల పెద్ద సొరంగం! అమ్మవారి మండపంనించి మూడు మూరల దూరంలో వుంది స్వొరంగం. దాని వెడల్పు బాగా పెద్దదిగా వుంది. ఒక మనిషి వెళ్లి అందులో కూచ్చో వచ్చు. ఊరంతా ఈ మాట గుప్పుమంది. చూడాలని పరిగెత్తారు జనం. మంగరాజుగారు కూడా విన్నారు; పరిగెత్తుకు వచ్చారు. ఎంతో మీమాంస జరిగాక ఏదో భక్తుడి కష్టం నివారించడం కోసం నిన్న నిశిరాత్రివేళ అమ్మవారు వేంచేశారని నిశ్చయమైంది. అమ్మవారి వాహనం పెద్దపులి సొరంగం తవ్వింది. "ఈ సొరంగంలో ఇప్పుడూ పులి వుందనే తెలుస్తోంది" అన్నారు మంగరాజు గారు. పులి పేరు వినగానే అందరూ పారి పోయారు. చివర మంగరాజుగారు రాముడి మొహంకేసి చూసి వెళ్ళిపోయారు. ఆ చూడడంలో ఏదో కార్యసంకేతం వుండవచ్చు.

ఆ మర్నాడు ఎవ్వరూ సారంగం చూడలేదు. ఈ విషయం వూళ్లో చాలా కాలంవరకూ ఆలోచన సాగింది. భీముడమ్మ మంగలి ముసిల్ది అంది: "నావయస్సు ఏడు పదులో ఎనిమిది పదులో కావచ్చింది. ఊళ్లో ఎంతమంది ముసిలాళ్లున్నారో అందరి పెళ్లిళ్లూ నా చేతుల మీద నేనే చేశాను. * అందరూ నా కళ్లముందు పిల్లలు. నేను స్వయంగా నాకళ్లతో అమ్మవార్ని దీంతో నాలుగు సుట్లు చూశాను. నిన్న అర్ధరాతిరివేళ కాళ్లు మడుచుకుందికి లేచాను. వీధిలో గోర్జిమధ్య సాంబ్రాణి వాసన వేసింది. ఘల్లుఘల్లుమనీ వినిపించింది. చూతునూ, పులిమీద కూచుని అమ్మవారు వేంచేస్తున్నాది. ఓయిబాబూ, ఎంతుందో పులి! నేను ఎన్ని పుల్లో చూశాను. కాని ఇంత పెద్దపులి ఎక్కడా చూళ్లేదు. దాని పొడుగు ఏడో ఎనిమిదో మూళ్లుంటుంది. బుర్ర పేద్ద పోతుబుర్రలాగ కారునలుపు. నాకేసి ఇంతేసి గుడ్లు చేసి చూసింది. నేను భయపడిపోయి ఇంట్లోకి ఇళ్లిపోయి తడక బిగించేసుకున్నాను."

నిశిరాత్రప్పుడు వీధిలో పులి నడిచిన శబ్దం విన్నట్టి మరి నలుగు రైదుగురు ముసిలాళ్లూ సాక్ష్య మిచ్చారు. ఉదయం పులి అడుగులు స్వయంగా చూసినట్టు సాలి రామన్న గట్టిగా చెప్పాడు. అమ్మవారు వేంచేసిన విషయం సందేహం లేకండా స్థిరపడిపోయింది.

## 4

## జమీందారు సేఖ్ దిల్‌దార్ మియాఁ

సేఖ్ కెరామత్ అలీగారి ఇల్లు మొదట ఆరా జిల్లాలో వుండేది. ఇపుడు మేదినీపురం జిల్లాలో వుంది. సేఖ్ కెరామత్ అలీగారిని అందరూ అలీమియాఁ అని పిలిచేవాళ్లు. మేముకూడా ఆపేరే రాస్తాము. అలీమియాఁ మొదట గుర్రాల వర్తకుడు. పడమట హరిహరఛత్ర మేలానించి గుర్రాలు తెచ్చి బంగాళా దేశం లోనూ, ఒడిశా దేశంలోనూ విక్రయించడం ఆయన వ్యాపారం. మేదినీపురం జిల్లాలో పెద్ద దొరగారికి వొక గుర్రం తెచ్చి అమ్మాడాయన. ఆగుర్రం చాలా మంచి దయింది. దానిమీద దొరగారు సంతోషించి అలీమియాఁ గారి వ్యాపారమూ, రాబడీ మొదలయిన భోగట్టా అడిగి కనుక్కున్నారు. గుర్రాల వ్యాపారంలో

* పెళ్లిళ్లలో ఎన్నో పెళ్లి పనులు మంగలిస్త్రీ చెయ్యడం ఒడిశాలో సంప్రదాయం.

విశేషంగా లాభంలేదని తెలుసుకుని, ఆలీమియాఁగారికి ఏదన్నా ఉద్యోగం ఇవ్వా లని దయ కలిగింది దొరగారికి. అందుకని మియాఁగారు ఏమయినా చదువు కున్నారా లేదా అని ప్రశ్నించారాయన.

"హుజూర్. నేను పార్శీ చదివానండి" అన్నారు ఆలీమియాఁగారు— కాగితం కలం తెప్పించండి. నాపూర్తి పేరు రాశేస్తాను."

పూర్వం పార్శీవిద్యకి చాలా గౌరవం వుండేది. కచేరీలో రాజభాషగా వుండేది పార్శీ. భారతదేశం నుదుట ,అల్లా రాసిన రాత—నిన్న పార్శీ వుండేది. ఇవాళ ఇంగ్లీషు. రేపు మరేమవుతుందో! కాని వొకటి మాత్రం నిజం. దేవ నాగరి భాగ్యం మాత్రం రాతికిందే. ఇంగ్లీషు పండితులు సంస్కృతం మృత భాష అంటారు. మేము ఆదే మరికొంచెం తెలిసినట్టు అంటున్నాం—'సంస్కృతం సగం చచ్చిన వాళ్ళ భాష' అని.

అదలా వుండ నివ్వండి. దొరగారి దయవల్ల మియాఁ సాహెబుగారికి వొక ఉద్యోగం దొరికింది. ఆ ఉద్యోగం పేరు థానాదారోగా. మియాఁ సాహెబు గారు అనేక విఘ్నాల్లోంచి నిర్విఘ్నంగా ముప్ఫయిసంవత్సరాలపాటు ఈఉద్యోగం చేశారు. ఎంతో అంత ఆస్తీ ఆర్జించారు. ఇల్లూ తోటలూ - ఇవి కాక నాలుగు జమీందారీ తాలూకాలూ సంపాదించారు.

పూర్వం ఒడిశా జమీందారీలు యావత్తూ కలకత్తాలో వేలంజరుగుతుండేవి. మియాఁగారు వొకసారి వొకఖానీకేసు చలాను తీసుకుని కలకత్తా వెళ్ళారు. అప్పుడు ఫతేపూరు తాలూకా సరసంఘ వేలంలో కొన్నారు.

మామాటమీద మీకు సందేహం కలగవచ్చు. థానా దారోగా అంటే ంగాబెల్లో పోలీసు ఇన్స్పెక్టరన్న మాట కదా! ఇంత డబ్బు అతడెలా ఆర్జిం చాడు? కాని మీరు కళ్ళుమూసుకుని చదువుకు వెళ్ళండి. మామాటలో వొక అక్షరం అబద్ధం లేదు. నగ్న సత్యం. ఒక డిప్యూటీతాహసీలుదారు గోవిందపండా దావాలో డిక్రీ ఇచ్చినప్పుడు ఆబ్రాహ్మడు తహసీలుదారుని "బాబూ, మీకు దారోగా పని దొరకాలి" అంటూ ఆశీర్వచనంచేశాడు. ఇది అందరూ ఎరుగుదురు. ఇప్పుడు మీకు బోధపడిందా? బుద్ధిమంతులు చిన్న ఇసారాతో సర్వమూ గ్రహిం చేస్తారు... కలకత్తాలో మోతీశీలు గారు మొదట ఖాళీసీసాఅమ్ముతూ వుండేవారు.

ఎవరన్నా బి. ఏ., ఎం. ఏలు పాసయిన బాబులు అలీమియాఁ సంగతి విని కుంఠి వాడిలా నిట్టూరుస్తారేమో అని మాభయం. రామరామ! మియాఁ, తిర గేసిన కలంతో వృత్తి సంతకం చేసేసి జమిందారయాడు. మేం సరయిన కలంతో తెగేసి వ్యాసాలు రాస్తున్నా పూటకి గతిలేదు. అసలు సంగతేమిటో తెలుసా అండి,

"భాగ్యం ఫలతి సర్వత్ర నవిద్యాన పౌరుషం."

అలీమియాఁ గారికి వొక్కడే కొడుకు. అతడి పేరు సేఖ్ దిల్ దార్ మియాఁ వురఫ్ ఛోటా మియాఁ. కుమారుణ్ణి చదివించి ప్రయోజకుణ్ణి చెయ్యడంలో దారోగా గారి అశ్రద్ధ ఏమీ జరగలేదు. పార్శీ చదివించడం కోసం ఎంతో కాలం ఇంట్లో పార్శీ గురువు (అఖూను) ఏర్పాటై వున్నాడు. ఛోటా మియాఁ పది హేను సంవత్సరాలు వచ్చేసరికి పార్శీ అక్షరాలూ, గుణింతమూ నేర్చేసు కున్నాడు.

ఛోటా మియాఁ గారికి ఇరవై రెండేళ్లు నిండి పోయాయి. ఇంతవయస్సులో గురువుగారిముందు కూచుని వూగుతూ పుస్తకం చదువుతూ వుంటే లోకులు ఏమను కుంటారు? స్నేహితులు వచ్చి వూరికే కానుకుని కూచునే వాళ్లు. వాళ్ల కష్టంచూసి మియాఁ గారు సహించలేక పోయేవారు. పైగా అప్పుడప్పుడు అఖూనుగారు అనే వారు: "నిశాఖానేసే అద్మీ జాన్వర్ హో జాతాహై" అని. ఇది సహించ వలసిన మాటేనా మరి?

ఒకనాడు మధ్యాహ్నం గురువుగారు భోజనం చేసేసి వెల్లకిలా పడుకుని నిద్రపోతున్నారు. కేవటవాళ్లు తాళ్లు పేనడం కోసం పీచువిప్పి పెడతారు. అదిగో అలాగ వోఇంత పండుగెడ్డం ఆయన మెడా గుండెలూ కప్పేసి వుంది. ఇంతలో వొక మండుతూన్న కట్టి పుల్ల వచ్చి గురువుగారి గెడ్డాం మీద పడింది. చిటపట గెడ్డాం కాలి అగ్గి నిప్పు గుండెమీద చుర్రుమంది. కంగారు పడి లేచిపోయి, "తోబా తోబా" అంటూ గెడ్డాం దులుపుకున్నారు గురువుగారు. కట్టెపుల్ల ఎగిరి నిప్పు

"ఆ మేడీతో జాకే, ఆ మేడీతో జాకే" అంటూ అఖాన్‌జీగారు గదంతా గంతులేసి అగ్గి ఆర్పడం మొదలెట్టారు.

లంక కాల్చినప్పుడు ఆంజనేయులవారి మొహానికి అగ్గి ముట్టుకుంటే ఎలా కనపడిందో వాల్మీకి మహారుషి విడమర్చి రాయలేదు. అందుకని మేము ఉపమానం ఖిషపెట్టి అది రాయడం కూడదనే భావిస్తున్నాం.

"సర్వనాశం సముత్పన్నే అర్థం త్యజతి పండితః"

అఖాన్‌జీగారు ఈనీతిశాస్త్రం ప్రకారం సగం సగం గెడ్డం రక్షించుకున్నారు. బిస్మిల్లా, బిస్మిల్లా అంటూ ఆరాత్రంతా గదితలుపు బిడాయించి లోపలే వుండి పోయారు. ఆ మర్నాడు ఉదయంనించీ మేదినీపురంలో అఖాన్‌జీని ఎవ్వరూ చూసిన పాపాన పోలేదు.

ఈ సంగతి అలీమియాఁ గారి చెవిలో పడింది. "కుచ్ పరవా నహీఁ," అన్నాడాయన — "నా దిలావ పరీక్షలో నెగ్గేశాడు. నేను కేవలం నాపేరు మాత్రం రాస్తాను. ఇంతసంపద సంపాదించాను. నా దిలూ ఎంతో నేర్చుకున్నాడు. ఆవాళ నాఎదట పరీక్ష ఇచ్చాడు. వాడి పేరు వాడు రాసేశాడు. కలకత్తా, మేదినీపురమూ, ఏనుగూ, గుర్రమూ, తోటా, పొలమూ — ఎన్నో రాసేశాడు. పెద్దదొరగారికి తెలిసిందంటే వెంటనే వాడికి దారోగాగిరి ఇచ్చేస్తారు. నేనే ఈ మాట తెలీకండా దాచాను. దిలూని నేను నౌకిరీ చెయ్యనివ్వను. కుర్రాడు వాడు. కష్టపడలేడు."

తరవాత అలీమియాఁ కొడుకుని దగ్గిర కూచోపెట్టుకున్నారు. మంచీ చెడ్డా ఎన్నో ఉపదేశాలు చేశారు. విశేషించి ఒడిశా జమీందారీ గురించి చెపుతూ ఇలా అన్నారు:

"చూడూ దిలూ, ఆదేశంలో కరణాలున్నారే, వాళ్ళూ పక్కాదొంగలు. లెక్కల్లోనూ వాటిల్లోనూ నేను తెలివయిన వాణ్ణని వాళ్ళు నన్ను టోకరాకొట్టించ లేక పోతున్నారు. వాళ్ళమోసం ఎలావుంటుందో వింటావా? ఒకటీ, రెండూ మూడూ, నాలుగూ– ఇదికదా లోకంలోని లెక్క? ఒకటీ ఒకటీ రెండు. రెండు రెళ్ళునాలుగు. చూశావా, ఒకటీ, రెండూ, నాలుగూ. బీచ్‌మే తీన్ కహాఁగయా? ఈతీన్ రుపయా చోరీ. ఇలా వుంటుంది."

జమీందారు వంశం పరిచయం చెయ్యడం కోసం ఇన్నిమాటలు చెప్పవలసి వచ్చింది. అయితే ఇదంతా పాతసంగతి. సేఖ్ కరామత్ అలీ చచ్చిపోయి

అయిదేళ్ళు దాటింది. ఛోటామియాఁ సేఖ్ దిల్ దార్ మియాఁ ఇప్పుడు స్వయం సర్వాధికారి.

రాత్రి సుమారు వొక ఝాము గడిచి వుంటుంది. జమీందారు సేఖ్ దిల్ దార్ మియాఁ కచేరీ హాల్లో కూచుని వున్నారు. కచేరీ ఇల్లు మేడ. మేడంటే చిన్నదీ చిటికెడీ కాదు. పొడవు వెడల్పులోనూ చాలా పెద్దది. హాల్లో పెద్ద జంబుఖానా పరిచి వుంది. బహుశా అది ఈ నాటిది కాదు. చాలా పాతది. అక్కడక్కడ పది పన్నెండు చోట్ల నూనెమరకలున్నాయి. అగ్గి పసర్లు పడి కాలిపోయిన కన్నాలు వొక ఇరవయ్యన్నా వుంటాయి. అంచులు చిరిగిపోయి వున్నాయి. జంబుఖానా మీద గోడకి దగ్గిరగా వొక బనారసు పట్టు పక్క పరిచి వుంది. గోడకి అనించి పెద్ద బనారసు బాలీసూ, రెండు పక్కలా గుమ్మడి కాయల్లాగ గుండ్రనివి రెండు బనారసు దిండ్లూ వున్నాయి. పక్కమీద స్వయం జమీందారు సేఖ్ దిల్ దార్ మియాఁ ఆశీనులై వున్నారు.

జరీ బుటాపని చేసిన వొదులు పట్టు పైజామా, సాటిను చిప్కన్, తలమీద బనారసు టోపీ వేసుకుని వున్నాడాయన. అత్తరులో ముంచిన దూదిపుల్ల చెవికి తగిలించి వుంది. ఎదురుగ్గా వెండి అత్తరుదానూ, గులాబుదానూ,— వాటి దగ్గిర పెద్ద వొక ఏడుమూరల గొట్టం తగిలించిన గుడుగుడు హుక్కా, హుక్కా మీద చిన్న పిడతలాంటి చిలుమూ, దానిమీద సపోషూ — అంటే మూతా వున్నాయి. హుక్కాకి నాలుగు పేటలు వెండి గొలుసులు వేలాడుతూ నేల నంటుతున్నాయి. శివుడి ముందు రోగంతో వున్న భక్తుడు సాష్టాంగ పడ్డట్టు గొట్టం మియాఁ గారి పాదాలంటుతూ పడివుంది. ఇవాళ దాని మీద ఆదరం లేదు.

చక్రం తిరుగుతూ వుంటుంది. కిందవున్న రేకులు మీదికీ, మీదవున్నవి కిందికీ వస్తూవుంటాయి. మనుష్యుల మాదిరిగానే అచేతన మయిన పదార్థాల్లోకూడా భాగ్య పరివర్తనం కనిపిస్తూ వుంటుంది. హాల్లో అక్కడా అక్కడా, మూలల్లోనూ మొండి చీపురూ, నీళ్ల ఝారీ చెంబూ, రెండు మూడు హుక్కా చిలుములూ, గుడాకు బూడిదా, గంజాయి నుసీ, పుల్లి తొక్కలూ, మేక పెంట్రికలూ — ఇలా పనికి వచ్చేవీ, పనికి మాలినవీ ఎన్నో వస్తువులు పడివున్నాయి. వాట్లో అన్నిటికంటే అధికం తాంబూలం వుమ్ములూ, తాంబూలం బెరడున్నూ. మా నూత్న బుద్ధి వల్ల కేం గ్రహించిం దేమిటంటే, ఈ హాల్లో అప్పుడప్పుడు చీపురు ఆడుతూ వుంటుందని. అలాకాకపోతే మూలల్లో అంత చెత్త ఎలా చేరుకుంటుంది?

ఇంటి పైకప్పు పెచ్చులూడిపోయి వుంది. అద్దాల బీరువాల్లో లా పుస్తకాలు సర్దేసుకుని, టెక్కేలకి చేర బడి క్లయింట్లకోసం చూస్తూ కూచుంటారే వకీళ్లు, అదిగో అలాగ పట్లల్లేసి, ఈగో దోమో పడుతుందని కాసుకు చూస్తున్నాయి సాలెపురుగులు. డాబాకమ్ముల ఖాళీల్లో పిచ్చికలు గూళ్లు కట్టుకున్నాయి. ఆ గూళ్ల ల్లోంచి వుండీ వుడికీ వొక గడ్డి పరకో, చిన్న పుల్లముక్కో కిందికి జారుతూ వుంటాయి.

మేడకింది అంతస్తు ఇవాళ నిశ్శబ్దంగా వుంది. మియాఁ సాహెబుగారు బుగ్గకింద చెయ్యిపెట్టుకుని మౌనంగా కూచుని వున్నారు. వాటర్లూ యుద్ధంలో వోడిపోయిన నెపోలియను కూడా ఇలా ఆలోచనా మగ్నుడై కూచోలేదు. ఏమంటే సెంట్ హెలెన్ పంపెయ్యడం కోసం ఇంగ్లీషు వాళ్లు పట్టుకున్నా రతణ్ణి.

మియాఁగారి ఎదట ఏడుగురు జట్టుదార్లు ఆలోచనలోపడి కునుకుతున్నారు. వొస్తాదు బకావుల్లాఖాఁ రెండుమడుకులూ చేతుల్తో పట్టుకుని, మడుకుల మీద గెడ్డాం ఆనించుకుని కూచున్నాడు. ముసల్మానుల ఇంట్లో తలాకు (విడాకులు) ఇచ్చేసిన ఆడమనిషిలాగ తాన్‌పూరా మైలపడితే బైట పారేసిన దాకల్లాగ రెండు తబలాలూ వూరికే పడివున్నాయి.

హాల్లో వో మూల నౌకరు ఫతువా ఎడమచేత్తో ఏదోవొక పదార్థం వుంచి, కుడిచేతి బొటనవేల్తో దాన్ని నొక్కుతున్నాడు. ఉండి వుండి మధ్య మధ్య వేళ్ళతో నీళ్ళచుక్కలు వేస్తున్నాడు. మున్షీ జాహేర్ బక్ష్ వొక కాగితం పట్టుకుని, మేస్ట్రీటుముందు దొంగ ఆసామీ లాగ నుంచుని వున్నాడు.

మియాఁ సాహెబుగారు కళ్ళుమూసుకుని, వొకపెద్ద నిట్టూర్పు వదిలేసి "ఇప్పుడు ఏమిటి సాధనం ?" అన్నారు.

"హుజూరు, రోజంతా తిరిగాను. ఎక్కడా ఏమీ జతపడలేదు. సాహుకారు రామదాసు తన నోటు బాపతు ఇరవై వేలూ, చేబదులు నాలుగు వేలూ అయిందని మరి బదులివ్వడానికి వొప్పుకోలేదు. బజార్లో కిరాణా దుకాణం దార్ల పద్దులు నాలుగువేలూ దాటాయి. వాళ్ళూ నిన్న సామాను లివ్వనన్నారు" అన్నాడు మున్షీ జాహెర్ బక్ష్.

"బేకూఫ్, కాంబఖ్త్, నాలాయక్ !" మియాఁ సాహెబు అన్నారు— "బాబాగారి కాలంనించీ ఇరవై సంవత్సరాలు పనిచేశాడు రామసర్కారు.

నువ్వేదో స్నేహితుడి వనీ, తగినవాడి వనీ, అతణ్ణి తీసేసి వ్యవహర్తపని నీకిచ్చాను. మామ్మూలు కిర్దీ నడిపించలేక పోతున్నావు!"

"హుజూరు," మున్షీ బక్ష్ అన్నాడు- "నేను ఎలా నాలాయకు అయాను? రామసర్కారు దమ్మిడీ అప్పు తేలేకపోయేవాడు. నేను అయిదు సంవత్సరాల్లో పాతిక వేలు అప్పు తెచ్చి ఇచ్చాను."

"అదలావుంచు," అన్నారు మియాఁగారు—"ఇపుడు మర్యాదా ఎలా నిలుస్తుంది? ధనం పోయినా మానం దక్కాలి. మానంపోతే మళ్లీరాదు."

నేస్తగాళ్ళు కునుకుతూ వుండేవాళ్ళు. ఈమాట విని వొక్కసారి ఏడు గురూ గట్టిగా అన్నారు;

"అల్బత్ అల్బత్, వాజీబ్ వాజీబ్."

"వెళ్ళు. ఇల్లో, సామానో, జమీందారీవో తాకట్టువేసి, ఇవాళటి మజా కోసం బందోబస్తు చెయ్యి" అన్నారు మియాఁ సాహెబుగారు.

"చూడూ," మళ్లీ అన్నాడాయన—"జల్దీ. రాత్రయిపోతోంది. ఎన్నో రూపాయలక్కరలేదు. బాయిజీకి మమ్మూలు వంద. అదీ, దాంతో వచ్చిన వాళ్లూ, మన స్నేహితులూ — వీళ్ళందరికీ పులావులూ వాటికీ వందా - ఇలా రెండు వంద లయితే సరిపోతుంది."

"వాజీబ్ వాజీబ్," జట్టుదార్లన్నారు — "హెచ్చు రూపాయిలు అవసర మేముంది?"

నేస్తం హనూ మియాఁ అన్నాడు; "హుజూర్, ఈనాట్యకత్తె ఖాతూన్ తన్నీసా వచ్చివుండే ఇది మహామంచి పండితురాలు. కాశ్మీరులో పేరుపడ్డ బోగంది. దీని పాండిత్యమూ, పాటా, సంగీతమూ ఎక్కడో కాని దొరకవు. దానికి ఈదేశమంటే - ఛూ, గడ్డిపరక. ఊరికే దేశం చూసి పోవాలని వచ్చింది.

మున్షీదాబాదు నవాబూ, లక్నో నవాబూ, రోము పాదుషా, సయాం పాదుషా - వీళ్ళంతా దాని గాత్రం వినాలని పడిచస్తారు; కబుర్లమీద కబుర్లు పెడతారు. కాని బీబీ ఏం చేస్తుందో చిత్తగించారా! కన్నెత్తయినా అటు చూడదు సర్కార్! హుజూరువారి మామ్మూలూ ఖ్యాతీ ప్రపంచమంతటా తెలుసు. అంచేత తనకి తాను కోరి ఇక్కడ మజిలిస్ చెయ్యడానికి కబురంపింది సర్కార్!"

మజిలిస్ అన్నమాట అందరూ వొక్కసారి అన్నారు.

"హుజూరు వార్ని ప్రపంచంలో తెలియని వాళ్లెవరు ? హుజూరు వారి ఖానా, పులావూ ఎవడయినా వొక్క రోజు తింటే చాలు, వాడు బతికి వున్నంత వరకూ తలుచుకుంటూనే వుంటాడు" అన్నారు.

ఇంతలో జంత్రీతోటు సేఖ్ ఫజూ మనవిచేశాడు—"హుజూర్, ఒడిశా జమీం దారీనించి వొక వ్యాపారి దర్శనం కోసం వచ్చాడు."

"అతణ్ణి హాజరుపెట్టు" – ఆర్డరయింది. ఆగంతుకుడు ప్రవేశించాడు. మియాఁ గారిఎదట అయిదు కూనాయలు నజరానా వుంచేసి, నేల ముడుతూ మూడు సార్లు సలాము చేశాడు. మజిలిస్‌లో ఎంతమంది సభ్యులు కూచున్నారో అందరికీ వొక్కొక్క సలాము చేశాడు. నౌకరుసహా వూరికే పోలేదు.

"బహూత్ కదర్ దాన్ ఆద్మీ" (చాలాగుణగ్రాహి) – మియాఁ సాహెబు సెలవిచ్చారు. వెనక పాటగాళ్ళు వెంటనే పల్లవి అందుకున్నారు—"బహూత్ కదరదాన్, బహూత్ హుసిఆర్ ఆద్మీ."

"మీ పేరేమిటి ?" మియాఁసాహేబు ప్రశ్నించారు.

"రామచంద్ర మంగరాజు."

"క్యా ? రామాచందర్ మామలాబాజ్ ?"

"కాదు, హుజూర్, మంగరాజు."

"అచ్ఛా, వోయిహువా. రామచందర్ మంగోరాజ్"

"అతి సామాన్య వస్తువులు ఏవో కొద్దిగా నజరు తెచ్చాను నేను. సెలవయితే హాజరు చేసుకుంటాను."

"బహూత్ అచ్ఛా. తీసుకురండి." నజరానా జాబితా వొక తాటాకు మీద రాసివుంది. అది చదవబడింది.

అయిదు పుట్లుసన్నబియ్యం పచ్చివి, ఒక బండీ ఎనిమిది మానికలు.
పెసరపప్పు రెండు పుట్లూ ముప్ఫయిరెండు మానికలు.
నెయ్యి వొకబుంగ ఇరవై అయిదు శేర్లు.
బొంత అరటిగెలలు అయిదు.
మొక్కిరీ అరటి పళ్ళగెలలు రెండు.
పెండలం దుంపలు ఎనిమిది వీశెలు.

"చాలా బావుంది" అన్నారు మియాఁ సాహెబు—"బియ్యం పులావుకి పనికి వస్తాయి. నెయ్యికూడా చాలా మంచిది."

"హుజూరువారు మాదేశం ప్రభువులు," అన్నారు మంగరాజు గారు–"హుజూరువారి నమక్ పదిహేను సంవత్సరాలనించీ తింటూ వస్తున్నాను. ఇవి సామాన్య పదార్థాలు. సర్కారువారి మెహర్బానీ వుంటే పులావు బియ్యమూ, నెయ్యీ, పప్పూ బరాబర్ హాజరు చేస్తాను."

"మి ఆం! ఓ! మి–ఆం! ఓ–మి! ఆం! ఓ"

కొస్తాదుగారు ఖుసీ అయిపోయి తాన్ బ్రాగా చెవి ఎడమచేత్తో తిప్పుతూ స్వరం సరిచెయ్యడం మొదలెట్టారు.

గుమ్–గుమ్–గుమ్. తాక దిన్ ధిన్ తాక ధిన్ ధిన్ గుమ్ – తబలా వాద్యం ఆరంభమైంది.

"జల్దీ పులావు బందోబస్తు చెయ్యండి"– మియాఁసాహెబు హుకుమ్ వేశారు.

క్రయిస్తవులు చెపుతారు– ప్రపంచం ఆఖరిరోజున స్వర్గంలో దేవదూత మురళి వాయిస్తాడనీ, అప్పుడు మృతమానవులంతా సమాధుల్లోంచి లేచి కూచుంటారనిన్నీ.

చివర్ని మజిలిస్ చచ్చిపడివుండేది. మంగరాజుగారి రూపాయల గలగలతో మేలుకుని లేచింది. మియాఁ సాహెబుగారు గొట్టం నోట్లో పెట్టుకుని మూడు నాలుగు పీలుపులు బాగా పీల్చారు. నల్లకొండమీద పొగ మంచులాగ గెడ్డం అంతటా పొగ పాకింది. గవర్నమెంటు కాలవలద్వారా ఎలా అయితే పరగణా పరగణా మహానది నీళ్ళు పంచి పెడుతున్నారో, అలాగే గొట్టం ద్వారా హుక్కా–లో నిలవవున్న పొగ అందరినోళ్ళకి పంపకమైంది.

మేఁ ఏఁ ఏఁ, మేఁ ఏఁ ఏఁ.

పులావుకోసం వొక మేక వచ్చింది. మజిలిస్ ఎదట ధర తెగింది. రెండున్నర రూపాయలు.

"ఏమిటీ, ఈ మేకధర రెండున్నరరూపాయలా ?" తుళ్ళిపడుతూ అన్నారు మంగరాజుగారు –"ఓయి బాబోయి ! ఇంత ధరే ?"

"మీ వూళ్ళో ఎంత వుంటుంది ?" మియాఁసాహెబు ప్రశ్నించారు.

శవం పరీక్షచేసిన డాక్టరులాగ మేకని ముందూ వెనకా, కుడి పక్కా–ఎడమపక్కా– బాగా పరీక్షచేసి చూశారు మంగరాజుగారు. చివరికి అన్నారు : "ఈ మేకకి వొక ధర ఏమిటి ? అణావో, అణాన్నరో అవుతుంది. సెలవయితే పులావుకోసం పది పుంజీలో, పదిహేను పుంజీలో మేకలు పంపించగలను.

హుజూరు వారు నౌకర్లని ఎంపిక చేసి వుంచలేదు. అందుచేతే ఇంత సొమ్ము వ్యర్థమై పోతూ వుంది. మేకధర రెండున్నర రూపాయిలా? ఓయి బాబోయి!"

మంగరాజుగారి మాటలు విని మజిలీస్ ఆనందతరంగాల్లో ఎలా నాట్యమాడిందీ వర్ణించలేము. క్లయివు ప్లాసీ యుద్ధం గెలిచిన వార్త విని సీమలో డైరెక్టర్ల సభలో ఇంత ఆనందం పొంగి పొర్లి వుండదు. ఏమంటే ఢిల్లీ దర్బారు భయం ఇంకా వాళ్ళ గుండెల్లోంచి వదిలిపోలేదప్పటికి.

వొస్తాదుగారు పురియారాగం ఆలాపించడం మొదలెట్టారు. అందరూ ఆనందంలో వొళ్ళు తెలియకుండా వున్నారు. అందరి మొహాల్లోనూ నవ్వు వొలికి పోతూవుంది. కేవలం మంగరాజుగారు మాత్రం మొహం వేలవేసుకుని కూచున్నారు. గింజలు చల్లేసి వలవేస్తాడు కిరాతుడు. ఆ గింజలు తింటూవున్న పిట్టల ఆనందం మౌనంగా చూస్తూవుంటాడతడు. మంగరాజుగారిమనస్సులో మాట బాగా తెలుసు మాకు. బహుశా ఆసమయంలో అతడు ఏమిటి భావిస్తూవుంటాడో తెలుసా?

"దా. పిట్టా దా, వల్లోకి దా! కండెదగ్గిరికి దా!"

ఒక నౌకరు పరిగెత్తుకు వచ్చి సాని వచ్చిన శుభవార్త వినిపించాడు.

అరే, కొంపమునిగింది! ఈమాట ఎవరికీ జ్ఞాపకం లేకపోయింది. వొస్తాదు ముసిలి బుద్ధిమంతుడు. అతడే జ్ఞాపకంచేశాడు:

"సానమ్మకి వందరూపాయలు నజరానా ఇవ్వాలి."

మళ్ళీ అందరినీ ఆలోచన పట్టుకుంది. మళ్ళీ ఆందోళన వచ్చిపడింది.

భారతదేశం ప్రణాళికలకోసం పార్లమెంటులో బహుశా ఇంతకంటే అధికంగా ఆందోళన కలగదు. ఏదీ వొక నిశ్చయం కాకుండావుంది. సమయం లేదు కూడాన్నూ.

సమయం కనిపెట్టి చేతులు జోడించారు మంగరాజుగారు. "హుజూర్, గులాం హాజరులో వుంటూ వుండగా ఇంత విచారం దేనికోసం?"

మళ్ళీ ప్రశంసలూ, అభినందనలూ అందరినోళ్ళల్లోంచీ బయల్దేరి మంగరాజుగారి చెవుల్లో నిండిపోయాయి.

"అచ్చా, మంగరాజ్," హుకుము చేసారు మియాఁసాహెబుగారు — "మీరు ఇప్పుడు చేసిన ఉపకారానికి తగిన ఇనాం లభిస్తుంది మీకు. అదికాక మీరు ఇచ్చిన రూపాయాలికి రూపాయి వొక్కింటికీ పావలా చొప్పున వడ్డీకూడా లభిస్తుంది మీకు."

"రామ, రామ, రామా" అన్నారు మంగరాజుగారు—"హుజూర్! వుల్లీ, వడ్డీ ఎంతమాత్రం తినను నేను."

"ఏమిటీ?" బొమలెగరవేస్తూ అన్నారు వొస్తాదుగారు. "వడ్డీ తినరూ? చాలా ఉత్తమవ్యక్తి. విశ్వాసపాత్రుడు. ఖురాన్‌లో పాతిక నిషేధాలున్నాయి. అందులో వడ్డీ వొకటి"

చరిత్రకారులు రాశారు—"క్లయివుదొర మొగలు పాదుషా దగ్గిర సుబేదార్ సంపాదించడానికి పట్టిన సమయంకంటే ఒక గాడిద కొనడం అమ్మడంలో హెచ్చు సమయం పడుతుంది" అని. అలాంటపుడు, ఫతేపురు సరషండ మున్సబు గిరీ సర్వాధికారాల్తో సంపాదించడానికి మంగరాజుగారికి ఆలస్య మెందుకవుతుంది?

# 9

## ఊరి భోగట్టా

ఫతేపూరు సరషండ వొకపెద్ద తాలూకా. సదరు డౌలు అయిదువేల రెండు వందల ఎనిమిది రూపాయల ఆరు అణాలు. మఫసలు వసూళ్లు దీనికి రెండున్నర రెట్లు. పైరాబడిమాట వదిలెయ్యండి. ఇందులో అయిదు గ్రామాలున్నాయి. రామ నగరం, బలియా, హండిఖాయి, సవుతుణియా, గోవిందపురం. గోవిందపురం అన్నిటి కంటే పెద్దవూరు. ఇంచుమించు అయిదువందల గడప. అన్ని జాతులవాళ్ళూ వున్నారు. ఊళ్ళో వొక దుకాణమూ వుంది. దుకాణంలో అన్నీ దొరుకుతాయి. పప్పూ, ఉప్పూ, బియ్యమూ, పొగాకూ, నూనే ఏదికావాలన్నా దొరుకు తుంది. అణాదో, అర్ధణాదో నెయ్యికావాలన్నా దొరుకుతుంది. దుకాణంలో ముత్తాతల నాటి దశమూలికలు జాగ్రత్త చేసి వున్నాయి. అందుకని రెండుమూడు కోసుల దూరంనించి వైద్యుల జాబితా వచ్చేది.

గ్రామం పొడవుగానే వుంటుంది. కాని తిన్నగాలేదు. వంకరగా వుంటుంది. అసురదీఘీ ఉత్తరం దిక్కు కొంతా, పడమటి దిక్కు కొంతా ఆక్రమించివుంది. మధ్య గోర్జి. రెండు వరసల ఇళ్లు. మధ్య గోర్జి బాగా వెడల్పుగా వున్నా, నడుమ వచ్చీపోయేదారి మాత్రం పది పన్నెండు మూళ్లకంటే వెడల్పు లేదు. దారి రెండు పక్కలా అందరి వాకిళ్లముందూ పెంటకుప్పలూ, చిన్న చిన్న ఖాళీస్థలాలూ

వున్నాయి. ఉదయం తెల్లవారగానే అక్కడ ఆవులూ, ఎడ్లూ కడతారు. అక్కడక్కడ వొకటో రెండో బళ్లూ వున్నాయి. గోర్జినించి ప్రతీవారి ఇంటికీ వెళ్లడానికి వేరే వేరే కాలిదారులున్నాయి. గ్రామం మూడు భాగాల్లో విభక్తమై వుంది.— సామంతవీధీ, సాలెవీధీ బ్రాహ్మణ వీధిన్నీ.

సామంతవీధిలో స్వయం మంగరాజుగారి లోగిలి. అందుకు ఆ వీధికే పెద్ద పేరు. రాత్రి ఆరుఘడియల దాకా కచేరీ సాగుతుంది. దుకాణం కూడా ఆవీధిలోనే వుంది. ఝామురాత్రయేసరికి మాత్రం వూరంతా మాటుమణిగి పోతుంది.

బ్రాహ్మణవీధి అసలుపేరు అగ్రహారం. అగ్రహారంలో వున్నవి యాభై కుటుంబాలు. అన్నదమ్ములూ వాళ్లూ విడిపోగా ఏర్పడ్డవి డబ్బయిరెండు కొంపలు. అగ్రహారంలో గోర్జి, రెండు పక్కలా నూరూ నూటా యాభై కొబ్బరి చెట్లున్నాయి. వీధి చివర పెద్ద పీనికట్టి వుంది. అక్కడ బలదేవపూజ జరిగేది. పీనెదగ్గిరనించి పదిహేను మూరలమేరలో కొన్ని కొబ్బరి మొక్కలున్నాయి. వాటి మొదట బాగా నిర్మలంగా వుంటుంది. అది బ్రాహ్మలు కూచునే జాగా. పొడుం పీల్చడమూ, భంగు నూరడమూ, యజమానుల ఇంటి విశేషాలు మాట్లాడడమూ, లోకం విశేషాలూ— ఇలాంటివి యావత్తూ అక్కడే జరిగేవి. ఒక్కొక్కరోజు అక్కడ చాలా గోల్మాలయేది. అవాళ యజమాని ఇంటదొరికిన శ్రాద్ధం బియ్యమో, లేకపోతే సభామాన్య సంభావనలో పంపకాలవుతున్నాయని ఇట్టే తెలిసి పోయేది. ఆ కుమ్ములాట విని లోకు లనుకునే వాళ్ళు: "బ్రాహ్మలు పిడికెడు బియ్యంకోసమని కుక్కల్లా కాట్లాడుతున్నారు" అని.

కానైతే లోకుల ఈమాటలు ఏవీమాకునచ్చవు. కారణమేమిటంటారా? బ్రాహ్మల్ని అలా అనేవాళ్ళంతా వొట్టి మూర్ఖులు. ఏగాని టోలీ చెయ్యకపోయినా, బ్రాహ్మడంటే ముప్ఫయ్యారుజాతులమీద రాజు కదా! అలాంటి వాళ్లని కుక్కలతో సరిపోల్చడం ఏపరిస్థితిలోనూ ఎంతమాత్రమూ సబబు కాదు. ఉపమాలంకారం సరిగా వుండాలి కదా! ఏమంటే చచ్చిన ప్రేతాత్మకోసం ఉత్సర్గమయిన తడిబియ్యము కోసమని బ్రాహ్మల కుమ్ములాట. కుక్కల దెబ్బలాట ఎంగిలి మెతుకులకోసం. ప్రేత ఉచ్ఛిష్టమూ, మనిషి ఉచ్ఛిష్టమూ-తడిబియ్యమూ, ఉడికినబియ్యమూ! ఎంతభేదముందో మరి!

కుక్కలు కరుచుకుంటాయి. కాట్లాడతాయి. బ్రాహ్మలు కొట్టుకుంటారు. కొట్లాడతారు. అంతేకాని, వొక బ్రాహ్మడు మరొక బ్రాహ్మణ్ణి కరిచెయ్యడం కానీ, బకిరెయ్యడం కానీ చూళ్లేదు.

ఆకాశం మీద రాంబందులు ఎగిర్తే ఎక్కడ శవం పడివుందో తెలిసిపోతుంది. అలాగే పగలు ఝాం పొద్దప్పుడు బ్రాహ్మలు బొట్టూగిట్టూ బనాయించి, జట్లు జట్లుగా బయల్దేరారో - ఏవూళ్లో మనిషి హరీ అన్నాడో వూళ్లోవాళ్లు పసికట్టేసే వాళ్లు.

పాణిగ్రాహికి తనవంతు ఇరవై ఎకరాలుంది. అదికాక, అగ్రహారంలోని వంతు పాతిక ఎకరాలు త్రికాలసంధ్యల్లోనూ ఆశీర్వాదం చేస్తూ భూమి అనుభవించ వలిసిందని మరాటాసు బేదారు రాగిరేకు మీద సనందు రాసి ఇచ్చాడు. త్రికాలములు అంటే భూత భవిష్యద్వర్తమానాలు. భూతకాలంమాట భూతాలికి తెలుసు. భవి ష్యత్తు సంగతి మనుష్యులికి తెలియదు. వర్తమాన కాలం విషయం మాత్రం మే మెరుగుదుం.

గొడ్డూగోదా ఇంటికి తీసుకువచ్చి కట్టడమూ, సొమ్ములు పాకలో పొగ పెట్ట డమూ, పాలేర్లకి పఖాలీకూడు వడ్డించడమూ వీటితోనే సాయంకాలం గడిచిపోయేది పాణిగ్రాహీగారికి. భూమి ఇచ్చిన దాతకి ఆశీర్వాద మెప్పుడు చేస్తాడాయన?

మాటమీద మాటవచ్చి వొకనాడు భవానీ వాహినీపతి అన్నారు: "మాకు భూమి ఎక్కడుంది గనక, మేం ఆశీర్వాదం చెయ్యడానికి?" అని.

ఆయన అన్నది కేవలం అబద్ధంకాదు. అగ్రహారంవంతు అయిదు వందల ఎకరాల్లోంచి, పదేళ్ళలోపున నాలుగు వందల ఎకరాలు అమ్ముడై పోయింది. మిగిలిన ఏదోకొన్ని ఎకరాలు మంగరాజుగారు వుంచారు గనక నిలిచింది.

"గోబ్రాహ్మణ హితాయచ"

మంగరాజుగారికి చాలా శ్రద్ధ. తిరుగుబోతు పశువులు ఎంతో జాగ్రత్తగా స్వంత మందలో చేర్చేసే వాడాయన. ఎవరో బారుకులూ వాళ్లూ ఇలా ఎవరికీ చెందని పశువులు పట్టుకువచ్చి ఇచ్చెయ్యడమూ, ఏదోతోచిన బహుమానం పుచ్చుకు వెళ్లడమూ లోకమంతా వున్నదే.

ఎడ్లసంగతి అలావుంచి, మంగరాజుగారి ఆవుల సంఖ్య చూస్తే మూడు వంద లికి దాటుతుంది. గోమాత అక్కడా ఇక్కడా తిరిగి కష్టపడుతుంది. అంచేత ఆయన వాటిని ఆదరించి చేరదీశారు. తప్పనిసరి అయి మించిపోతే ప్రతీఏడూ కసాయి సాయిబులికి సగానికి సగం అమ్మెయ్యవలసి వచ్చేది.

అదిగో అలాగే బ్రాహ్మల భూములూ కొన్నాడాయన. అలా అదుకున్నాడు. బ్రాహ్మణస్వాములు భూములు అమ్మకోక ఏంచేస్తారు? అసలే బాపనవ్యవసాయం.

దానికి తోడు దొంగలు ఏంచి ఏంచి బ్రాహ్మల భూముల్లోని ధాన్యమే దొంగిలించే వాళ్లు. మంగరాజు గారికి భూములమ్మేస్తే సరి, భయపడి దొంగలు ఆచుట్టుపక్కలికి వచ్చే వాళ్లు కాదు.

మంగరాజుగారు ఎకరం అయిదు రూపాయల ధరని అయిదెకరాల భూమి కొన్నారని ఎవరో చెప్పుకుంటారు. ఈవిషయంలో వాళ్లకి గ్రహింపుశక్తి లేదంటాం మేం. చూడండీ, మీరు వొకబండి విత్తనాలు చల్లి పదిబళ్లుకోస్తారు కదా! మంగరాజు గారి రూపాయలు గొడ్డువంటూరా? వాటికి వడ్డీ పండుతుందంటూరా లేదా?

అగ్రహారం మధ్యలో పండిత వశిన్నగారి ఇల్లు. వీరితాత బికిఖడంగాగారు ఏడుపాదాల వ్యాకరణం కంఠతా చెప్పేసేవారని శివన్నగారు చెపుతూ వుంటూరు. నైషధాంతం వారికి అనర్గళంగా వుండేది. పండితుల వివిధవ్యాకరణ శబ్దాలూ, సంధులూ పేలపిండిలా వుండేవాయనికి. ఆయన గ్రంథాలనీ దేవుడు పీటమీద భద్రంగా వున్నాయి.

శివన్న పంతులు ప్రతీదినం పూజచేసేవారు. ఆయనకూడా మంచి గట్టిపండితుడే. పుస్తకంతాడు విప్పకండా అమరం అయిదువర్గులూ పాడేస్తారు. శివన్నగారి పెత్తండ్రి కొడుకు మేనమామ కొడుకు బావమరిది పింతల్లి కొడుకు నవద్వీపంవెళ్లి న్యాయ శాస్త్రం చదివి వచ్చాడు. నిజంచెప్పాలంటే అగ్రహారంలో ఖడంగా వంశం విద్యల్లో ఎప్పుడూ కొరతపడలేదు. వీరి వీధరుగుమీద అగ్రహారం కుర్రాళ్లు నాలుగు వేదాలూ వల్లించేవారు. నలభైవొక్క కర్మకాండలూ ఇక్కడే నేర్చుకునేవారు. అమరం వొకటో రెండో వర్గులు ఇక్కడే బట్టీపెట్టేవారు.

పడమటి వరస సాలివీధిలో వందన్నర కొంప వుంది. ఈ వీధిగోర్జి శుభ్రంగా వుంటుంది. గత్తం గోతులూ, పేడకుప్పలూ ఏవీలేవు. ఇక్కడ నిషేధచట్టం వుందనో, మున్సిపాల్టీబండి వచ్చి చెత్తాచెదారం తీసుకుపోతోందనో మీరనుకుంటూరు. మీకు ముందే హెచ్చరిక చేస్తున్నాము. మానుండి వినందే మీరు ఏవిషయమూ ముందుగా సిద్ధాంతం చేసేసుకోకండి. ఎంతో పరిశోధన చేసినమీదట, ఎన్నో నిదర్శనాలు సంపాదించిన తరవాత మేము రాయవలిసి వస్తూవుంటుంది. మీకు కలిగే ఇలాంటి భ్రమ నివారించడం కోసమే మా ఇంత శ్రమాన్నూ. కాకపోతే ప్రయోజనమేముంది కనక! ఏదీ, ఇదీఅదీ రాసెయ్యడం మా ఇంటావొంటా లేనిపని. తిరుగులేని ప్రమాణం దొరకందీ, లేదా న్యాయశాస్త్రానికి నిలవందీ — అసలు అలాటిమాట వుందంటే వినిపించుకోనే వినిపించుకోంమేం. ఏదిరాస్తామో అది న్యాయశాస్త్రరీత్యా రుజువు చేస్తాం. మీరు నోరువిప్పడానికే అవకాశముండ దప్పుడు.

చూడండీ, రుజువు స్థిరపరచడంకోసం న్యాయశాస్త్రంలో చెపుతారు:

"పర్వతో వహ్నిమాన ధూ మాత్" అని. అంటే పర్వతం లోంచి పొగ ఎందుకు వస్తోంది? కాను, లోపల అగ్గివుంది.

మహానదిలో వరద వస్తోంది. చూస్తే తప్పకండా తెలుస్తుంది, పైన వర్షం కురిసిందని. కార్య కారణసంబంధం ఇలా నిత్యమన్నమాట.

"న కార్యం కారణం వినా."

కారణం లేకండా కార్యముండదు. ఇక్కడ నదిలో వరద రావడానికి కారణం వర్షం. అలాగే మేము తిరుగు లేని యుక్తిచూపించి రుజువు చెయ్యగలం పేడతో పశువులికి నిత్య సంబంధం వుందని. కారణం లేకపోతే కార్యమూ వుండదు. ఇది మీరుతప్పక వొప్పుకుంటారు. అంటే సాలి వీధిలో పేడకుప్పలు లేవు కనక దానికి కారణం పశువులు లేవన్నమాట – అనగా సాలివీధిలో పశువులులేవు. కనక పేడకుప్పలూ లేవు.

మీ మనస్సుల్లో మరో పెద్దసందేహం కలగ వచ్చు. సొమ్ములు పులులూ, ఎలుగ్గొడ్లూ కావుకదా అడివిలో వుండడానికి. ఇవి గ్రామ్యపశువులు. గ్రామంలో వుండడమే వీటి స్వభావం. నీళ్లువున్నదగ్గిరే చేపలుంటాయి. అలాగే గ్రామంలో గ్రామ్య పశువులుంటాయి. ఇది స్వభావసిద్ధం. సాలెవీధి వొకగ్రామం కదా! ఐతే సాలె వీధిలో పశువులు లేకపోవడమేమీ? పరమేశ్వరుడి సృష్టికౌశలంలో ఎంతో వ్యభిచారం చూస్తాం. ఐతే , అది అతడి పనిలో పొరపాటో, లేదా అతడి ఉదాసీనతో! చూడండీ, పశువులనండీ, పక్షులనండీ, కీటకాలనండీ, పతంగాలనండీ—అన్నిటిలోనూ మగా ఆడా వుంది. అందులో వొక్కొక్కటి నపుంసకంది కూడా కనిపిస్తుంది. అలాగే సాలెవీధి గ్రామమే అయినా అక్కడ గ్రామ్యపశువులు లేవు. పశువుల విషయంలో అది నపుంసకం. అనగా అక్కడ అడివిపశువులు పులీ ఎలుగ్గొడ్డూ కానీ, వూరిపశువులు ఆవులూ ఎడ్లూ కానీ ఏవీలేవు.

లేవు అంటే లేకపోడానిక్కూడా కారణం వుండవచ్చు. కారణం లేందే కార్యం వుండదు. ఇది న్యాయశాస్త్ర సూత్రం. వ్యాకరణ రచయితలు సూత్రం సరి చెయ్యలేకపోతే నిపాతసిద్ధమని వొకమాట పారేసి పని ముగించేస్తారు. అయితే అదివొక విధంగా మోసం. అలాంటిది మా చేతకాదు.

అదలా వుండనీండి. సాలెవీధిలో పశువులెందుకు లేవు? దానికారణం తెలుసుకోండి. బైబిల్లో రాసివుంది – ఒక సేవకుడు ఇద్దరిసేవ చెయ్యలేడు అని. శాస్త్ర

కారులు సూటిగా రెండు ముక్కలు చెప్పేసి పనిముగించేస్తారు. లోకమంతటా వున్నదే ఇది. టీకాకారుడు లేకపోతే మూలగ్రంథం తెలుసుకోడం కష్టం. మల్లినాథుడూ, మధురానాథుడూ, శ్రీధరుడూ వ్యాఖ్యలు రాయకపోతే రఘువంశమూ, న్యాయమూ, భాగవతమూ లాంటి గ్రంథాలు ఈపూటదాకా తాళ్లతో కట్టి పడి వుండేవి. అలాగేమేం బైబిలుకి వ్యాఖ్య చెయ్యకపోతే తెలియడం కష్టం. మీరు పోనీ ఎలాగో లాగీ, సాగదీసీ చదివేసుకు పోతారు. కాని అందరిచేతా అన్నిపనులూ జరగవుకదా!

బైబిలు సూత్రానికి అర్థమేమిటంటే ఒక మనిషి వొకేసమయంలో రెండు పనులు చెయ్యలేడూ అని. అంటే, బట్టలు నెయ్యడంలో సాలివాళ్ల దినం గడిచి పోతుంది. వ్యవసాయం చెయ్యడానికి మరి వేళేది? వ్యవసాయం చెయ్యకపోతే మరి ఎడ్లెందుకుంచాలి? ఎడ్లు లేకపోతే ఇక పేడ ఎక్కడినించి వస్తుంది? పేడ లేకపోతే పెంట కుప్పా వుండదు. పెంటకుప్ప లేకపోతే వీధి శుభ్రంగా వుంటుంది.

ఇప్పుడు పందొమ్మిదో శతాబ్దంలో న్యాయశాస్త్రానికి గౌరవం హెచ్చు. కారణమేమిటంటే అన్నిరకాల ఔన్నత్యానికీ ఈశాస్త్రమే మూలాధారం. చూడండీ, ఇంగ్లీషువాళ్లు ఎంత తెల్లగా వుంటారో! మరివొడ్డివాళ్ల శరీరం ఎంత నలుపో! దానికి కారణ మేమిటంటే ఇంగ్లీషువాళ్లు విజ్ఞానశాస్త్రం చదివారు. ఒడ్డివాళ్లు చదవలేదు.

మేమిప్పుడు మధ్యలో విజ్ఞానశాస్త్రచర్చ ఆరంభించాం. ఇప్పటి ప్రసంగం మేం ఆశాస్త్రప్రకారమే రుజావు చెయ్యగలం. పాఠకమహాశయులు చూడండి, విజ్ఞాన శాస్త్రం ఎంత నికరమైందో తెలిసిపోతుంది మీకు. ఆ శాస్త్రంలోని సూత్ర మిది: "ఒకచోట రెండు వస్తువులు వుండలేవు" అని. మీ పాలుతాగే గిన్నెలో నీళ్లు వుంటాయా మరి! అంచేత ఆశాస్త్రానికి వ్యాఖ్యానం అవసరం. అనగా వొకచోట వొకేసమయంలో రెండు వస్తువులు వుండలేవు. గిన్నెలో నిండుగా పాలుంటే, మరి అందులో నీళ్లు వుండలేవు.

బట్టలు నేతకి ఇంటా బైటా స్థలం కావాలి. ఇంటిలో బట్టలు నేస్తారు. చిలపలు పొయ్యడం, సరికట్టడం వగైరా పనులు బైటచేస్తారు. కనక నేతపని జరిగేస్థలంలో పేడకుప్పలూ అవీ వుండడం వల్లకాదు. పైగా ఆడామగా చేతులు కలపకపోతే బట్టల నేత సాగదు. గెంజి పెట్టడమూ, పంటికఱ్ఱ చుట్టడమూ — ఇలాంటివి సాలె స్త్రీల పనులు. ఆవులూ, ఎడ్లూ వీధిలోంచి వెదికి తెచ్చి కట్టడానికి వాళ్లకి వేళఏదీ? ఈ మొదలైనవి ఇంకా ఎన్నో కారణాలున్నాయి. కాని విషయం పెంచి రాయడం మాతత్వానికి పడదు. అంచేత వున్నది వున్నట్టు టూకీగా రాసేస్తూ వుంటాం.

# 10

## భగియా — శారియా

సాలెవీధి మొగని భాగవత మందిరమూ * దధివామన మందిరమూ వున్నాయి. సాలివాళ్ల కులండబ్బుతో మందిరం తయారైంది. కులం డబ్బంటే ఏమిటో తెలుసా? ఈ సంగతిమీకు విడమర్చి చెప్పక్కర్లేదు. కాని ముందుముందు వచ్చే కొత్తబాబుల కోసం చెప్పాలి. ఏమంటే వాళ్లంతా విద్వాన్లు. పెద్దపెద్ద సంగతులు చదివి వుంటారు. పెద్దపెద్దమాటలు తెలుసు వాళ్ళకి. మీ తాతపేరు ఏమిటంటే తడుముకుంటారు. కాని ఇంగ్లాండులోని మూడో చార్లసుగారి పదిహేడోతరం వాడి పేరు మాత్రం కంఠస్థంగా వుంటుంది. ఇంగ్లీషు సంఘం గురించీ, ఫ్రెంచి సంఘం గురించీ చదువు తుంటే విద్యావంతుడంటారు లోకులు. తనజాతిగురించికానీ, పక్కజాతిగురించి కానీ తెలుసుకోవలసిన అవసరం ఏముంది? పోనివ్వండి, అదంతా ఎందుకు? బాబులు ఈమాట వింటే గుడ్లెర్రచేస్తారు. చెప్పవలసిన అగత్యం మాత్రం ఏం వచ్చిందిమాకు?

కులం డబ్బంటే ఏమిటంటే— కులంలో ఎవరన్నా ఏదో చెడ్డపని చేశారను కోండీ, కులపంచాయితీ పెద్దలు జరిమానా వేస్తారు. ఎవడయినా జాతిసోదరుడు బీదతనం వల్ల ఇవ్వలేకపోతే నలుగురూ ఏదోతప్పు పుచ్చుకొని అతణ్ణి కలుపుకుం టారు. సొమ్ము కులపెద్దలదగ్గిర వుంటుంది. అదిగో అదేకులధనం. దాంతోనే తయా రైంది దధివామన మందిరం.

ఈనియమం ప్రతీసామాన్య జాతిలోనూ వుంది. కాని క్రమక్రమంగా ఈపద్ధతి లోపించిపోతూ వుంది. మాట్లాడితే, ఇప్పుడు కోర్టుద్వారాలు తెరిచి వున్నాయి. జనం జ్ఞానవంతులయారు. అంటే నాగరికులయారు. కులపంచాయితీ ఎవడిక్కావాలి?

"ఏయ్, కబర్దార్" అంటుంది ఇంగ్లీషు శాసనం — "మీ రేమన్నా నేరం చేశారా? దాన్లో లా కి సంబంధించిన రుజువుందా? శిక్షిస్తుంది."

తెలివయినవాడు ఎవడో అన్నాడుట — "అయ్యా, తమ లా కి దొరకని మార్గముంది. అదినాకు తెలుసు" అని.

---

* భాగవత మందిరం: మన రామమందిరాలవలె ఒడిశాలో ప్రతీ పల్లెలోనూ భాగవతమందిరాలుంటాయి. అందులో వొడియా భాగవతం తాళపత్రగ్రంథం వొక గద్దెమీదవుంచి ప్రతీదినమూ పూజా, పఠనమూ చేస్తారు.

వీపుతట్టి వకీలు ఏమంటాడో తెలుసా?

“ కుచ్‌పరవానహిం. రూపాయలు పట్టుకురా. నందినిపందీ, పందినినందీ చేసేస్తాను నేను ” అంటాడు.

దీనిఫలితం ఏమవుతుందంటే, డబ్బున్నవాళ్లూ తెలివయినవాళ్ళూ ఎంతోమంది ఎన్నో నేరాలుచేసినా తప్పించుకుని పూలరంగడులాగ తిరుగుతున్నారు. అమాయకులూ, కాసుకిలేనివాళ్లూ మాత్రం నానాబాధలూ పడుతున్నారు. ఉభయ పక్షాలూ కేసుల్లో ధనం ధారపోసి చేతులు కడుక్కొంటున్నారు. వీధిలో బికార్లవుతున్నారు. ఆ సొమ్మేమో రాకాసి మింగేస్తోంది.

పంచాయితీ అయితే దాని కంట్లో దుమ్ముకొట్టడం సాధ్యంకానిపని. నేరం చేసినవాడికే జరిమానాపడేది. ఆ సొమ్ము మంచిపనికే వినియోగ పడేది.

సాలిజాతికీ తెలివితక్కువకీ వొక అవినాభావ సంబంధం వున్నమాట అనేకులు చెవుతారు. ఎవరయినా, ఏమయినా తెలివితక్కువపని చేస్తే “నువ్వు సాలివాడిలా వున్నావే” అంటారు. అనగా సాలివాడిలాంటి దద్దమ్మలా వున్నావే అన్నమాట. మీరు నవనాగరికులయి వుంటే, సాలెవాళ్లు దధి వామనమందిరం కట్టడం విని, సాలీల మీద సనాతనంగా వున్న అపవాదు నిజమే అని నమ్ముతారు. నమ్మడమే కాదు, ఇంకా ఏమంటారంటే, “ప్రజలధనం ఇలా దుర్వ్యయం చేస్తారేం? కలెక్టరుదొర గారిపేర స్కాలరుషిప్పు పెట్టించరాదా? లేదా గవర్నరుగారిపేర ఆస్పత్రి కట్టించరాదా? మందిర మేమిటి వాళ్ళశ్రాద్ధం” అంటారు.

మీకు నచ్చినట్టు చెప్పడం మీకర్తవ్యం. కాని మీరన్నమాట మాకెలా వుంది? మేమన్నదే సిద్ధాంతమని చెప్పలేం, కాని సాలిబుద్ధి అంటే అర్ధమేమిటో తెలుసా అండి? ఇదివొక యోగరూఢ శబ్దం. పంకజం అంటే పద్మం అని ఎలాగో అలాగ. [పంకజం=పంకంలో (బురదలో) పుట్టింది.] అయితే పంకంలోంచి నాచూ, గోకుర్లూ, నత్తగుల్లలూ పుడుతున్నాయి. అవన్నీ పద్మాలేనా? కావు. అలాగే సాలి అంటే బుద్ధిలేనివాడు అని అర్థం, కాని బుద్ధిలేనివాడు అంటే సాలి అని అర్థంకాదు. అవాళ మాంచెస్టరులోని సాలీలు పార్లమెంటుని గడగడ లాడించేశారు. తెలుసామీకు! మీరు ఈవేళ బాబుల వేషం వేశారే, ఇది కేవలం సాలీల ప్రసాదాత్ కాదా? అలా సాలీల బుద్ధిని నిందించడం వొక అమర్యాదపని.

నిజం విచారిస్తే మన పూర్వపురుషులందరూ సాలీలే. ఇది రుజువు చెయ్యడం కోసం పురాతత్వవిద్య తడవనక్కరలేదు. ఊరూరా వున్న దేవమందిరాలే దీనికి

ప్రత్యక్ష సాక్ష్యం. ఏవిషయమయినా రెండుదిక్కులూ చూడకుండా చెప్పిన ఒక సిద్ధాంతానికి రావడం సాలెతనం, (బుద్ధిలేనితనం) అని మానమ్మకం. దేవమందిరాలు నిజానికి సాలీలపనో కాదో చూద్దాం. పచ్చి పల్లెటూరి ప్రజలసంగతి మీకు తెలిసేవుంటుంది. పగలంతా వాళ్లు పనుల్లో మునిగి వుంటారు. పొద్దుగూకాక, ఇంతతిని నిద్రపోతారు. ఊళ్ళో ధర్మప్రచారకులులేరు. లైబ్రరీలు లేవు. ధర్మవిషయాలెలా వింటారు వాళ్లు?

దేవమందిరంలో ఉదయమూ సాయంకాలమూ గంటలు మోగుతాయి. శంఖాలు వినిపిస్తాయి. భగవంతుడున్నాడు. అన్నవిషయం అబాలగోపాలానికీ అవి జ్ఞాపకం చేస్తాయి. అక్కడ భాగవతపీఠం వుంటుంది. రాధాష్టమీ, జన్మాష్టమీ, కార్తీకమాసమూ మొదలయిన పర్వదినాలు మందిరంలో భాగవతపఠనం జరుగుతుంది. జనం వెళ్ళివింటారు. మందిరమంటూ లేకపోతే దేవుడిపేరు కానీ, ధర్మగ్రంథం కానీ వినడానికి అవకాశమేవుండదు. పొరుగూరివాళ్లు కానీ, లేదా ఏదో ఇబ్బంది వచ్చి వూళ్లో అన్నం వండుకోలేనివాళ్లు కానీ పూజారి దగ్గిర వొక అర్ధణాపడేస్తేచాలు పీకలమొయ్యా ప్రసాదం దొరుకుతుంది. పంచాయితీ, వూళ్లోని మంచీచెడ్డా విచారణ దేవమందిరాల్లోనే జరుపుతుంది.

మేం ఇంగ్లీషులో క్లుప్తంగా తర్జుమా చేసిచెపితే మీకు సులువుగా అర్థమై పోతుంది. దేవమందిరాల్లో వూరిమధ్య చర్చీ (ప్రార్థనాలయం), పబ్లిక్కు లైబ్రరీ (సాధారణ పుస్తకాలయం), హుటేలూ (భోజనాలయం), టౌనుహాలూ (భాగవత మందిరం) — ఈ నాలుగుపనులూ సాగేవి. అదలావుండనివ్వండి. మేమింకా ఎన్నో రాయవలసివుంది.

తక్కిన సామాన్య జాతుల మల్లేనే సాలీలకి వొక పరమాణికుడు వున్నాడు. పరమాణికుడంటే కులపెద్ద అన్నమాట. పరమాణికుణ్ణి విడిచిపెడితే జాతిగతమయిన ఏకార్యమూ సాగదు. పెళ్లీ, పునస్సంధానమూ అయితే పరమాణికుడే పోక చెక్కలు పంచాలి.* దానికిగాను వొక వస్త్రమూ, వొక పోకచెక్కా గౌరవపు సంస్కారం దొరుకుతుందతడికి. పరమాణికుడి దగ్గిర కులంలోని పిర్యాదు ఏదన్నా వస్తే అతడే పోకలుపంచి పంచాయితీ సమావేశపరుస్తాడు. సభలో చందనమూ, పువ్వులూ మొదట పరమాణికుడికే ఇస్తారు. కులసంతర్పణలో ముందు పరమాణికుడు కృష్ణార్పణం అంటేకాని ఎవ్వరూ ఎంగిలిపడరు.

---

* జాతిగతమయిన కార్యాల్లో బంధువులికి పోకచెక్కలు పంచుతారు. అదే ఆహ్వానమన్నమాట.

ఈ పరమాణిక పదం పురుషానుక్రమం — అంటే పరమాణికుడి కొడుకే మళ్ళీ పరమాణికు డవుతాడు. లేదా అతడి వంశంలోనివాడొక డవుతాడు. అంతే కాని ఎవరుపడితేవారు అవడానికి వల్లకాదు.

ఇప్పటి పరమాణికుడిపేరు భగియాచందు. భగియాచందు సత్యకాలపుమనిషి. కల్లాకపటం ఎరగడు. నందన్నా సంయ్యో, పందన్నా సంయ్యో. ఊళ్లోవాళ్లు భగియాని తవిటిసేనాపతి అని పిలిచేవాళ్లు.

మీరు అనడానకి సందు దొరికిపోయింది. అవులిస్తే పేగులు లెక్కెపెట్టేస్తాం మేం. మీమొహం వైఖరే చెప్పేస్తున్నాది. మీరంటున్నారు – లేదా అంటారు. అనాలనుకుంటున్నారు—లేదా అనుకుంటారు. – "ఇదంతా పచ్చి సాలి బుద్ధి కాకపోతే మరేమిటి? తండ్రి పరమాణికుడుగా వుండేవాడని వోటి దద్దమ్మని తెచ్చి పరమాణికుణ్ణి చేసి పారేశారు! సాలీలంతా వాడికి దండాలు పెడుతున్నారు. ఓయి మహానుభావా, లోకనాయకుడు కావలిసి వచ్చినప్పుడు పార్లమెంటు మెంబర్లో, లేదా యునైటెడ్ స్టేట్సు ప్రెసిడెంటునో ఎంచుకున్నట్టు పది మంది వోట్లు తీసుకుని తగినవాణ్ణి పరమాణికుణ్ణి చెయ్యండి. అది మానేసి, వొక యం బ్రహ్మని చేసిపెట్టుకున్నారూ?"

నిజమే. అప్పసంలో పెల్లవేసినట్టుంది మాట. నిజమయినమాట చెప్పినప్పుడు కంయ్యా కుంయ్యా మనడానికి వల్లకాదు. మేము మొదటినించీ సేనాపతుల పక్షమే వుంటున్నాం. కాని ఇకమరి కసకదు. మేం ప్రతిజ్ఞచేసి చెపుతున్నాం. లేదా చేస్తాం. సేనాపతులవిషయం వస్తే చుట్టు పక్కలికి రాం. కానైతే సేనాపతుల్ని అవగతం చేసుకోడం కాస్తఃఅవసరం. ఓపాఠకమహాశయులారా, మాకున్న జ్ఞానం తక్కువ. కనక సేనాపతుల్ని గ్రహించడం మాశక్తికి మించినపని. అనుగ్రహించి వాళ్ళని తెలిపిపెట్టండి మాకు.

హిందువులయితే వేద వేదాంతాలూ ధర్మశాస్త్రాలూ గౌరవిస్తారు. శాస్త్రమేమంటోందంటే—

"సమోదమస్తపః శౌచం సంతోషం క్షాంతిరార్జవః,
మద్భక్తిశ్చ దయా సత్యం బ్రహ్మప్రకృతయస్త్విమాః ;"

ఇదంతా బ్రహ్మత్వ లక్షణం. అలాంటి బ్రాహ్మడే పూజనీయుడు. వరణీయుడు. భక్తియోగ్యుడు. అలాంటి బ్రాహ్మడి పాదధూళి తలమీద వేసుకోడానికి ఎప్పుడూ సిద్ధమే మేము. కాని—

అవధరింపుము పరీక్షిన్మహారాజా
ఎండు రెయ్యలతో చల్లన్నం మజా.
పొట్ట చీలిస్తే అక్షరం నాస్తి
విభూతి పెండెకట్లు జాస్తి.
కలవు తియ్యమంటే పిల్లి
అటుకులా బెల్లానికి పెద్దపులి.
గాయత్రి పేరంటే పరువూ
పొలం మడిలో చేపలికి గురువు.
పుస్తకం విప్పమంటే బెంగ
యజమాని ఇంట్లో బియ్యం దొంగ.
సభలో మౌనం పరిపాటి
పేరుమాత్రం సుందర త్రిపాఠి. *

సుందర త్రిపాఠిగారికి పదివేల దండాలు. ఏమంటే ఆయన బ్రాహ్మడి ఔరస సంతానం కనక. సుందరత్రిపాఠి మీ కులపురోహితుడు. ఎంచేత? ఆయన తండ్రి మీ కులపురోహితుడుగా వుండేవాడు కనక. అక్కడ నోరెత్తడానికి దమ్మిలేదు మీకు. కాని మేం మా డైరీలో రాసుకునే వున్నాం. శాస్త్రంలోవుంది:

అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా,
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవేనమః – అని

అజ్ఞానం అనే నేత్రరోగంతో వున్న అంధవ్యక్తి నేత్రాలు జ్ఞానమనే అంజన శలాకద్వారా ఎవరైతే ఉన్మీలితం చేస్తారో, ఆ గురువుకి నమస్కారం చెయ్యి.

నిజమే అలాంటివ్యక్తిని గురువే అనాలి. అయితే గురువుగారి కొడుకూ మీకు గురువేనా? పోనీ, అదంతా అంటే ఏం లాభం? కాని సేనాపతి మాత్రం అమ్మకి చిక్కినమేక? గురివిందా నీకిందికి చూడు. వెదికిచూస్తే అన్నీ చిక్కులే. పొగమంచులో ఈతకొట్టడం కావలినంత. ♦ దంపులమ్మ భాగోతం చదివినట్టు మేమేదో పూరిసంగతి చెపుతూ మీవంటివారి ప్రసంగం తలపెట్టాం. సంగతేమిటో గ్రహించారా? మించివచ్చిందంటే అందరమూ గోతిలోనో, డెప్పిమీదో పడతాం.

---

* త్రిపాఠి: మూడు వేదాలు చదివినవాడు.

♦ పొగమంచు వస్తే వరద వచ్చిందనుకుని సాలీలు ఇళ్ళమీదక్కి ఈతాలాడడం కోసం కిందికి గెంతారని ఒడిశా సామెత.

ప్రతీవాడూ వొకమాట పారేస్తాడు. రాంభజనలో మూగాడూ నోరు తెళ్ళబెడ తాడు.

ఆగొడవంతా అలా వుండనివ్వండి. ఇపుడు వూరివిషయం వినండి. కంతకి తగిన బొంత. భగియా ఎలాంటిపెద్దన్నో అతడిభార్య కూడా అలాంటి పెద్దమ్మ. ఆమెపేరు శారియా. వయస్సు సుమారు పాతికవుంటాయి. శారియా గుణం విన్నారు కదా! ఇక రూపంమాట వింటారా? చూడండీ, అన్నిటికీ పరప్రత్యాశీ - అంటే పైవాళ్ళమీద ఆధారపడడం వొక చెడ్డ అలవాటు. మీ బుద్ధిబలం వల్ల ఊహించి అంతో ఇంతో తెలుసుకుందికి ప్రయత్నించండి. కేవలం మా చేతినే చూస్తూ వూరుకోకండి. ఊహతో ఎలా చూడాలో, దాని మూలసూత్రం కాస్తవింటే మీదారి సుళువై పోతుంది.

మనమనుకున్న ఏదో వొక అమ్మాయి రాజకన్య అని విన్నామనుకోండి, వెంటనే ఆమె చాలా అందకత్తె అనీ, గుణవతి అనీ, రంభా ఊర్వశీ ఆమె కాలి గోటికి సరిపోలరనీ ఊహించెయ్యాలి. ఒకవేళ ఆమె బూరిబుగ్గలదే అవుగాక, చప్పిటి ముక్కుదే అవుగాక, అదంతా లెక్కచెయ్యకూడదు.

అలాగే ఫలానా జమీందారుదగ్గిర బాగా ధనముందని విన్నారనుకోండీ, వెంటనే అతడు నవమన్మథుడనీ, బుద్ధికి బృహస్పతి అనీ, దానకర్ణుడనీ, దయా స్వరూపుడనీ ఇత్యాది ఇత్యాదిగా ఊహించేసుకోవాలి. మన శారియా వూళ్లోని సౌందర్యవతి. దీన్నిబట్టి ఇప్పుడు మీరు ఊహించుకోండి.

భగియా చంద్రుడూ, శారియా - ఇంటికి వీళ్ళిద్దరే కుటుంబం. ఆడాళ్లు అంటారు, "ఇద్దరికీ జోడురా అద్దాలమేడరా" అని. మన పెద్దన్నా పెద్దమ్మా సంగతీ అలాంటిదే. ఇద్దరిలో ఏచిక్కులూ లేవు. ఇద్దరికీ వొకనిమిషం ఎడబాటులేదు. ఇద్దరూ కలిసి ఇంటిపనులు చక్కబెట్టుకుంటారు. భగియా సరికడితే శారియా పంటికర్రకి నూలు పోసేది. అతడు మగ్గం దగ్గిర కూచుంటే, ఆమె చిలపలు పోసేది. శారియా వంటదగ్గిర కూచుంటే, భగియా పొయ్యి వూదేవాడు. లేదా నీళ్ళు తెచ్చిచ్చే వాడు. వూళ్ళో వోర్చలేని తుంటర్లు వాళ్ళని చూసి ఏవో సామెతలు విసిరేవారు.

శారియా భగియా చూడండోయి
కొంగా కొంగా జోడండోయి

అనేవారు. అహా ఏం భావకవిత్వమండీ! కాని మేమేమంటామంటే - ఇలాంటి నిందలు ఎవళ్ళపేర వస్తాయో వాళ్లే అదృష్టవంతులు. స్వర్గంలోని కాల్పనికసౌఖ్యం

వాళ్లే జీవితంలో అనుభవిస్తారు. ఎవడో ఇంగ్లీషుకవి అన్నాడు—"నిర్మలమైన దాంపత్యప్రేమ అనుభవించినవాళ్లే స్వర్గజీవులు. దాంపత్యప్రేమలో కలంకం వున్న వాళ్లే నరకజీవులు" అని.

అయ్యో, మేం పెద్దపొరపాటు చేసేశాం. "మునీనాంచ మతిభ్రమః." మునులు రాతలూ కోతలూ చేసేటపుడు పెద్దపెద్ద తప్పులు చేసేస్తారు. కనక రాతకోతలు చేసేవాళ్లు మునులన్నమాట. అంచేత ఈ పూటనించీ లోకులు మమ్మల్ని ముని అనో రుషి అనో పిలుస్తారు. ఇందులో పిసరంత సందేహంలేదు. ఆహా ఏమదృష్టం! సంవత్సరం పొడుగునా దొరగారి సమ్మంలో ముంగిలాగ నక్కి తిరగలేదు. అప్పో సప్పో చేసి వేలు తగలేసి అన్నప్రత్తో ఏదో కట్టలేదు. పోనీ, అతి సామాన్యవిషయం-లంచాలూ పంచాలూ ఇచ్చి దొరగాళ్ళ కాళ్ళావేళ్లా దేవులాడలేదు. - వూరికే కూచున్నదగ్గిర బిరుదు వచ్చేసింది. కానైతే సత్యం తాలూకు గౌరవరక్షణార్థం స్వార్థత్యాగం చెయ్యడానికి మేము ఎప్పుడూ వెనకడుగు వేసేరకం కాదు.

" నమిథ్యా పాతకం పరం "

అంటే - అసత్యమూ, పాతకమూ పరాయివాణ్ణి చేరదు. తనదగ్గిరే ఉంటుంది. అందుకనే మేము సత్యమే రాయవలిసి వస్తోంది.

భగియా శారియా ఇద్దరే కాదు. వాళ్ళకి వొక ఆవుకూడా వుంది. దానిపేరు సెత్త. దాన్ని కలుపుకుంటే వాళ్లు ముగ్గురు. ఆవు మనుషుల్తో కలిపి లెక్క పెట్టాం. దానికి కారణం వుంది. సెత్తని శారియా కన్నకూతురులా పెంచుతోంది. కూతురులా ముద్దుచేస్తోంది. భగవంతుడు మనుష్యహృదయంలో వొక ఆశ్చర్యకరమైన సంతానస్నేహం పెట్టాడు. ఆకలప్పుడు అన్నం దొరక్కపోతే మనిషి జలసాకు నమిలినట్టు పిల్లాజెల్లా లేనివాళ్లు కుక్కపిల్లనో, పిల్లిపిల్లనో, ఆవుపెయ్యనో పెంచుకుని ప్రేమిస్తారు. పగలూ రాత్రీ పొద్దస్తమానమూ శారియా సెత్తని లాలించేది. మెళ్లోంచి కన్నె విడిపోయినా సెత్త ఎటూ వెళ్లేదికాదు. శారియా దగ్గిరే వుండేది. అది కొంచెం వీధిలోకి వెళ్లిందా, శారియా కేకవేసేది - "సెత్తా! సెత్తా!" అని. సెత్త పలికేది - 'అంబా.' పరిగెత్తుకు వచ్చి శారియాని నాకేది. శారియా దాని వొళ్ళంతా నిమిరేది. లాలించేది. దాంతో కష్టసుఖాలు వూసులాడేది. చల్లన్నం కంచంలో సెత్త మూతి ముంచేస్తే తేలికగా దాన్నో లెంపకాయ వేసేది. హాపాసిముండా అని తిట్టేది. ఆ తిట్టులో ప్రేమా, ముద్దూ వుండేవి. భగియా, శారియా, సెతా ముగ్గురూ వొక గదిలోపడుకునే వాళ్లు. ఊకా, పిడకలగుండా వేసి సెత్త వెనక పొగచేసేది శారియా. సెత్త చాల లక్షణమైంది. ఇప్పుడు దానివెనక

చిన్న దూడ వుంది. సెత్తశరీరమంతా కారునలుపు. మొహంమీద మాత్రం తెల్లటి మచ్చవుంది.

నల్లావు సెత్తిని జొట్టు
దాన్ని తెచ్చి ఇంట్లో కట్టు.

కొమ్ములు సన్ననివి. కొంచెం వాలుగావున్నాయి. తోక సన్నంగా, పొడావుగా వుంది. తోక చివర చామరంలాగ పిడికెడు వెంట్రుకలు నేలని రాసుకుంటూ వుంటాయి. వీపు కొంచెం వంగినట్టు వుంటుంది; పిడికత్తి వెడల్పుగా వెనకభాగం చాలాపుష్టిగా వుంటుంది. మూపురం చిన్న బూడిదగుమ్మిడికాయలా వుండి, వీపు తట్టువాలి వుంటుంది. గంగడోలు బాగా వేలాడుతూ వుంటుంది. పొదుగు చెప్పే అక్కరలేదు.

"పయోధరీభూత—చతుసముద్రాః"

సెత్త కళింగగోవులాగ బాగా ఎత్తయిన ఆవుకాదు. మధ్యరకం. డాకరుషి వచనం వుంది. *

"కడుపు పెద్ద ఆవు కడుపెడు కుడితి త్రావు.
పచ్చగడ్డి మెచ్చు, దాని పాలు హెచ్చు."

సంగతేమిటంటే సాధారణంగా "ఆవునోట్లో పాలు" అంటారు. అలా అని పాలుకోసం ఆవు మొహాన్ని ముంత పెట్టి పాలిమ్మంటామా? అదికాదు. ఆవు ఒక పేపరుమిల్లు లాంటిది. మిల్లు నోట్లో గుడ్డపీలికలూ, మురగపెట్టిన కోపిరిగడ్డీ, దూదీ, వేస్తే, వెనకనించి సాఫయిన, అందమయిన నున్నటి తెల్లకాగితం వస్తుంది. అలాగే ఆవునోట్లో కుడితీ, తవుడూ, గడ్డీ వెయ్యండి. పొదుగులోంచి పాలు ప్రవహిస్తాయి. సెత్త ఎన్ని పాలిచ్చేదీ దాని లెక్కమాకు తెలియదు. అవాళ మంగరాజుగారి దర్బారులో సెత్తమాట వచ్చింది. అందరూ ఊహించిం దేమిటంటే — రెండుపూటలూ ఎంత లేదన్నా అయిదు శేర్లకి తక్కువ వుండదని. మంగరాజుగారు పెద్దనిట్టూర్పు వదిలేసి అన్నారు — "ఈసాలిదాని ఆవు అంత ఇదయిందా?" అని.

"తండ్రినిబట్టి కొడుకు" అంటారు లోకులు. కాని ఇంకోమాట ఉంది. "చెట్టుచచ్చేముందు కుక్కమూతిపిందెలు" అని. అదీ నిజమే. భగియా తండ్రి గోవిందచంద్రుడు వూళ్ళోవొక ప్రధాన వ్యక్తిగా వుండేవాడు. ఊళ్ళోనేకాదు,

---

* డాకరుషి వచనాలని ఒడిశాలోనూ, అస్సాంలోనూ ప్రచారంలో వున్నాయి. వ్యవసాయం గురించీ ఇతరవిషయాలను గురించీ తెలియచేస్తాయవి.

చుట్టుపక్కల నాలుగువూళ్ళలోనూ పంచాయితీ జరిగిందో గోవిందచంద్రుడికి పిలుపు వచ్చేది. పెద్దపెద్ద విషయాలు పరిష్కారం కావలిసివచ్చినప్పుడు గోవింద చంద్రుడి కోసం తప్పకుండా వచ్చేవాళ్లు. అంతేకాదు, ఎవరన్నా బంట్రోతు వచ్చినా, తుదకి వొక బేరింగు ఉత్తరం వచ్చినా గోవిందచంద్రుడు వచ్చేదాకా గ్రామస్థులు ఇంట్లోంచి బైటికి వచ్చేవారు కారు.

గోవిందచంద్రుడు స్వయంగా మగ్గం నేసేవాడు కాడు. సాలీలు నేసే బట్టలు కొనుక్కు వెళ్ళి, సంతలో అమ్మేవాడు. లేదా ఎక్కణ్ణుంచయినా వర్తకులువస్తే వాళ్లకి సరుకు కుదిర్చిపెట్టేవాడు. దీనివల్ల నాలుగురాళ్లు అతడికి ముట్టేవి. గోవింద చంద్రుడి దగ్గిర వేలు వుండేవని ఊహిస్తూ వుండేవాళ్లు లోకులు. తమ అయుర్భాగమూ, పరాయి వాళ్ల ధనమూ అధికంగా అంచనా వేసుకోడం లోకుల నైజం. ఏది ఏమయినా గోవింద చంద్రుడు పొలికా పరకా గడించేవాడు; ఇది మాత్రం నిజం. జమీందారు బాఘుసింగు వంశం పడిపోయినప్పుడు చెక్కాముక్కా అమ్మకానికి వచ్చింది భూమి. గోవిందపురం వూరికింద ఆరెకరాల ఎనిమిది కుంటలు మాగాణి బాహిలి నిష్కారం.* అది గోవిందచంద్రుడు కొనుక్కున్నాడు.

"ఊరిమురుగునీరు ఏ మళ్ళోకి వెళుతుందో
ఊరినాయుడు అమడే దున్నుతాడు."

దీని అర్థమేమిటంటే – ఊరంతటికీ మంచిపొలం వూరినాయుడు సాగుచేస్తాడన్నమాట. గోవిందం కొన్న పొలంలో వూరి మురుగునీరు పారేది. మంచిసారమయిన భూమి. నీటిలోటు లేని మూలాన ఎక్కితొక్కి పండేది ధాన్యం.

సేనాపతికి దొరికె పొలం
వేశాడోయి రావణధాన్యం
మూరెడేసి వెన్నులూ
మూతి ముడుతు రమ్యులూ.

నీరులేక చేను ఎండి పోవడం కానీ, వరదవచ్చి ముంచెయ్యడం కానీ ఆ పొలానికి లేదు. ఎకరానికి ఎనిమిది బళ్లధాన్యం దాచిపెట్టినట్టే. అయితే భగియా సేనాపతి పొలం గుత్తకిచ్చి ఎకరానికి అయిదుబళ్ల యాభైమానికల ధాన్యం సంపాదించేవాడు.

---

* కుంట : మనలో కొన్ని ప్రాంతాల్లో కుంటఅంటే అరఎకరం. కాని ఇక్కడ నాలుగు సెంట్లు.

భగియా దద్దమ్మ ఆయినా అతడి దగ్గిర ఎంతో మంచిగుణమూ వుండేది. తద్దినమో, నోమో, నవాన్నమో వచ్చిందనుకోండీ, కులంవాళ్లకి విందు చేసేవాడు. భట్రాజులూ, బిచ్చగాళ్ళూ వాకిట్లోకి వచ్చి వూరికే పోయేవారు కాదు. "పిరికి వాడికి శత్రువులుండరు." ఊళ్ళో కయ్యం వచ్చిందనుకోండీ, భగియా శారియాలు తలుపులు వేసుకుని ఇంట్లోకూచునే వాళ్లు. అంచేత వీళ్లంటే వూళ్లో వాళ్లందరికీ ఇష్టంగా వుండేది.

దారిద్ర్యం దుఃఖహేతువు. ధనమూ, విద్యా, కీర్తీ, ఆరోగ్యమూ మొదలయినవి ఆవశ్యకమైనవి. వాంఛనీయమైనవి. వీట్లో ఏవిలేక పోయినా మనిషి కష్టపడతాడు. మన సేనాపతి దంపతులికి వీట్లో వేట్లోనూ లోపంలేదు. పవిత్రమైన దాంపత్య స్నేహమూ, విశుద్ధమైన ప్రేమా, అఖండమైన ఆనందమూ, తరుగులేని ఆరోగ్యమూ, సరళమైన ధర్మస్వభావమూ, మొదలయిన స్వర్గీయవిషయాల సమ్మేళనం వొక్క-దగ్గిరే మీరు చూడాలంటే, ఈవూళ్లోని ఈ సేనాపతి దంపతుల పేరేమీకు సూచిస్తాము.

మేము పుట్టిన నాటినించీ చూస్తూ వస్తున్నాము. వింటున్నాము. చదువుతూనూ వున్నాము. మనుషుల లలాటంమీద ఎడతెగని సౌఖ్యం ఎన్నడూ రాయలేదు విధి. సేనాపతి దంపతులు మాత్రం ఈ విధివిధానం ఎలా తప్పించుకోగలరు ? మహాకవి కాళిదాసు రాశాడు – "ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః". [భగవంతుడు సర్వగుణ సంపన్నులుగా చేసి ఎవర్నీ సృష్టించడు.]

ఈమహా వాక్యం ఎలా కొట్టి పారెయ్యగలం ?

ఐతే మన సేనాపతి దంపతులు సంపూర్ణసౌఖ్యం అనుభవించ లేదంటారా ? ఎవరు చెప్పగలరది ? ఎలా చెప్పగలరు కనక ? సాలగ్రామం కూచోడమూ, పడుకోడమూ వొకటే. మనిషి మనస్సులోని భావం – నవ్వూ ఏడుపూ పైకి వుబికి వచ్చేస్తాయి. అయితే భగియా శారియాలు నవ్వడం ఎవ్వరూ చూడలేదు. ఏడవడమూ ఎవ్వరూ వినలేదు. మాటల్లో తెలిసిపోయేది. కాని ఎవళ్లతోనూ మాటలాడరే! అయితే మాదగ్గిరమాత్రం దాగేమార్గంలేదు. వేటకాళ్లు అడుగులజాడ పట్టుకువెళ్లి జంతువుని చూస్తారు. అలాగే మేము మనుషుల నడవడినిపట్టి, వాళ్లమనసులోమాట పట్టేస్తాం. ఆవాళ రాత్రి రుక్మిణమ్మ మనమడిబారసాలకి శారియా వెళ్లింది. కుర్రాణ్ణి చూసేసి వచ్చేసింది. అట్లు పంచేదాకా వుండలేదు. ఇంటికి వచ్చాక కడుపు నొప్పిగావుందని అలాగే పడుకుండిపోయింది. పచ్చిమంచినీళ్లయినా పుచ్చుకోలేదు.

చాలా రాత్రిదాకా నిద్రాపోలేదు. ఈ పక్కా ఆపక్కా వొత్తిగిల్లుతూనే వుండేది. భగియా వొకసారి అన్నాడు: "దేవుడు ఇవ్వనిదానికి దుఃఖపడితే ఏం లాభమే" అని. ఏమిటి దేవుడు ఇవ్వలేదో ఏమీ బోధపడిందికాదే?

వ్రతాలూ నోములూ అంటే మహాపిచ్చిగావుండేది శారియాకి. బుఢీ మంగళా మీద దినదినమూ హెచ్చుగా అవుపిస్తోంది భక్తి.

డాక్టరు గుమ్మంలోకానీ, వకీలుగుమ్మంలోకానీ ఎవణ్ణన్నా చూశారనుకోండీ, అతడికి ఏదో ఆపదవచ్చిందని వెంటనే తెలుసుకోవాలి. మన బుఢీమంగళా వల్ల డాక్టరుపనీ, వకీలుపనీ — రెండూ నెరవేరేవి. ఊళ్లో ఎవళ్లకయినా సుస్తీచేసినా, ఎవరికన్నా ఏదన్నా దావావచ్చినా మంగళా అమ్మతల్లికి లాభించేది.

మంగళా అమ్మవారిమీద శారియా చూపుతూవున్న భక్తినిబట్టి ఆమె మనస్సులో ఏదో కష్టం బాధిస్తోందనే అనిపిస్తోంది. శారియా అరుగుమీదకూచుని పంటికర్ర తిప్పుతూవున్నప్పుడు వీధిలో ఎవరన్నా చిన్నపిల్లలు అవుపిస్తేచాలు, ఆమె చేతిలో పంటికర్ర తిరిగేదికాదు. పండుగూ పబ్బాల్లో ఇంట్లో ఏదన్నా పిండివంట చేసుకుంటే, వొక పెద్ద నిట్టూర్పు విడిచేదామె. భగియా వొట్టూ గిట్టూవేసి తినిపించేదాకా తినేదికాదు. ఒకనాడు చిన్నపిల్లల గావంచాలు రెండు బరాతంచేసి భగియా దగ్గిర వొకరు నేయించుకు వెళ్లారు. నేత పూర్తయాక ఆ రెండూ మడతపెడుతూ శారియా కళ్లల్లో నీళ్లు పెట్టుకుంది. అదిచూసి భగియా పెద్ద నిట్టూర్పు వదిలాడు.

# 11

## గోబరా జెనా

సాలెవీధికి నలభైయాభై అంగల దూరంలో పొలాలమధ్య డొంబు వీధి * వుంది. ఇది వేరేవూరు కాదు. గోవిందపురంలోదే. అక్కడ డొంబువాళ్ళ పది కొంపలున్నూ, చాకీదారు గోబరాజెనా ఇల్లున్నూ వున్నాయి. గోబరాజెనా గోవిందపురం చాకీదారు. పదిఎకరాల చాకీదారు జాగిరి వుందతడికి. అదికాక ఏటా వూళ్ళో ఇంటిపక్కంటికీ ఒక ధాన్యంకట్ట మామ్మూలు దొరుకుతుంది.

* హరిజనవాడ

జెనా మొదటి నించీ తనపనిలో హుషారుగా వుంటున్నాడు. అతడంటూ వుండబట్టే వూళ్ళో దొంగతనమూ దోసుగుతనమూ జరిగేది కాదు. ప్రతీ సంవత్సరం గ్రామంలో నాలుగయిదు కన్నాలు జరిగేవి. నిజమే. కాని అందులో జెనా దోషమేమీ వుండేది కాదు. ఏమంటే, ఆదొంగతనాలు జరిగే రాత్రిళ్ళు జెనా వాళ్లకులం పనుల్లో నాలుగయిదు కోసుల దూరం గ్రామాంతరం వెళ్లేవాడు.

చాకీదారు తెల్లవార్లూ వూళ్ళోపహరా ఇచ్చేవాడు. అయితే అతడెంత చలాకీగా పహరాచేసేవాడంటే, అతడు పహరా ఇవ్వడం పిట్టమనిషికి తెలిసేది కాదు. కేకలువేసి పహరా ఇస్తే అలుకుడు విని దొంగలు వుడా యిస్తారు. పాతపోలీసులు బాగా లంచాలు తినే వారని అపవాదు వుంది. అది నిజమో అబద్ధమో భగవంతుడి కెరుక. లోకం ముయ్యడానికి మూకుడు లేదు. పులులు మనిషిని తినేస్తాయి. అలా అని అన్నిపులులూ మనిషిని తింటాయా? సాధువు లయిన పులులు లోకంమీద లేనేలేవా? మనజెనా వున్నాడే అదిగో అలాంటి సాధువు. సచ్చరిత్రుడు. అతడి వాజీబు అంటే సంవత్సరాని కొక ధాన్యం కట్టా, పెళ్లీ మొదలైన-కార్యాల్లో వొక గుడ్డముక్కా, పైగా పెళ్ళికొడుకు దగ్గిర రూపాయి రుసుమూ, మాసికాలూ వాట్లో భత్యంబాపతు మామ్మూలూ, పండిట్లో కాస్తే వొక గుమ్మిడికాయా – ఇవి తప్ప ఎవ్వరిదగ్గిరా లంచాలు గించాలూ పుచ్చు కునేవాడు కాడు.

ఊళ్ళో దొంగతనం జరిగినా, ఎవర్నయినా పాము కరిచేసినా, ఎవళ్ళయినా నీటిలో మునిగి చచ్చిపోయినా పోలీసుదగ్గిర ఫిర్యాదుకని చాకీదారుకి వొక రూపాయి మామ్మూలు. అది లా లోనే వుంది. దానికీ చాకీదారుకీ సంబంధ మేముంది? పైగా గోవర్ధనుడు (గోబరా) చాలా దయాస్వభావుడు. బీదాసాదా ఎవరిపనైనా పడిందనుకోండీ, వాళ్లదగ్గిర గిన్నో, ముంతో పుచ్చేసుకుని పని కానిచ్చే స్తాడు. నెలకోసారి పోలీసురిపోర్టు ఇవ్వడానికి వెళ్లేటప్పుడు, ఊళ్ళోంచి వొక అరిటిగెలా, ఓ ఇన్ని అనపకాయలూ, నాలుగు గుమ్మిడికాయలూ మున్సీ కోసమూ, జమాదార్లకోసమూ పట్టుకెళ్ళడం సాధారణ విషయం. పని జంజాటం మూలాన జెనా రాత్రిపూట ఇంట్లో అన్నం తినలేకపోయేవాడు. వారాలు పెట్టుకుని ఊళ్లోవాళ్ళ ఇళ్లల్లో తినేసేవాడు. ఏరోజు ఎవరింట్లో భోజనమో, ఆరోజు ముందుగా వేళవుంటూ వుండగానే పిడికెడుబియ్యం తనకోసం పడెయ్యండని పనికట్టుకు వచ్చి చెప్పిపోయేవాడు. ఏదన్నా మంచోచెడ్డో వచ్చి, ఎవరి ఇంట్లో అయినా అతడికి ఆపూట తిండిపెట్టడానికి వల్లకాకపోయిందో, ఆరాత్రి వాళ్లఇల్లు -

పహరా ఇవ్వడం అశ్రద్ధచేసేసేవాడు. దాంతో వెంటనే దొంగలు ఈ విషయం పసికట్టేసే వాళ్లు. ఆరాత్రి ఆ ఇంటి పెరట్లోంచో ఇంటి పందిరి మీంచో కాయ గూరలు కాటేసేసే వాళ్లు. లేదా వాళ్ల పొలంలో ధాన్యం కోసి పట్టుకు పోయే వాళ్లు. ఏదీ దొరక్కపోతే వీధి గుమ్మంలో రాటో, కొయ్యో విరిచేసి పోయేవాళ్లు.

ఊళ్లో తిండి తినేసి గోబరాజెనా ఇంటికి వెళిపోతూ దారికడాకా హెచ్చరిస్తూ వెళ్లేవాడు —"ఊళ్లోవాళ్లూ హుషార్, ఇంట్లోవాళ్లూ ఖబర్దార్" అంటూ కేకలువేసి పహరా ఇచ్చేసేవాడు. అందాకా నిద్రపోకండావుంటే చిన్నపిల్లలు ఆ కేకలువిని పడుకుండిపోయేవాళ్లు. ఆ తరవాత తెల్లవార్లూ వూళ్లో పహరాచేసేవాడు జెనా. అది వూళ్లోవాళ్లు ఎవళ్లకీ తెలిసేదికాదు.

గోబరా జెనాని వొక బారికివాడికింద జమకట్టకూడదు. సమయంవస్తే వెయ్యో అయిదువందలూ పైకి తియ్యగలడు. ధాన్యం ఆరేడుబళ్లు ఎప్పుడూ ఇంట్లో నిలవవుంటాయి. ఎవళ్లెంత హుషారు వాళ్లయినా కష్టాలూ, దుఃఖాలూ ఎవళ్లనీ వొదిలి పెట్టవు. ఒకసారి వొక దొంగతనంకేసు గోబరాజెనామీద పడింది. రెండున్నర వందలు రూపాయలు మున్సీచేతిలో పోసేసి అది తప్పించుకున్నాడని వినికిడి. ఆకేసు వివరమేమిటంటే — మాఖనపురం గ్రామంలో తెలకరి సాహుకారు భువనిసాహు ఇంట్లో జరిగిన డకాయితీకేసులో ఎనమండుగురు అరస్టయారు. గోబరా జెనా సలహా ప్రకారం ఈ డకాయితీ జరిగిందనీ, ఇంకా మరిపది దొంగతనాల్లోనూ అతడి సలహా వుందనీ, దొంగిలించిన వస్తువులు అతడిద్వారా అమ్మకం జరుగుతున్నాయనీ, ముద్దాయిల్లోంచి దికడియా డొంబువాడు చెప్పేశాడు. కాని తక్కిన ముద్దాయిలు ఇది వొప్పుకోలేదు. అంచేత గోబరాజెనా వొంటిమీద మచ్చ పడలేదు.

గోబరాజెనా యోగ్యతవల్ల మంగరాజుగారికి అతడంటే చాలా ఇష్టం. ఉదయమూ, సాయంకాలమూ మంగరాజుగారి కచేరీ దగ్గిర గోబరాజెనా హాజరయ్యేవాడు. అర్ధరాత్రప్పుడు గోబరాజెనా మంగరాజుగారూ ఏకాంతంగా మాట్లాడుకోడం అనేకమంది చూశారు.

ఫతేపూరు సరవండ తాలూకాలో ఎంతోమంది డొంబువాళ్ల ఇళ్ళువున్నాయి. దొంగతనమూ, బందిపోటూ, దారిదోపిడీ వాళ్లవృత్తి అని లోకులు సందేహించే వాళ్ళు. పోలీసులతోనూ, జెయిళ్లతోనూ వాళ్లకి ఎడతెగని సంబంధమే ఈసందేహానికి కారణం.

గోబరాజెనా దగ్గిర ఇంకో గొప్ప గుణం వుండేది. ఎవడయినా డొంబు వాడు జెయిలుకి వెళితే అసహాయులైన వాడిపెళ్ళాం పిల్లల్ని ఇబ్బంది లేకండా

కనిపెట్టేవాడు. మంగరాజుగారి దగ్గిరనించి ధర్మపడి ఇప్పించేవాడు. నిందించే వాళ్లు ఎప్పుడూ నిందించడం మానరు. గోబరాజైనా చేసే ఈమంచిపనికి వాళ్లు చిలవలూ పలవలూ చెక్కి లేనిపోని అర్థాలు చెప్పేవాళ్ళు. దాంతో మంగరాజు గారు చేసిన ధర్మానికి మసిపూసి చిత్రించేవాళ్లు.

# 12

## అ సు ర దీ ఘి

గోవిందపురం గ్రామంలో వొక్కటే కోనేరు. వూళ్లోయావన్మందీ దాన్లోని నీరే వాడుకునేవాళ్లు. కోనేరు చాలా పెద్దది. గెడవేసికొలిస్తే పది పన్నెండు గెడ లుంటుంది. ఆ కోనేరు పేరే అసురదీఘి. ఇందులో పూర్వం పదహారు చక్రస్తంబా లుండేవి. దేవతల ప్రభావం వల్ల అన్నీ మునిగిపోయాయి. నాలుగు దిక్కులా గట్టు పదిపన్నెండుమూళ్లు ఎత్తుంటుంది. ఈ కోనేరు ఏ కాలందో ఎవ్వరు తవ్వించారో ఆ వివరాలు చెప్పలేం మేము. అసురులు తవ్వారని వినికిడి. అసంభవం కాదిది. ఇంత పెద్దకోనేరు-తవ్వినవాళ్లు మనలాంటి సామాన్యులా మరి! ఊళ్లో తొంభయిఅయిదు సంవత్సరాల ముసిలి సేనాపతి ఏకాదశియా నోట సంగ్రహించిన విషయం చెపుతాం వినండి :—

ఈ చెరువు బాణాసురుడు తవ్వించాడు. అతడు తనచేత్తో పారా తట్టా పట్టుకుని తవ్వలేదు. అతడి హుకుమ్మీద రాక్షసులు వచ్చి రాత్రికిరాత్రి తవ్వేశారిది తవ్వగా తవ్వగా తెల్లవారిపోయింది. దక్షిణదిక్కు మూల పది పన్నెండు మూళ్ల మేరల్పుని వొక కాలవవుంది. అక్కడ మన్ను వెయ్యడం మిగిలిపోయింది. వీథిలో అప్పుడే మనుషులు మసలడం మొదలెట్టేశారు. రాక్షసులు ఎటువెళ్తారిక! కోన్లో సొరంగం తవ్వుకుని వెళ్లి గంగవొడ్డుని పైకి వచ్చారు. అక్కడ గంగాస్నానం చేసుకుని వెళ్లిపోయారు. పూర్వం గంగానదిలో వారుణీయోగం * పడితే అసుర దీఘిలో గంగవుబికి వచ్చేది. ఊళ్లో పాపం పెరిగిపోవడం మూలాన ఇప్పుడిది రావడం లేదు. ఇంగ్లీషు చదువుకున్న బాబులూ!, జాగ్రత్త. మా ఏకాదశి చంద్రుడుచెప్పిన

---

* చైత్రబహుళ త్రయోదశినాడు గంగలోనూ సముద్రంలోనూ స్నానం చేసే యోగం.

చరిత్ర వినినవ్వకండి. అలా అయితే మన మార్సమన్ ఆఫ్‌టాక్ గారి రాతలో సగానికి సగం ఎగిరి చక్కాపోతుంది.

దీఘిలో చేపలున్నాయి. "ఎక్కడ నీళ్లుంటే అక్కడ చేపలుంటాయి. ఈ సంగతి వేరే చెప్పడమెందుకూ?" అంటారు మీరు. కాని మీరన్నమాట తర్కానికి నిలవదు. చెరుకుతో బెల్లానికీ, శరీరంతో ఎముకలకీవున్న సంబంధం నిత్యం. నీళ్లకీ చేపకీవున్న సంబంధం మాత్రం అలాంటిది కాదు. అదే అయితే మా యింట్లో వున్న నీళ్లకడవల్లోంచికూడా చేపలు వచ్చేవి. ఊహించికానీ, సందర్భం లేకండా కానీ రాసే అలవాటులేదు మాకు. అసురదీఘిలో చేపలున్నాయని సప్రమాణంగా రుజువుచేస్తాం. అదిగో, చూడండి దక్షిణం గట్టుకేసి, నీటికి అయిదుమాళ్లదూరంలో ఆఁ అని నోరు చాచుకుని చిన్నాపెద్దా మూడు పొడవుమూతి మొసళ్లుపడివున్నాయి. రోజూ పడివుంటాయలాగ. ఇవి దీఘిలో ఎందుకున్నట్టు? ఏమిటితిని బతుకుతున్నట్టు? పశువుల్లాగ బయళ్లలో ఇవి గడ్డిగాదా మెయ్యడం ఎవరైనా చూశారా? లేదా జైనుల్లాగ అహింసా పరమధర్మం వాటికి తెలుసునంటారా? కాదు. తప్పకండా దీఘిలోంచి ఏదో పదార్థం తినే బతుకు తున్నాయవి. అయితే ఆ పదార్థ మేమిటి?

పొడవుమూతి మొసళ్ళకి చేపలమొసళ్ళని మరోపేరుంది. దానర్థ మేమిటంటే ఇవి చేపలు తింటాయి అని. ఇవి చేపలు తింటాయి నిజమే. అయితే మరెక్కణ్ణుంచయినా తెచ్చి తింటున్నా యంటారా? సంతల్లో చేపలూ, ఎండు చేపలూ దొరుకుతాయి. కాదనం. కాని డబ్బులు పట్టుకెళ్లి సంతలో మొసళ్లు చేపలు కొనుక్కురావడం, ఏదీ ఎవ్వరూ ఎప్పుడూ చూసి నట్టు లేదే! ఊళ్లోకి చేపలవాళ్లు అమ్మకానికి చేపలు తెస్తారు. ఊళ్లోని ఆడంగులు ధాన్యమో, బియ్యమో వెల ఇచ్చి చేపలు కొనేస్తారు. మేం ఒట్టువేసి చెప్పగలం, అలా బియ్యమూ ధాన్యమూ ఇచ్చి మొసళ్ళు చేపలు కొనడం ఎన్నడూ చూడలేదు. కాగా దీఘిలో చేపలు వున్నట్టు రూఢయింది. ఇంతే నిదర్శనమని కాదు. తిరుగులేని నిదర్శనాలు ఇంకా ఎన్నో వున్నాయి.

అదిగో చూడండి, — నాలుగు నీటికోళ్లు భరతనాట్యం చేస్తున్నట్టు తిరుగుతున్నాయి. బొమ్మిడం పిల్లనో, పాలపరిగెనో మింగుతున్నా యనికదా, ఈ నాట్యం! ఇతర్ల ప్రాణంతీసి ఇంత ఆనందం! ఈనీటికోళు ఎంత నిష్ఠురవీ, ఎంత దుర్మార్గమైనవీ అని ఎవరయినా అనవచ్చు. అయితే బాబూ, అన్నదేదో ఆలోచించి అనండి. వాటిని నిష్ఠురమైన వనండీ, దుర్మార్గమైన వనండీ, సైతాను లనండీ —

ఏమయినా అనండి. అవి మీ మీద ఏమీ మాననష్టం దావా తేవు. కాని వొకటి మాత్రం వినండి, మీమానవ సోదరుల్లో ఎవరు ఎంత పీకపిసికితే వారు అంత బహద్దర్లు. అంత గౌరవనీయులు. అంత గణ్యులు. ఇదిమీకు తెలియందా ?

నాలుగయిదు పుంజీలు తెల్లకొంగలూ, అయిదు గుడ్డికొంగలూ తక్కువ రకం కూలీలలాగ ఉదయంనించీ సాయంకాలం దాకా బురద కుమ్ముతున్నాయి. దీఘిలో చేపలున్నాయనడానికి ఇది మూడో నిదర్శనం. రెండు నీటి కాకులు ఏదేశంనించో ఎగిరి వచ్చాయి. దీఘిమధ్య రెండుమూడు మునుగులు మునిగి కడుపు నిండించుకుని పుర్రుమని ఎగిరిపోయాయి. ఒక నీటికాకి దొరసానమ్మ గౌనులాగ వొడ్డుని కూచుని రెక్కలారేసుకుంటోంది. ఓహిందూ ధర్మావలంబులయిన కొంగల్లారా! ఇంగ్లీషు నీటి కాకులు చూడండి. ఏదేశంనించో పరగడుపుతో వచ్చి, కప్పలో, మిట్టపల్లలో చెరువులో మెక్కి వెళ్ళిపోయాయి. దీఘి గట్టుని మర్రిచెట్టుమీద మీ బస. రోజంతా నీళ్లు కుమ్ముకుంటూ పాలపరిగో, పిత్తపరిగో తప్ప అధికం సంపాదించలేకపోతున్నారు మీరు. జీవనసంగ్రామకాలం వచ్చింది. ఇకముందు ఇంకా నీటి కాకులు దిగబడతాయి. కప్పలూ, గిడసలూ, మోసుకు పుడాయిస్తాయి. మీరు విదేశాలువెళ్లి సముద్రం ఈదడం నేర్చుకోకపోతే లాభంలేదు.

గెద్ద చాలా తెలివైంది. మాంచి వుషారైంది. ఆచార్యులుగారిలాగ కొమ్మమీద మాట్టాడకండా కూచుని వుంది. ఒక్కసారి నీటిలో వురికి చపాయించిన దాంతో దానికి వొక రోజుభత్యం గడిచిపోతుంది. గురువులు సంవత్సరం పాటు గడప దిగరు. ఏడాదికొకసారి శిష్యుల గుమ్మానికి వెళతారు.

చెరువులో కొంగలున్నదగ్గిరనించి లోపలికి యాభైమూరలదాకా నాచు కిక్కిరిసివుంది. ఆ నాచుమధ్య హిందువుల అత్తచాటు కోడళ్లలాగ కలవలు రాత్రిళ్లు మౌనంగా వికసిస్తాయి ; పగలు ముడుచుకునివుంటాయి. అందులో నీటినాచుపువ్వులు పెళ్లికాని ఆడపిల్లల్లాగ— సిగ్గూ బిడియంలేదు— పగలూ, రాత్రీ గాలికి తుళ్లింతలాడతాయి. ఇంకా లోతునీళ్లలో ఎర్రతామరలున్నాయి. ఇవి, చదువుకున్న కిరస్తానం దొరసానులు ; కలవల్లోంచి వేరయిపోయాయి; పద్మాల్తో కలవలేకపోతున్నాయి. దీఘి నడిమధ్య నాచులేదు. రాత్రిళ్లు మంగళా అమ్మవారు అక్కడ జలకేళిచేస్తుంది, అంచేత అక్కడ నాచువుండదు. భారతీయుల కొంగుబంగారం, లక్ష్మీదేవినివాసం· సరస్వతీదేవి ఆసనం, బ్రహ్మదేవుడి జన్మస్థానం— పద్మం. అదిగో ఆ పద్మవనంతో నిండివుంటుందక్కడ. పద్మాలమీద అమ్మవారిదే సర్వాధికారం. ఒకసారి వొక మనిషి పద్మపుష్పం కోసం ఈదుకుంటూ మధ్యకి వెళ్లాడు. వాడి కాళ్లకి గొలుసు

కట్టి అమ్మవారు లోపలికి లాగేసింది. ఆవాళనించే పద్మాలదిక్కు ఎవ్వరూ చూడరు.

అసుర దీఘికి నాలుగు రేవులున్నాయి. చెప్పాలంటే మూడే అనాలి. దక్షిణం దిక్కు రేవుకి ఎవరూ వెళ్లేవారు కాదు. ఊళ్ళో ఎవరన్నా చచ్చిపోతే ఆరేవులో దశాహక్రియ జరిగేది. ఆరేవుచాలా ప్రమాదకరమైంది కూడాను. రాత్రిళ్లమాట అలావుంచండి, పట్టపగలూ అక్కడికి ఎవ్వరూ వెళ్లేవాళ్లు కాదు. ఈరేవుకి పైన పెద్దమర్రిచెట్టుంది. దానిమీద ఎల్లప్పుడూ ఇద్దరు బ్రహ్మరాక్షసులు వుండడం అందరికీ తెలుసు. నిశిరాత్రప్పుడు బ్రహ్మరాక్షసులు కాళ్ళు వేలాడ దీసి చెట్టుమీద కూచోడం చాలామంది చూశారు. ఎవరెవరు చూశారో వాళ్ళ పేళ్ళు తెలియవు కాని చూడడం మాత్రం నిజం. ఇంకా ఆగట్టుమీద పిశాచాలూ, డాకినీ దెయ్యాలూ ఎల్లప్పుడూ ఇల్లుకట్టుకుని, చీకటి రాత్రిళ్ళు దీపాలుపెట్టి చేపలు పట్టడమూ, విశేషించి వర్షంలో జట్టు జట్లుగా తిరగడమూ — వీటికి ప్రత్యక్ష ప్రమాణముంది.

తూర్పుదిక్కు చాకిరేవు. ఇద్దరు చాకళ్లు "ఇస్, ఇస్ – రామ్ రామ్" అంటూ రాతిమీద బట్టలు బాదుతున్నారు. "ఊరి బండారం చాకిరేవుతో తెలిసిపోతుంది." గోనె పట్టాల్లాగ మురకగుడ్డలు బిండెడు కుప్పపడి వున్నాయి. బట్టలు వుడకబెట్టడమూ, ఆరవెయ్యడమూ – ఈపని నలుగురు చాకెతలు చేస్తున్నారు. వాయువ్యకోణంలో సాలీలరేవు. అది వూరికి మధ్యగా వుంటుంది. అంచేత తెల్లవారేసరికి అక్కడ వూరి ఆడంగుల సంత సిద్ధం. ఆడంగుల సంత అంటే అక్కడ ఆడంగుల్ని కొనడం,అమ్మడం – ఇలాంటి దేదో వుంటుందనుకునేరు. కేకలూ, గందికా బట్టి సంత అన్నాం. అంతే. వంటలవేళ స్నానాలప్పుడు ఓ, మరీసందడిగా వుంటుంది. ఊళ్లోదినపత్రిక ప్రకటింప బడుతూ వుంటే సంపాద కుడు వార్తలకోసం హెచ్చు కష్టపడనక్కర వుండేది కాదు. చిన్నపెన్సులూ, కాగితం పట్టుకుని విలేఖరి ఇక్కడ కూచుంటే చాలు — కావల్సినన్ని వార్తలు దొరి కేవి. గత రాత్రి ఎవరింట్లో ఏమిటి వండారో, ఇవాళ ఏమిటి వండుతారో, ఎవరు ఎప్పుడు నిద్రపోయారో, ఎవరికి ఎన్ని దోమలు కుట్టరయో, ఎవరింట్లో వుప్పుతక్కువ వచ్చిందో, ఎవరు నూనెబొట్టు అరువు తెచ్చుకున్నారో — ఇవన్నీ అక్కడే.

రాముడమ్మగారి కొత్తకోడలు చాలా కయ్యాళి. నిన్ననంటూ వచ్చింది – ఇవాళ అత్తకి జవాబు చెప్పింది.

కమల ఎప్పుడు అత్తవారింటికి వెళుతుందో ?

సరస్వతి కూతురు మంచిపిల్ల. వంట చక్కగా చేస్తుంది. సిగ్గుపడుతూ వొదిగి వుంటుంది.

పద్మ నీళ్లలో కూచుని పళ్లుతోముకుంటూ చిన్న ఉపన్యాసం ఆరంభించేసింది. — దాని సారాంశం ఏమిటంటే — తనలాగ వంటచేసే ఆడది వూళ్లో మరొక్కతె లేదట!

ఇలా అవసరమైనవీ, అనవసరమైనవీ ఎన్నో మాటలు నీలాటిరేవులో అనర్గళంగా సాగిపోతున్నాయి.

కొంతమంది అందకత్తెలు వాళ్ల అందం మరింత పెంచుకోడం కోసం పవిటి చెంగుతో మొహం గట్టిగా తోమేసుకుంటున్నారు. లక్ష్మి అలా తోమితోమి ముక్కుపుడకలమీద నాశికాభాగం కందిపోయేలా చేసేసుకుంది. విమల నీళ్లదగ్గర కూచుని చేతుల్లోని అరవీసెడు ఇత్తడి మురుగురు తట్టెడు ఇసకతో తోముతూ, ఎవరో పేరులేని వొకామెని ఉద్దేశించి, నిఘంటువుల్లోలేని శబ్దజాలంతో పురాణం ప్రారంభించింది. గతరాత్రి ఆమె గుమ్మిడిపాదు ఎవళ్లదో పశువు మేసేసింది. అదీ ఆమె పురాణంలో కథావస్తువు. పశువు తాతముత్తాతలూ తినవలిసిందని – మల పదార్థాలన్నీ నోటితో ఏకరు పెట్టిందామె. పశువుచెడ్డగుణం చిలవలూ పలవలూ చేర్చి వర్ణించింది. తన పెరటిమన్ను సారమూ, గుమ్మిడిపాదు కోమలత్వమూ, భవిష్యత్తులో దానిపంటా నిదర్శన పూర్వకంగా అభివర్ణించింది. అనతికాలంలోనే పశువుకి వచ్చే రోగమూ – అప్పుడు దాన్ని బ్రాహ్మడికి దానం చేసెయ్యవలిసిన పరిస్థితీ ఉటంకించింది.

ఈరేవు నించి ఇంకా వార్తలు సంగ్రహించి వుండుం. కాని మార్కండడ గాడి తల్లీ, యశోదా – ఉభయుల మధ్యా భయంకరమైన కలహం అరంభమైపోయింది. అంచేత ఆపని వల్లకాలేదు.

యశోద నీళ్లలో కడుపుమంచుకు కూచుని పళ్లుతోముకుంటూవుంది. అయిదేళ్ల అబ్బాయి మార్కండడగాడు గెంతులేసి నీళ్లు బురదచేసేశాడు. యశోదమీద నీళ్లతుంపర్లూ చల్లాడు. దాంతో ఆమె లేచివచ్చి కుర్రాణ్ణి అడ్డమానితిట్లూ తిట్టింది. వాడి ఆయుర్దాయం కూడా తగ్గించేస్తూ శాపనాకారాలు పెట్టింది. దాంతో వాడి తల్లి పరిగెత్తుకువచ్చింది. యశోదగొంతుకతో సమానమయిన గొంతుకపెట్టి తగిన జవాబు లంకించుకుంది. చివరికి మార్కండడగాడితల్లి వోడిపోయింది. కుర్రాణ్ణి చుర్రు

మన్నట్టు వొక్కటి బజాయించింది. నీటికడవ చెంకని పెట్టుకుని, కుఱ్ఱాడిచెయ్యి ట్టుకుని చరచరా ఇంటికి నడిచేసింది. కుఱ్ఱాడు ఛేఁ మంటూ ఏడుస్తూనేవున్నాడు. పఇతి యుద్ధకాండః:

పిడుగు కిందపడిపోతుంది. కాని వురుము శబ్దం ఆకాశం మీద చాలాసేపు వుండిపోతుంది. కలహం ముగిసిపోయింది. కాని దాని మీద విమర్శన ఎంతోసేపు సాగింది. ముసిలమ్మలూ, సగం ముసిలమ్మలూ రెండు పక్షాలుగా చీలిపోయారు. కొందరు మార్కండేయగాణ్ణి సమర్థించారు. కొందరు యశోదని సమర్థించారు. మేము మాత్రం సంపూర్ణంగా యశోదపక్షం.

బాగా బుద్ధి వినియోగించి, సూక్ష్మ విచారణచేసి తెలుసుకున్నాం. అసలు ఈకలహం పుట్టడానికి మూలకారణం మార్కండగాడు. సంపూర్ణంగా నేరస్తుడు వాడు. క్షమించరానిది వాడి నేరం. ఇంకా వాణ్ణి తిట్టండి. కొట్టండి. ఇంకా ఏమన్నా చెయ్యండి. దానికి మేమున్నాం. చూడండీ, నీరు లోకుల జీవనం. పైగా సాలిరేవునీళ్లు వూరంతా తాగుతారు. అలాంటినీళ్లు బురదచెయ్యడమంటే, అది సామాన్య నేరమే అంటారా? చూశారూ, యీ ఖైమందో, వందమందో ఆడంగులు వచ్చారు. ఇంచుమించు అందరూ కడుపులు మునిగేట్టు నీళ్లలో కూచుని పళ్లుతోముకున్నారు. నవఫేనఖండ తుల్యమయిన వుమ్ములూ, కాండ్రింపులూ వాళ్ల అధరాల్లోంచి పైకివచ్చి, నీళ్లలో తేలి ఆడుతున్నాయి. ఈషత్ లో హితపాటలాభమయిన నాలికలుగీసిన పాచీ ముద్దలుముద్దలు అంతటా తేలి ఆడుతూవుంది. వాటితో ఇంకా ఏమయినా తేలి ఆడుతూ వుందో లేదో చెప్పడానికి వల్లకాదు. ఏమంటే స్త్రీలు యావన్మందీ బైలునించి వచ్చే నీటిలో ప్రవేశిస్తున్నారు. ఎవరిమాటో ఎందుకూ? యశోదనే అడగండీ, ఆమె కాదనదు. ఇది సనాతనంగా వస్తూవున్న పంథాయే. అదొక నేరం కనుకనా మేం దాచిపెట్టడానికి?

ఒక అగస్త్యభ్రాత ఎవడో అన్నాడు: “ఆడవాళ్లు చెరువులోంచి కడవల్లో ఎన్నినీళ్లు తెస్తారో, అందులో పాదభాగంనీళ్లు వదిలేస్తారు” అని. ఈమాట అక్షరాలా నిజమే అయినా, మా కళ్లకిమాత్రం గోచరం కాలేదు.

కొందరు రాత్రిపడుకున్న తుంగచాపలు కడిగిందికి పట్టుకువచ్చారు. కొందరు చిన్నపిల్లల బొంతలూ, గుడ్డలూ వుతకడం చూశాం. ఏమయినా ఆడంగులు రేవులో ఇన్నీ చేశారనుకోండీ, అయినా మార్కండగాడిలాగ గెంతులువేసి నీళ్లు బురద మాత్రం చెయ్యలేదు. గెంతులు వెయ్యకపోతే నీళ్లు కరాబ్ కావుకదా! అందుకనే మార్కండగాడినేరం క్షమించ రాందని అంటున్నాం.

సాలి రేవుకి మూడువందల అంగలు దాటి సామంత రేవువుంది. ఉదయం వేళ ఈ రేవుకి ఆడవాళ్లు ఎవరూ వెళ్లేవాళ్లు కాదు. పూర్తిగా పురుషుల స్వాధీనంలో వుండే దది.

వైశాఖమాసం రోజులు. పగలు ఆరున్నరయిందవుతుంది. ఆ కాలం మాంచి అగ్గి కురుస్తూవుంది. వడగాల్పులు వీస్తున్నాయి. దున్నిన పొలాల్లోంచి దుమ్ము రేగి, అగ్గి ముట్టుకుని పొగలు రేగినట్టు అవుపిస్తోంది. నీలాటి రేవుని మనుషులు నిండిపోయారు. కృష్ణపక్షం తరవాతి వెన్నెలరాత్రి తెల్లవారుఝామునని వ్యవసాయదార్లు ఏస్లు పూశారు. అంతా ఏస్లు విప్పేశారు. ఇంటిగోడకి నాగలిచేరవేసి, కసింత నూనె తలకీ, వొంటికీ రాసేసుకుని వచ్చారు కొందరు. కొందరి భుజాలమీద తరవాణికసపెట్టిన ముదక గావంచా లున్నాయి. కొందరికి గావంచాలే లేవు. కొందరు సరాసరి పొలం నించే వచ్చేసి, ఎడ్ల మెడమీంచి పూటాలు విప్పేసి చప్పున నీటిలోకి వెళ్ళారు. కొన్ని ఎడ్లజతలు కడుపారా నీళ్ళుతాగేసి, వొడ్డుని మేస్తున్నాయి. కొందరు పల్లోముపుల్ల నములుతూ వచ్చి, చెరువులో ముడుకుడు లోతుకి వెళ్ళి నాలిక గీసేసి, పుడకలు వొడ్డుకి విసిరేశారు. చెరువు రెండుపక్కలా అరబండి ఎండుపలకర్రలు కుప్పపడి వున్నాయి.

పురుషులూ మౌనంగా స్నానాలు చెయ్యరు. ఆడంగులమల్లేనే ఎన్నో మాట్లా డతారు. కాని అవన్నీ వొకేరకం మాటలు. పాతమాటలు. అవన్నీ రాసి ఏమిటి లాభం? మొగిలికింద పొలం వెదచల్లడం మొగిసిందట! మఱ్ఱికింద మళ్లు రెండోదుక్కి పూర్తయింది. రాముడు చల్లడం మొదలుపెట్టాడు. భీమన్న ఎడ్లు జోరయినవి. మంగరాజుగారి తెల్లఎడ్లు రెండూ ఎడ్లుకావు— రెండు ఏనుగు గున్నలు. నేను ఎర్ర ఎద్దు కొని పిడికెడు రూపాయలూ గంగలో పోసేశాను. మంగరాజుగారు అప్పు లిచ్చే ధాన్యంకొట్టు ఈ నెల్లో తెరుస్తారు. ఈనెల పదిహేనుదినాల్లో శ్రవణం వచ్చే స్తుంది. నాహాక (సిద్ధాంతి) చెప్పాడు, మునురు పెడుతుంది.— ఇవన్నీ అందరికీ తెలిసినవే. అధికం ఏమిటి రాయడం?

# 13

## హి తో ప దే శం

మొదటామె — మహాజోరుగావున్నాయి గుసగుసలు!

రెండోఆమె — ఊడిపోతారేమో వివాహాలు!

మొదటామె — పొలమా ఇల్లా ?

రెండోఆమె — అంతా గుల్ల.

అదెవరు బాబూ, సాలిరేవులో కవిత్వం? వంటపొద్దు నాలవేళ దాటి పోయింది. సాలీలరేవులో వయస్సు మళ్లిన ఇద్దరు యువతులు కూచుని పళ్లతోము కుంటున్నారు. ఉభయుల మధ్యా పది మూరల దూరం ఎడముంది. పైమాటలు చెప్పుకుని ఇద్దరూ వొకరి మొహం వొకరు చూసుకున్నారు. చిరునవ్వులు నవ్వుకున్నారు. వెంటనే ఏదో జంకేసినట్టు వూరుకున్నారు.

మీరు గట్టిగా మాట్లాడండి, ఎవ్వరూ అది గమనించరు. మీదగ్గిరసా వున్న వాళ్లు కూడా అవి వినిపించుకోరు. కాని ఇద్దరు గుసగుసలాడా లోకులమనస్సు దానిమీదికే వెళుతుంది. ఆ మాటలు వినాలని అందరికీ ఉత్సుకత కలుగుతుంది. నిజానికి చిన్నవిత్తనంలో మహావృక్షం అడిగి వున్నట్టు, చిన్నచిన్న మాటల్లోనే గొప్పగొప్ప విషయాలు దాక్కొని వుంటాయి. రేవులో మరెవ్వరూలేరు. ఆ ఇద్దరు స్త్రీలూ అలా మెల్లిమెల్లిగా మాట్లాడారేమి ? పైగా భయపడ్డట్టు వూరుకున్నారేమి ?

సాలీలరేవు నీళ్లపల్లం కుడిపక్క సగం దారిలో సుమారు పదిగజాల దూరాన, జమిలిగా దగ్గిర దగ్గిర మర్రిచెట్టూ రావిచెట్టూ వొకదాన్ని వొకటి వొరుసుకుంటూ వున్నాయి. చెట్లురెండూ సగానికే వున్నట్టు గుబురు గుబురుగా వున్నాయి. చెట్ల నిండా లేతాకులు దట్టంగా వున్నాయి. నీలాటిరేవు దారిలో మర్రిచెట్టూ, రావిచెట్టూ కలిపి పెళ్లిచేస్తే కన్యాదానం చేసినంతఫలం వుంటుంది. హిందువుల ఈ నమ్మకానికి నిదర్శనం అనేకచోట్ల అవుపిస్తుంది. ఆడవాళ్లిద్దరూ మాట్లాడుతూ ఆ చెట్ల మొదళ్ల కేసి రెండు మూడు సార్లు చూశారు.

మాట ఎంతదూరం వెళ్లిందో? దొంగ, చీకటి రాత్రిళ్లు చాలా జాగ్రత్తగా కన్నంవేస్తాడు. అయితే జైల్లో ఇంతమంది ఖైదీలు ఎక్కణ్ణుంచి వస్తున్నారు? బుద్ధి మంతులయిన గూఢచారులకళ్లల్లో దుమ్ముకొట్టడం సామాన్యమయిన విషయంకాదు. కాగా చెట్ల మొదట వున్నదాంతో వీళ్ల మాటలికి ఏదో సంబంధం వుంది. నిజం. మా అనుమానం అక్షరాలా నిజం.

నూలు పోగు కొస చేతికి చిక్కితే, తెలివైన సేనాపతి పిడికెడునూలు చిక్కు లోంచి పైకి లాగేస్తాడు. మేమూ అలాగే తెలివయిన వాళ్లమని తెలుసుకోండి. చెట్లచాటుని ఇద్దరు స్త్రీలు కూచుని ఏదో మాట్లాడుకుంటున్నారు. బా—వుం—ది ! వీళ్లని మేం బాగా ఎరుగుదుం. వేళకానివేళ, చోటుకాని చోటు — ఇద్దరూ

ఏమిటి మాట్లాడుతున్నారో? వీళ్ల కలయిక కూడా చిత్రమే. ఒకామె దుర్మార్గానికి పెట్టింది పేరు; సృగాలం. రెండో ఆమె సరిగ్గా దానికి వ్యతిరేకం — చాలా అమాయకమైన గొర్రె.

ఇద్దరిలోనూ వొకామె ముక్కులో నిమ్మగుత్తి ఎగరవేస్తూ, అడపాము పడగెత్తి జాగ్రత్తగా అవలోకించినట్టు, నాలుగు దిక్కులూ పరికిస్తూ అనర్గళంగా ఉపన్యాసం వెళ్లబోసేస్తోంది. రెండో ఆమె దగ్గిర కింద నీళ్లకడవ వుంది. కుడిచేతి పిడికిట్లో పలుదోం పుల్లవుంది. ముసుగు నుదురు కప్పేసివుంది. ఒక ఉత్కృట మయిన శబ్దం వింటే గొర్రె ఎలా ఆ శబ్దం వచ్చినదిక్కే చూస్తూ వుండిపోతుందో, అదిగో అలా చకితురాలై ఎదటామెని చూస్తూ వుందామె. శుకుడు చెపుతూవుంటే, సావధానంగా, నిర్మలహృదయంతో, స్థిరబుద్ధితో వింటూన్న పరీక్షిన్మహారాజులాగ ఆమె చూపుతూవున్న వాక్యసరళి ఆలిస్తూవుంది.

అయితే ఆ వింటూన్నవన్నీ ఆమె బుర్రలో స్థిరంగా వుంటున్నాయో, ఈ చెవిలో దూరి ఆ చెవిలోంచి బైటకిపోతున్నాయో చెప్పడం మాత్రం కష్టం.

తప్పకండా వాళ్లమాటలు వినాలని అనుకుంటున్నారు మీరు. సందేహంలేదు. వెనకటికి వొక తాగుబోతు చెప్పాడు:

"సంసార విషవృక్షస్య మద్యమాంసామృతఫలం" అని. అంటే సంసారమనే విషవృక్షానికి మద్యమూ, మాంసమూ — ఈ రెండు అమృతఫలాలు పండాయి. ఇది విని ముసిలి మనువు ఏమన్నాడో తెలుసా?

"నమాంసభక్షణే దోషే నమద్యే —
ప్రవృత్తిరేషా భూతానాం—" అని.

అనగా భూతాలుకాని, భూతాలవంటి మానవులు కాని ఇలాంటి మాటలు చెపుతారు. నిజమే "వృద్ధస్య వచనం గ్రాహ్యం." కాని సంసారమనే విషవృక్షంలో రెండు విషఫలాలూ పండి వున్నాయి. ఈ మాట మాత్రం అక్షరాలా నిజం. అయితే పోల్చిన వాడెవడు? కేవలం మాకు మాత్రం ఆరెండు ఫలాలు తెలుసు.

పరోపకారాయస్వర్గాయ. పరులికి ఉపకారం చెయ్యడమే మా వ్రతం. మీ అందరి ఉపకారం నిమిత్తం ఆ రెండు పళ్లపేళ్లూ వెల్లడి చేస్తున్నాము. ఒక పండుపేరు మెల్లి మెల్లిగా మాట్లాడడం. రెండో దానిపేరు పరుల్ని నిందించడం.

మీరు ఎవళ్ల ఇంటివయినా రహస్యాలూ, ఛిద్రాలూ చెప్పండి, లేదా ఎవర్నయినా నిందిస్తూ మాట్లాడండి. చూద్దురు కాని, లోకులు ఎంత ఆప్యాయంగా

వింటారో అవి. తెలిసిందా అండి! ఫలమహాత్మ్యం కాకపోతే దానివల్ల ఇంత ఆనందం వుంటుందా ?

ఏదో రాయాలని ప్రారంభించి ఏదో రాసేస్తున్నాం మేం. వరద ముమ్మరంగా వున్నప్పుడు, నీటివేగం పడవని లక్ష్యస్థానం తప్పించి ఎటోలాక్కుపోతుంది. అయితే దిట్టమయిన పడవవాడు చుక్కాని మాత్రం వొదిలిపెట్టడు. మా కలం అటూ ఇటూ పరిగెడుతోంది నిజమే. కాని అసలుకథ సడిలిపోదు. తిన్నగా దారిలో నడుస్తూనే వుంటుంది.

అదలా వుండనివ్వండి. మిమ్మల్ని సందేహంలో వుంచడం న్యాయంకాదు. ఆ ఇద్దరు స్త్రీలూ ఎవరో, వాళ్లు ఏమిటిమాట్లాడుతున్నారో విప్పిచెప్పెయ్యడం ధర్మం. కొంత కొంత మంది ఏదన్నా మాట చెప్పేముందు. ఉపోద్ఘాతాలూ, ఉపన్యాసాలూ ఆరంభిస్తారు. మా స్వభావం మాత్రం దీనికి వుల్టా. చెప్పవలసిన నాలుగు ముక్కలూ, స్పష్టంగా చప్పున చెప్పేస్తాం. ఇంకా అనేకమంది భయపడి అనేక విషయాలు దాచేస్తారు. లేదా వొకటి చెప్పబోయి ఏదో వొకటి చెప్పేస్తారు. ఇదిగో చూడండీ, వయస్సు మళ్లిన ఆ ఇద్దరు ఆడవాళ్లూ, సాంకేతికంగా ఏదో మాట్లాడుతూ చప్పున వూరుకుండి పోయారు. అయితే ఆ సాలి ఆడంగులకంటే మా సాహసం హెచ్చు. వీరుల్లాగ అన్నీ చెప్పేస్తాం.

మరోమాట ఏమిటో తెలుసా ? మాలాంటివాళ్లు కేకలువేసి అరిచినా వినే వాళ్ళుండరు. కాని ఎవరయినా ముఖ్యమైనవ్యక్తి "ఆఁ" అనేస్తే చాలు, చూడ్దురు కాని, రెండువందలనుండి ఆయన నోటికేసి చూస్తూ వుండిపోతారు. ప్రధాన వ్యక్తుల మాటలు వినడానికని జనం మొల్లో డబ్బులు దోపుకు బరిగెడతారు.

చెట్లకింద స్త్రీలిద్దరూ వూళ్లోని సుప్రసిద్ధులు. మీరూ వీళ్లని బాగా ఎరుగుదురు. మనుషులు రూపం వల్ల కాదు — గుణంవల్ల పరిచితు లవుతారు. మంచికానివ్వండీ, చెడ్డకానివ్వండీ — సామాన్యపరిమితి దాటి ఎవరి గుణం ఎంత హెచ్చయితే వారు అంత సుప్రసిద్ధు లవుతారు.

గోవిందపురం గ్రామంలో ఎందరో ఆడవాళ్లున్నారు. వాళ్లందరిలోనూ ఈ ఇద్దరూ ఎంపికయినవాళ్లు. ఒకామె చాతుర్యానికీ, దొంగురాశితనానికిన్నీ, రెండో ఆమె సరళత్వానికీ, అమాయకత్వానికిన్నీ. ఇద్దరూ సుప్రసిద్ధులయిన స్త్రీలు. పైగా రహస్యం మాట్లాడుతున్నారు. అదేదో వినకుండా మీరు వదిలిపెడతారా? అందుకనే రాయాలని కూచున్నాం మేం.

ఎంతో పరిశ్రమచేసి, ఎంతో ప్రయత్నంచేసి వాళ్ల మాటలు సంగ్రహించాం. అవన్నీ వినడానికి మీరు ఇష్టపడరు. పాడవాటిమాటలు రాయడం మాకూ అల వాటు లేదు. అందుకని వాళ్ల సంభాషణలోని సారాంశం రాస్తున్నాం.

"చూడూ శారియా, మంగళా అమ్మవారే అన్నిటికీ మూలాధారం. అమ్మ వారిమాటమీదే ప్రపంచం నడుస్తోంది. సంసారం సాగుతోంది. అమ్మవారి వరం మరోలా అవుతుందా? ఎన్ని నోములు నోచి దేవి వరం సంపాదించారు మీరు! మీదే భాగ్యమంటే. ఇంతభాగ్యం కనీ వినీ ఎరగం, నమ్ము. ఒక్క మంగరాజు గారి ఇంటి మీద అమ్మవారి అనుగ్రహం వుండేది. ఇప్పుడు మీ మీద కలిగింది. మీరు మంగళా అమ్మవారి మందిరం కట్టించెయ్యండి. చూద్దురుగాని, మీ ఇల్లు లక్ష్మీభాండారం అయిపోతుంది. వందలు వందలు, వేలువేలు రూపాయలు ఎక్కడి నుంచోవచ్చి ఇంట్లో కుప్పలు పడిపోతాయి. ధాన్యం గదులు వరసలు వరసలు లేచి పోతాయి. నీ భగవాన్లు మగ్గం పెడతాడా మళ్లీ! మీ వెంట పదిమంది దాసీలు తిరుగుతారు. మీరు అమ్మవారిమాట వినకోండి. ఎలాఅయినా గుడికట్టించెయ్యండి.

రూపాయలకోసం విచారించకండి. అమ్మవారిపేరు వింటే రూపాయలు ఇవ్వనివాళ్లెవరంట! ఎక్కడో వెదకడ మెందుకూ, మంగరాజుగారి చెవిలోపడితే అర్ధరాత్రపుడు రూపాయలు చేతిలో పోస్తారు. దానికి నాదీపూచీ. నేను రూపా యలు తెచ్చిస్తాను. మీరేమీ చెయ్యనక్కర లేదు.

ఎన్నోరూపాయ లక్కరలేదు. నూటాయాభై రూపాయలయితే చాలు. మంచిదివ్యమయిన గుడితయారై పోతుంది. కేంద్రాపడాలో బలదేవస్వామి గుడిలేదూ, అదిగో సరిగ్గా అంతపొడవూ, అంత కై వారమూ తయారవుతుంది. మీ అరెకరాల ఎనిమిది కుంటలు పొలం తనఖారాసేస్తారు మీరు. నేను రూపాయలు తెచ్చి ఇస్తాను. మీ పొలం ఎవరూ పట్టుకుపోరు కదా! ఎక్కడి పొలం అక్కడే వుంటుంది. ఉత్తి కాయితం మాత్రం రాయడం జరుగుతుంది. గుడి తయారై పోయాక మీరే ఎన్ని రూపాయలో ఎంతమందికో ఇస్తారు. మంగళా అమ్మతల్లి తప్పక ఏదైనా సంకేతం ఇస్తుంది. అవాళ సంకేతంలాగ వొక బంగారం రూపాయ ఇస్తుంది. అమ్మవారు వెండి రూపాయలిస్తుందామరి! ఊఁ ఊఁ."

ఉపన్యాసకురాలి హితోపదేశమంతా శారియా మనస్సుకి పట్టించుకుందం టారా? ఏమో, అది మాకు నమ్మకం లేదు. మిటుకూ మిటుకూ చూస్తూ వుందామె. ధోసెడన్ని రూపాయలు! వందన్నర రూపాయలంటే అర్థం చేసుకోడం ఆమె బుద్ధికి

మించిన పని. ఒక రూపాయ చిల్లర లెక్కపెట్ట వలసి వస్తే శారియా వీధిలోకి వచ్చేది కాదు. తానూ, భగియా - ఇద్దరూ తలుపు గడియ బిగించేసి, రెండుమూడు గంటలు లెక్కపెట్టేక, సరిగ్గా వుందని నిశ్చయించే వాళ్లు. రూపాయపావలా లేదా రూపాయబేడా బట్టలు అమ్మిననాడు, ఆమె తమ్ముడు లోకనాథం దగ్గిరికి వెళ్లి లెక్కపెట్టించుకుని వచ్చేదామె. అలాంటి ఆమె ఇంట్లో పదిమంది దాసీలు ప్రవేశిస్తారంటే, అది మంచో చెడ్డో! గట్టిచిక్కే! భగవానులూ దగ్గిరలేడు! ఏమిటి సాధనం! అక్కడి నించి వెళ్లిపోతే బతికిపోనామె.

శారియా పెద్ద నిట్టూర్పు వదిలింది. తన నీళ్లకడవదిక్కు చూసి, —"చంపా అమ్మగారూ, —" అంది. అంతే ఆనేసి వూరుకుంది. మరోమాట అనలేక పోయింది. కాని కొంపలుతీసిన దుంప, జగజంత చంపా. ఆమెకి అంతా అవగతమై పోయింది. పిట్ట చేతిలోంచి ఎగిరిపోవాలని రెక్కలు రెపరెపలాడిస్తోంది. ఎన్నాళ్లయో కాని కాని, పిల్లి నవడచేప పట్టింది. దాని పంజాలోంచి తప్పించుకోడం అంత మీద మీద వుందా?

మంత్రం మల్లించాలి.

చంపా: చూడూ శారియా, రూపాయల్లో ఏముంది? రూపాయలూ బంగారమూ పట్టుకుని ఎవ్వరూ స్వర్గానికి వెళ్లరు. ముఖ్యమైంది పిల్లా జల్లానూ. పిల్లలు లేని ఇల్లు పట్టపగలే చీకటి. గొడ్రాలు అయివుండడం ఎంతపాపం! మంగరాజుగారి ఇంట రోజూ పురాణం జరుగుతుంది. నేను వింటాను. ఆవాళ బ్రాహ్మడు పురాణంలో చదివాడు:

పిల్లలు లేని వాళ్ల మొహం·  
ఉదయం చూడరాదు నిజం.  
ముగ్గురు పిల్లల తల్లి లక్షణవంతురాలు.  
గొడ్రాలు పరమ పాపాత్మురాలు.  
కొడుకులూ కూతుళ్లూలేని ఇంటా  
తడి ఆరదుసుమా ఇల్లాలికంట.

భాగవతం అబద్ద మంటావా? ఊరికే భాగవతపీఠానికి జనం మొక్కుతున్నారా మరి! ఇంకో మాట చూడూ, ఉదయాన్నే ఎవరైనా మీ గుమ్మంముందు నించి వెళతారూ? ఎంచేత? మీ మొహం చూడకూడదని. మీరంతా వినేవుంటారు, మొదట మా అమ్మగారు గొడ్రాలుగా వుండేది. ఉదయం ఝాం పొద్దెక్కేదాకా

మేం ఎవళ్లమూ ఆవిడ మొహం చూసేనాళ్లం కాదు. ఆవిడ కంటికీ మంటికీ ఏక ధారగా ఏడుస్తూ మంగళా అమ్మతల్లిని పూజించింది. ఇప్పుడు దేవికి మీ మీద దయకలిగి నట్టే, ఆవిడ మీద దయకలిగింది. ఇప్పుడు చూడూ, మనమలూ, మనమ రాళ్లూ, ఓ, ఇంటిల్లిపాదీ పిల్లలు.

శారియా చూస్తూనే కలలు కంటున్నాది. వింటూన్న మాటలతో చెవులు హోరెత్తిపోతున్నాయి. వెళ్లిపోదామనుకుంటోంది. వల్లకాకండా వుంది. ఎలక పీక దబాయించి పట్టుకుంది పిల్లి. రెండు కళ్లల్లోనూ నీళ్లు తిరుగుతున్నాయి. మాట్లాడదా మనుకుంటుంది. నోరు పెగల్దు. ఎంతో కష్టం మీద నోరు విప్పింది శారియా.

శారియా : నేనేం చేసేది ? లోకులంటున్నారు, మంగరాజుగారు పొలం తాకట్టు రాసుకుంటే మళ్లీ ఇవ్వరట !

చంపా : రామ ! రామ ! ఎంతమాటన్నావూ ! అమ్మవారి కార్యానికి రూపాయలిచ్చి, మీ పొలం తీసేసుకుంటారా ? ఊళ్లోవాళ్ల మాటలు ఎందుకు వింటావు నువ్వు ! ఈ గోవిందపురం పూరుందే, ఇలాంటిది లోకంమీద ఎక్కడా వుండదు. ఈ వూరి అమ్మలక్కలు పట్టపగలే చుక్కలు పుట్టిస్తారు. మీ సౌఖ్యం చూస్తే వాళ్ల కళ్లు కుడతాయి. ఈ వూళ్లో తోటాకు తిన్నవాణ్ణి గెంజి తాగేవాడు చూడలేదు. మీరు ఎవ్వరిదగ్గిరా ఏమీ చెప్పకండి.

ఇంకో మాట చూడూ ఆమ్మతల్లి మాట వినకపోతే చెవులు వినపడవు. కళ్లు పేలిపోతాయి. మనుషులు చచ్చిపోతారు. గోపినాథపురంలో ముగ్గురు స్త్రీలు అమ్మవారిమాట వినక వొక్కసారి ముండ మోసేశారు. మీరు మాత్రం ఈ మాట వినలేదూ !

ఇంతవరకూ శారియా కదలకండా కర్రబొమ్మలా వింటూ కూచుంది. చివరి మాట విని భరించలేకపోయింది. ఏడ్చేసింది. వెక్కుతూ వెక్కుతూ అంది : "నేనేం చేసేది ? చంపా అమ్మగారూ, నేనేం చేసేది ? "

సుప్పనాతి చంపా. ఈసారి శారియా మనస్సులోని మాట గ్రహించేసింది. మంత్రం పారుతోంది. చంపా లోలోపల సంతోషిస్తూ అంది :

"చూడూ, శారియా, మీకు వచ్చే భయమేమీలేదు. మీరేమీ చెయ్యనవసరం లేదు. నేనే అన్నీ చేసేస్తాను."

శారియా : ఊం ఊం, నాకేమీ అక్కరలేదు. ఆయన చల్లగా వుండనీ.

చంపా : మరేమీ భయంలేదు. భగవానులు వొంటి మీద ఈగన్నా వాలదు

దదివామనస్వామి పూలదండా, వొకరసుకోరా మహాప్రసాదమూ శారియా చేతిలో పెట్టింది చంపా.

చంపా : చూడూ శారియా, ఈదండా, ఈమహాప్రసాదమూ సాక్షి. మీకు అంతా నేను మంచే చేసిపెడతాను. మీకు ముగ్గురు కొడుకులు పుడతారు. భగవాన్లుకి కోటి పరమాయువు వస్తుంది. మరేమీ విచారించకు.

శారియా : నేనేం చేసేది? చంపా అమ్మగారూ, నేనేం చేసేది?

చంపా : మీరేమీ చెయ్యనక్కరలేదు. ఇవాళ సాయంత్రం భగవాన్లూ నువ్వూ ఇక్కడికి రండి. ఏంచెయ్యాలో అది నేను చేసేస్తాను. మంగళా అమ్మవారి నోము పడితే, అమ్మవారి కార్యం ముగిసే దాకా, ఇద్దరూ స్నానాలుచేసి ఉపవాస ముండాలి. కేవలం ఓడికడేసి అటుకుల్లు తినండి. నోమంటే మీకు తెలీదు. అందు కని చెపుతున్నాను.

ఈహితోపదేశమయాక శారియా మెల్లి మెల్లిగా దీఘిలోకి స్నానానికి వెళ్లింది. చంపా ఎంతోసేపు చెట్టుకింద నుంచుంది. నాలుగు దిక్కూలా చూసి, తృప్తిపడ్డ మనస్సుతో మంగరాజు గారి లోగిలి దిక్కు వెళ్లిపోయింది.

సి ఐ డి పనిచేసి మేంభోగట్టా సంపాదించాం. అవాళ అర్ధరాత్రి దాకా శారియా మంగరాజుగారి లోపల లోగిల్లోవుంది. భగవాన్లు కచేరీ చావిడిలో వున్నాడు. అమర్నాటినించీ నాలుగు రోజులు దాకా భగియాని వూళ్లో ఎవరూ చూడలేదు. కటకం వెళ్లేదారిలో అతణ్ణి చూశామని ఎవరో చెప్పారు.

# 14

## మంత్రణ

హుక్కే — హుక్కే — హూ.

హుక్కే — హుక్కే — హూ.

హుక్కే — హూ.

నక్కలు కూస్తున్నాయి. సరిగ్గా అర్ధరాత్రి. పల్లెటూళ్లో గడియారాలూ గట్రా లేవు. నక్కల వూల విని రాత్రివేళ నిశ్చయించాం. ఈజంతువులు గ్రామానికి ఎంతో ఉపకారం చేస్తాయి. చిన్న చిన్న గ్రామాలో మున్సిపలు కమీషనర్లు లేరు. గ్రామంలో

చచ్చిన కుక్కో, చచ్చిన ఎలకో, చచ్చిన పిల్లో—లేదా చెత్తో చెదారమో తీసేసే పని వీటి మీద వుంటుంది.

అర్ధరాత్రి గోవిందపురం గ్రామం నిశ్శబ్దంగావుంది. కుయ్యీ—కయ్యీ శబ్దం లేదు. తెలకల వీధిలో వోపక్కమీద పిల్లాడు అఁ అఁ అఁఁ—అనిఏడుస్తున్నాడు. వాళ్ల అమ్మ నిద్రమత్తులోనే వాణ్ణి జోకొట్టింది. మంచిమంచి విలువయిన వస్తువులు ఇస్తానని బుదిరించింది. దొంగలూ, చాకీదారూ, పులీ మొదలయిన భయంకర జీవుల పేరు చెప్పి భయపెట్టింది. అబ్బాయి మంచివాడు, ఏడవడు, వూరుకుంటాడు, నిద్ర పోతాడు—ఇలా ప్రశంసవాక్యాలు చెప్పింది. ఎలాఅయితేనేం చివరికి పిల్లాణ్ణి పడుకో బెట్టేసింది.

మంగరాజుగారి కచేరీవాకట్లో మనగోబరా జెనా, గౌతుణియాగ్రామం చౌకీదారు దాసజెనా—ఇద్దరూ నిలువుడెత్తు వెదురుదుడ్లు రెండూ, బారిడేసి అగ్గిబెంట్లూ దగ్గిర పెట్టుకుని నిశ్చింతగా నిద్రపోతున్నారు. మంగరాజుగారి కచేరీ చావిడిలో రెండు ఊరపందులు మేస్తున్నాయేమో అనుకుంటారు పైవాళ్లు. మేం సర్వకాలాల్లోనూ సర్వవిషయాల్లోనూ సావధానంగా వుంటాం. అన్నిసంగతులూ పరిశీలించి తెలుసుకుంటాం. అయినా ప్రథమంలో మాకూ భ్రమకలిగింది. కాని బాగా చెవులొగ్గి వినడంతోనే చాకీదార్ల ఇద్దరి టోకుర్లూ ఈభ్రమకి కారణమని గ్రహించేశాం. కచేరీబయట అరుగుమీద ముగ్గురు రైతులు పటాపట్ పటాపట్ బాదుకుంటూ దొర్లుతున్నారు. అకలీ, చింతా,దోమలూ — వీటికీ నిద్రకీ సవతిపోరు. రైతులు ముగ్గురు బాకీధాన్యం ఇవ్వలేదని కదలడానికి వల్లకాక వుండిపోయారు. రోజు రోజంతా నోట్లోకి పచ్చి మంచినీళ్లయినా వెళ్లలేదు. దాని మీద దోమలు. పైగా చింత. మరి నిద్రమాట అడిగే దేముంది?

కచేరీ చావిడి దాటి లోపలికి వెళ్తే, వరసఇంట్లో మంగరాజుగారి పడకగది. అవసరం వచ్చినప్పుడు దానిని సామానుగది అనీ అనేవాళ్లు లోకులు. లోగిలిఅంతటికీ ఇది శ్రేష్ఠమైంది. అది సబబే కూడాన్ను. ఆ విషయంలో పొరపాటు జరగలేదు. ఇల్లు అటకవేసిన మిద్దె. అయిదు ఊద్దీలు (పట్టెలు) వేసి కట్టిన ఇల్లు. తూర్పుద్వారం దగ్గిర విశాలమయిన అరుగుంది. గుమ్మానికి పనస చెక్కల రెక్క తలుపు లున్నాయి. తలుపులికి గళ్లు గళ్లుగా బద్దలు తాపివున్నాయి. గళ్లలో గుబ్బమేకులు కొట్టి వున్నాయి. బైటికి గొలుసూ, గుండీలువున్నాయి. నాగవాసానికి పెద్ద పెద్ద గొట్టపు తాళపుకప్పలు వేలాడుతున్నాయి. ఇంటి పడమటిగోడకి మొల ఎత్తుని ఇనపగజాల కిటికీ వొకటి వుంది. ఒక అడుగు వెడల్పు వుంటుందది.

మార్గశిరమాసం లక్ష్మీవారాల్లో ఇల్లు అలికేటప్పుడు మాత్రం బహుశా ఆ కిటికీ విడేది. గది నాలుగుమూలలా చిమ్మచీకటి. మీలాంటి వారికీ మాలాంటి వారికీ పట్టపగలే దీపం కావాలి. గది మూలల్లో బొద్దెంక మేమంటే, ఎలకలు మే మంటాయి. వర్ణసాదృశ్యంబట్టి అనండి, లేదా పేరునిబట్టి అనండి బొద్దెంకలు లక్ష్మీదేవి పురుగులు. లక్ష్మీదేవి పురుగులు లక్ష్మీకరమంటుంది చంపా. ఇంట్లో లక్ష్మీదేవి పురుగులుంటే లక్ష్మివస్తుంది. [ఒడియా భాషలో బొద్దెంకలని అసర్పి అంటారు.] అసర్పులు వుంటే అసర్పులు (మొహర్లు) వస్తాయి. అంచేత ఈ బొద్దెంకల వంశం నిరాటంకంగా పుత్రపౌత్రాదిక్రమంగా ఇంటి మూలలు ఆక్రమించుకుని వున్నాయి.

గదిలో ఉత్తరదిక్కు గోడని అనుకుని పొడవాటి వెదురుగడమంచీ వుంది. దానిమీద మూడు పాతబెత్తంపెట్లు పెద్దవి వున్నాయి. గడమంచీకింద కర్రతక్త వుంది. కింద వొకమూల బెల్లం కుండలూ, మామిడి వొరుగు బానలూ, కాగునూనె డబ్బాలు రెండుమూడు పుంజీలూ వున్నాయి. చుట్టుపట్ల గ్రామాల్లోంచి కాగు పిక్కలు దులిపి తెచ్చేవాళ్లు. శెట్టీగా తెలకలి గానుగాడించి ఇచ్చేవాడు. ఆ నూనె యావత్తూ ఈ కొట్టు గదిలో జాగ్రత్త చేసేవాళ్లు. ఏడాది పొడుగునా నూనె కొనడం పడేది కాదు; మిగిలిపోయేది.

దక్షిణం దిక్కు గోడదగ్గిర మామిడి చెక్కలతో చేసిన పెద్దపెద్ద సందూకా పెట్టెలు రెండు వున్నాయి. వాటికి చేరువగా వొక గుగ్గిలం చెక్కల సందూకా పెట్టె వుంది. ఇది లక్ష్మీదేవి పెట్టె. ప్రతీ దినం చంపా సంజదీపం చూపేది దీనికి. ప్రతీ లక్ష్మీవారం గంధం చల్లి పూజచేసేవారు దాన్ని. ఇన్ని పచ్చిబియ్యమూ, ఇంత బెల్లప్పిసరా నైవేద్యం పెట్టేవాళ్లు.

దూలాలికి తగిలించిన ఉట్టెల్లో మూడు నాలుగు నేతి బుంగలు వేలాడుతున్నాయి. మందనించి, పేరుకున్న నెయ్యి వచ్చి వాటిల్లో నిలవ వుండేది. ఉట్టెల్నీ దూలాల్నీ కరుదూపం నిండిన సాలిపట్లు నల్లటి జాలర్లులాగ వేలాడుతున్నాయి.

పడమటి గోడచేరువగా ఉత్తర దక్షిణంగా వేసిన మంగరాజు గారి తక్త వుంది. దక్షిణం దిక్కు తలకేసి పెద్ద దిండు వుంది. తక్త మీద తుంగతో నేసిన దట్టమయిన చాపా,* దానిమీద ముదాకటిది వొక దుప్పటి పరిచి వున్నాయి.

---

* దీన్ని హోంసా అంటారు. తుంగ ఎండబెట్టి, సన్నని నులక తాళ్లతో పెనవేసి తయారు చేస్తారిది.

దుప్పటిచూస్తే బుటాలు అద్దిన చీటీగుడ్డ అని చప్పున భ్రమకలగ వచ్చు. కాని మేము బాగా పరిశీలించి చూశాం. అవన్నీ మరణించిన నల్లుల రక్తం మరకలు.

ఇవాళ ఈ నిశిరాత్రప్పుడు ఆ తక్తు మీద వొక పురుషుడూ, కింద వొక స్త్రీ కూచుని గాఢమైన సంభాషణలో మగ్నులై వున్నారు. పాఠకులికి వేరే పరిచయం చెయ్య నక్కరలేదు వాళ్లని. ఈ పురుషుడు మంగరాజుగారు. స్త్రీ చంపా.

చంపా తక్తుమీద రెండు చేతులూవేసి దబాయించుకు కూచుని వుంది. మంగరాజుగారు ఆమెకేసి కొంచెం వంగివున్నారు. తక్తుకి మూడు మూరల దూరాన్ని ఇత్తడి దీపం సెమ్మె వుంది. దానిమీద మట్టి పెమ్మెద మినుకూ మినుకూ వెలుగుతోంది. దీపంసెమ్మె ఆపాదమస్తకం నూనె జిడ్డుతో నిండి వుంది. సెమ్మెకింద మట్టులో వొత్తుల నుసికలిసిన నల్లటినూనె గిద్దెడన్నా వుంటుంది.

చంపా మంగరాజుగార్లు ఎంతో రాత్రిదాకా ఏమేమిటి మాట్లాడారో, ఏమేమి మంత్రాంగం సాగించారో అవన్నీ వినడానికి మీరు ఇష్టపడరు. మేము కూడా అధికం సాగదీసి రాయడం అలవాటు లేని వాళ్లం. పైగా ఈ మాటలన్నీ నిజమే అనండీ, పిట్టకథలే అనండీ, నవలే అనండీ, నాటకమే అనండీ — ఇందులోని ప్రధాన నాయికా నాయకుల మాటలు విడిచిపెట్టేస్తే కథసాగదు. అంచేత గాదిలో గింజలు గాదిలో వుండాలి, పిల్లలు గారకాయల్లాగ వుండాలి, అన్నట్టు చెయ్యవలసి వచ్చింది.

చంపా అంది:

"తల్లెవరో తెలీదు, తండ్రెవరో తెలీదు. దగాబాజీ చేసి తురక గుంటడి దగ్గిర జమీందారీ చపాయించి జమీందా రనిపించు కుంటున్నాడు. జమీందారయితే అయాడు — వాడింటికి వాడు జమీందారు. సొమ్ములు వదిలేసి, పంటపాడుచేసేసి, పయిగా అంటే తిడతాడూ? పారిపోయి ఆడాళ్ల మధ్య దాక్కున్నాడు. చేతికి దొరికితేనా? — విన్నారా, వొకడు కాదు, ఇద్దరు కాదు — వూరివూరంతా మూగివున్నారు. దుకాణం అరుగుమీదకూచుని, పెద్దగొంతుకతో అలా తిడుతూ వుండేవాడు వాడు. నేను మరేం కిల్లీలు కొంటూను! వాడి జిమ్మ పడిపోను. వాడి పెళ్లాం ముండమొయ్య! వాణ్ణి గొట్టాలమ్మ పట్టుక పోనూ! అయ్యగారూ, నేను అలా ఇలా వదిలిపెట్టే మనిషినా? ఇంకెవరో అయితేనా? వాడి ముక్కు కరిచేసే దాన్ని. కాని మనిషి రాకాసిలా వున్నాడు. వాడి వెదురు దుడ్డుచూసి, నా కలేజా

నీరై పోయింది. మీరు దీనికేదో మార్గం చూడండి. లేకపోతే నాతల బద్దలు కొట్టేసు కుంటాను. నాభి తిని చచ్చిపోతాను. నీళ్లలో మునిగి చస్తాను."

ఇలా అంటూ బెక్కుతూ ఏడవడం మొదలు పెట్టింది చంపా.

మంగరాజు :

"ఊరుకో చంపా వూరుకో. అదిగో ఆ దుడ్డు కర్రంటేనే నాకు దడ. నలుగు రికి నలుగురూ భూతాల్లాగ వోళిమూర్తులు. చీటికీ మాటికీ దుడ్డుకర్ర పట్టుకు కూచుం టారు. ఎన్నాళ్ల కిందటో ఇది వదల గొట్టేసి వుండేవాణ్ణి. మన వూళ్లోంచి చిన్న పిల్లిపిల్ల వాళ్ల వూళ్లోకి వెళితే చాలు, కనిపెట్టుకు కూచుంటారు. గోబరాగాడు ఇంత చలాకీ అయిన వాడా, ఇంత హుషారయినవాడా, వాడి చేతో ఏమీ అయింది కాదు. పాపం వాడు మాత్రం ఏం చేస్తాడు? రాత్రింబగళ్లు మనుషులు కాపలా."

చంపా : ఊఁ ఊఁ, కాదు. అలా కాదు. అదంతా పనికిరాదు. మీరేదన్నా వొక మార్గం ఆలోచించండి. లేకపోతే నేను వూళ్లో ఆడాళ్లముందు మొహం చూపించలేను. వాళ్లే అంత మోతుబర్లా? మిమ్మల్ని మించిపోతారా?

మంగరాజు : చూడూ చంపా, శాస్త్రంలో ఏముందంటే "బుద్ధిబలమో, చేతిబలమో ఉపయోగించి శత్రువుని సాధించాలి." నేనేమో చాలలేక పోయాను. నువ్వే ఇక ఏమయినా ఉపాయం వెదకాలి. చూశావా, నేను మూడేళ్లు ప్రయత్నిం చినా ఆ సాలివాణ్ణి సాధించలేకపోయాను. నువ్వు ఎలా వూనుకున్నావో అలా పనై పోయింది.

చంపా పెమ్మొదలో వొత్తి కొంచెం ఎత్తేసి, బాగా వొక నవ్వు నవ్వింది. తరవాత అంది :

"మొదట సాధించలేనే అనుకున్నాను. బుద్ధి ఖర్చుపెడితే సాగకెటు పోతుంది? ఆ ఆరెకరాల ఎనిమిదికుంటలు పొలానికి రేపు ఏరు వెళుతుంది కదా!"

మంగరాజు : పాలేర్లకి చెప్పేశాను. ఉదయాన్నే ఏర్లు వూస్తారు. తొలి దుక్కీ మారుదుక్కీ పూర్తయిపోతుంది. నేనూ పొలానికి వెళతాను.

చంపా : వాళ్ల ఇల్లు పడగొట్టేసి, మంచిపని చేశారు. ఇల్లుంటే ఎప్పుడైనా పొలంకోసం దాన్ని వినియోగిస్తారు.

మంగరాజు : పొలం ఆరుమాసాల దండనష్టరతు గడువూ దాటి పోవడం తోనే పొలం మనదై పోయింది. దావాఖర్చులుకోసం ఇల్లు వేలంవేశారు. వేలంలో నేనే ఇల్లు కొనేశాను. కొనేసి ఇల్లు పడ గొట్టేశాను.

చంపా: పొలమనండీ, ఇల్లనండీ — ఆ అప్పుకోసం నేను ఇంతపనీ చేశాను. అయ్యగారూ, అది అప్పు కాదు, గున్న ఏనుగు. ఇవాళ కచేరీ గడపని కట్టేసి వచ్చాను. రేపటినించి లోగిల్లో కడతాను వాళ్ళిద్దరూ ఎటు పోయార్టా?

మంగరాజు: ఏ ఇద్దరూ? భగియా, శారియాలా? ఏముందీ, పనిలేని దాసరి లాగ ఆ పంచా ఈ పంచా తిరుగుతున్నారు.

చంపా: ఇవాళ పొద్దున్న శారియా మంగళా అమ్మగారి దగ్గిర నెత్తి బాదుకుంటూ ఏడుస్తోంది. నన్నుచూసి మరింత రాగాలు తీసింది. ఏదో చెప్పాలని నాదగ్గిరికి రాబోయింది. నేను మొహం తిప్పేసి వచ్చేశాను.

ఆ తరవాత చంపా మంగరాజుల మధ్య ఎంతో రాత్రిదాకా ఎన్నో మాటలు జరిగాయి. చివరికి ఎంత జాగ్రత్తగా, ఎంత మెల్లిగా మాట్లాడుకున్నారంటే ఎంత ప్రయత్నించినా ఆ మాటల్లోని గూడుపుఠానీ మాకు అందిందికాదు. ఒకరి మొహం ఒకరు చూస్తూ కూచున్నారు. ఇద్దరూ మాటల్లో మగ్నులై పోయారు.

ఇంతలో వాళ్ళిద్దరిమధ్యా ఒక స్త్రీ మూర్తి నీడ వచ్చి పడింది. ఇద్దరూ తుళ్ళిపడ్డట్టయి ఆ స్త్రీ మూర్తిని చూస్తూ వుండి పోయారు. చప్పున మాటలు నిలిచి పోయాయి. ఆగంతుకురాలు ఉస్సురని పెద్ద నిట్టూర్పు విడిచింది. హృదయంలో దారుణమైన కష్టం కలిగితే ఎలాంటి నిట్టూర్పు వస్తుందో అలాంటి వేడినిట్టూర్పు పది.

అందరూ నీరవంగా, నిశ్చలంగా కర్ర బొమ్మల్లాగ కదలికన్నా లేకండా వున్నారు. గదినిండా నిశ్శబ్దం.

కొద్ది క్షణాలు గడిచాయి.

ఆ స్త్రీ మూర్తిని చూస్తూ మంగరాజుగా రన్నారు:

“ఏం”

... ... ... ... ... ... ... ఎవ్వరూ మాటాడలేదు.

మళ్లీ మంగరాజుగా రడిగారు:

“ఏం?”

జవాబులేదు.

మళ్లీ పెద్ద నిట్టూరుపు.

మంగరాజుగారు కొంచెం చికాకుపడుతూ వెనకటికంటే కొంచెం పెద్ద గొంతుకతో అడిగారు:

"ఏం? ఏమీ చెప్పవేం?"

ఆగంతుకురాలు మంగరాజుగారి ధర్మపత్ని. మెల్లిగా, అతి వినయంగా అందామె:

"ఎంతో రాత్రయింది. నిద్రపొండంటున్నాను. ఆ మాటలన్నీ తర్వాకండి."

చంపా నిర్లక్ష్యంగా అంది:

"హూఁ."

మంగరాజు: సరే, నేను వస్తాను. నువ్వు పైకి పద.

చంపా అన్న "హూఁ" శబ్దం మంగరాజుగారి భార్య గుండెల్లో బల్లెంలా తగిలింది. దాని మీద భర్త అన్న "నువ్వు పైకి పద" అన్నమాట నసాళాని కంటి వెయ్యి తేళ్లు వొక్కసారి పొడిచినట్టయింది.

"చంపా లోపల వుంటుందీ? నేను బైటికి వెళ్లాలీ?"

ఎలాటి సంఘటనలవల్ల పురుషుల మనస్సు విరిగిపోతుందో, అలాంటివన్నీ కోమల హృదయులయిన స్త్రీలు సహజంగా వోర్చేసుకుంటారు. పురుషులకంటే స్త్రీలకి క్షమాగుణం హెచ్చు. వాళ్లు బాగా సహించగలరు. కానైతే భర్త హీనంగా చూస్తే మాత్రం పతిత్వంకల స్త్రీ వోర్చుకోలేదు. పైగా భర్త ఎదట దాసీదిచూపిన నిరసన మరణంకంటేకష్టం. అయితే ఇది ఇవాళేకొత్త కాదు. చిర కాలం నించీ సహించి సహించి అలవాటయిపోయింది. అయినా కూడా మంగరాజు గారి భార్య కంఠం గద్గదిక పడిపోయింది. తల గిర్రున తిరిగినట్టయింది. శరీరం యావత్తూ పట్టు తప్పిపోయినట్టయింది. ఎలాగో తన్ను తాను సంబాళించుకుందామె. మెల్లి మెల్లిగా గదిలోంచి బైటికి వచ్చేసి, గడపమీద టపీమని చదికిల బడిపోయింది.

ఆ రాత్రినించి ఆమెనోట ఎవ్వరూ వొకమాట వినలేదనే విన్నాం మేం. దాచుకోవాలని ఆమె ఎంతో ప్రయత్నించింది. అయినా కూడా అగకండా ఎల్లప్పుడూ ఆమెకళ్ల నించి కన్నీళ్లు కారడం అందరకీ అవుపించేది.

చంపా దభీమని తలుపు వేసేసి వచ్చి తనస్థానంలో కూచుంది.

చంపా: ఎవళ్లయినా నన్ను తిట్టనీండి, చీపురుతో కొట్టనీండి, నొప్పని పించదు. కాని మిమల్ని వొకమాటంటే మాత్రం నాగుండెలు కోసేసినట్టవుతుంది. అమ్మగారి మాటలు విన్నారుకదా! మరొకతె అయితే మొహంచూడదంటే నమ్మండి. శారియా సంగతప్పుడు అన్నీ మీాకే అర్థమయి వుంటాయి. మీకు మళ్లీ చెప్పడ మేమిటి? ఏడాదిపాటు పాటుపడవలసి వచ్చింది. దోసిళ్ల కొద్దీ రూపాయలు

ఇంట్లోంచి వెళ్లిపోయాయి. కటకం తంతూ జరిగింది. తోటలోంచి పడిబల్లో, ఇరవై బల్లో రాళ్లు మంగాళా అమ్మవారి దగ్గర కుప్పవేయించారు. చివర అమ్మగారంటారు కదా, 'శారియా ఛొమాణొ అఠగుంఠొ భూమీ వశిలెయ్యండి' అని. 'వాళ్ల ఇల్లు పడగొట్టకండి' అని.

ఇలా అని చంపా పకపకా నవ్వింది. ఘోరమైన ఆ నిశిరాత్రి నిశబ్దం పగిలిస్తూ ఆపైశాచిక వికటాట్ట హాసం మంగరాజు గారి భార్య చెవుల్లో పడే వుంటుంది. కాని అప్పుడు ఆ నవ్వు తాలూక దారుణత్వం గమనించే శక్తి మాత్రం ఆ ఇల్లాలికి లేదు.

మంగరాజు చంపాల మధ్య జరిగిన మాటలు ఎవ్వరికీ తెలియవు. కేవలం చంపా నోటినించి ఈమాత్ర వినిపించింది:

“మరేం లేదు, నాకు వొకడ్డోలీ, నాలుగు కావిళ్లూ ఏర్పాటు చేసెయ్యండి. చూద్దురు కాని. నేను చెయ్యలేక పోతే నాముక్కు కోసేద్దురు కాని” అని.

## 15

## బాఘసింహ వంశం

సుప్రసిద్ధుడైన అయిన్ అక్బరీ రచయిత అబుల్ ఫజాల్ “ఒడిశా దేశంలో నిజమయినభూస్వాములు ఖండాయతు లంటాడు. * నిజానికి గజపతుల దర్బారులో కత్తిపిడి మొదలుకుని గంటం మొనదాకా రాచకార్యాలు యావత్తూ వాళ్ల చేతిలోనే వుండేవి. జీతాలకోసమని రాజ కోశం లోంచి వాళ్లు నగదు పుచ్చుకునే వాళ్లు కాదు. ఒడిశాలోని హెచ్చు భాగం భూమి జాగీరీలరూపంలో వంశానుక్రమంగా వాళ్లు పంచుకుతినేవాళ్లు. ఖండాయతుల బాహుబలంవల్ల చిరకాలం ఒడిశా తన స్వాతంత్ర్యం తోను రక్షించుకుందికి సమర్థురాలయి వుండేది. మహమ్మదీయులు మూడేళ్లకంటే హెచ్చుకాలం వంగదేశంనించి పొంచి పొంచీ కూడా సువర్ణరేఖ దాటలేకపోయారు. ఖండాయత సిపాయిలు ఎల్లప్పుడూ రాజదర్బారులో వుండేవాళ్లు కాదు. దళపతులు తమ తమ స్వాధీనంలోవున్న సిపాయిలని కూర్చుకుని వొకొక్కొక్క మండలంగా వుంటూవుండేవారు. దళపతుల తాలింఖానాలు చౌపాడీ లనేవాళ్లు. అక్కడ కుస్తీపట్లూ, కత్తిసామూ, బాణవిద్యా, తుపాకులు

* ఖండాయతులు: మన తెలగా దొరలవంటివారు.

కాల్చడమూ — ఈ నాలుగువిద్యల చర్చలూ జరగడంచేత వాటిని చావాఢీ లనే వాళ్లు.

గజపతుల వంశం పతనమైపోయాక, టోడరు మల్లు పెద్ద పెద్ద చావాఢీలు కిల్లాలకింద బందోబస్తు చేశాడు. ఒడిశాలో అనేకచోట్ల ఈ పూటకీ కూడా చిన్న చిన్న చావాఢీలు నామమాత్రావశేషంగా కనిపిస్తాయి. ఆనాటి దళపతుల చేతకాని వంశీకులికి ఇప్పటికీ కొరత లేదు.

మన భాఘసింహులు ఆనాటి దళపతుల వంశంలోనివాడే. ఇంటిపేరు మల్లు. కుటుంబంలో పెద్దకొడుకు ఆనువంశికమైన భాఘసింహ బిరుదు ధరిస్తాడు. అతడే జాగీరీకి ఉత్తరాధికారి. తక్కిన తమ్ముళ్లుంటే వాళ్లకి జీవనభృతి మాత్రం లభిస్తుంది.

ఊషరక్షేత్రంలో నేపాళపుచెట్టు మహావృక్షం. భాఘసింహ వంశస్థులు చిన్న జాగీరుదార్లే అయినా పల్లెప్రాంతంలో వారిపేరు గొప్పది. రత్నపురం గ్రామంలో చావాఢీ. అది శిస్తులేని ఖండాయతీ ఇలాకా. ఇదికాక ఫతేపూరు సరషండ తాలూకా, మరికొన్ని బాజె రిపోర్టు జమీందారీలూ, * వుండేవి. భాఘసింహవంశానికి నటవర ఘనశ్యామ భాఘసింహగారు జమీందారీ యావత్తూ వెలిగించేసి కాలం చేశారు. మనిషి ఖర్చు చెయ్యవలసి వస్తే చేతికి ఎముక వుండేది కాదు. ఖర్చులో వెనకాముందూ ఆలోచనేలేదు. ఇవాళ పదంటే సంద్యో, రేపు పాతికంటే సంద్యో. చేతిలో పడిందా ఖర్చుచేసెయ్యడమే. నోరువిప్పి ఏవొకవస్తువు అడిగితే లేదనేమాట వుండేదికాదు. భట్రాజులకోసం, బికార్లకోసం ఎల్లప్పుడూ తలుపులు తెరిచేవుండేవి. పొయ్యిమీద ఎసరుపెట్టి, బియ్యానికి ఆయన గుమ్మానికి వెళ్లడానికి సంకోచంలేదు లోకులికి. తినాలన్నా, తినిపించాలన్నా కూడా ఒక పెద్దపులి. లోకులు ఇప్పటికీ చెప్పుకుంటారు— "భాఘసింహులు ఎదటుకూచుని ఎవడికయినా వొకసారి మిన పట్లూ, కొబ్బరిపూర్ణం, వుండ్రాళ్లూ, పాలవగుండ, పాయసం, తినిపించాడో వాడు బతికున్నదాకా అది మరచిపోడు" అని.

నటవరఘనశ్యామగారి సమయంలో రుణముండేది. ఆయన కాలం చెయ్యడంతోనే జమీందారీ కూడా వెళిపోయింది. ఇప్పుడు వున్నదల్లా ఖండాయతు ఇలాకా మాత్రమే. నటవరఘనశ్యామ భాఘసింహులికి నలుగురుకుమాళ్లు. జ్యేష్ఠుడు భీమసేన

* బాజె రిపోర్టు జమీందారీ: సర్వేలో బయలుపడిన జమీందారీలమీద సర్కారు శిస్తు నిర్ణయించి జమాబందీ చేసిన విబాజె రిపోర్టు జమీందారీలు.

భాఘసింహులు. తక్కిన ముగ్గురూ ప్రహ్లాద మల్లూ, కుచులి మల్లూ, బలరామ మల్లూనూ.

కుమాళ్లు తండ్రిలాగ ఖర్చుదార్లు కారు. ముందూ వెనకా ఆలోచించి నడుచు కుంటారు. పూర్వ సంపద లేదు. ఏదో కృష్ణా రామా అంటూ కష్టసుఖాలతో గడిచిపోతుంది సంసారం. పట్టు బట్ట చిరిగితే పట్టు గుడ్డ. పురాతనమైన పెద్దకొంప అని లోకులు గౌరవించేవాళ్లు. భయభక్తులూ చూపేవాళ్లు.

రతనపురం గ్రామంలో భాఘసింహ వంశం కాక గౌడులూ, మంగళ్లూ, రాఢీ వాళ్లూ, గుడియావాళ్లూ — చిన్నా పెద్దా పద్దెనిమిది కొంప వుంది. వీళ్లంతా లోగడ భాఘసింహ వంశస్థులు ఇచ్చిన జాగిరీలు పురుషానుక్రమంగా అనుభవిస్తు న్నారు. అవసరం వచ్చినప్పుడు వీళ్లు భాఘసింహుల ఇంట వెట్టిచేస్తారు.

పురోహితుడి ఇల్లూ ఈ వూళ్లోనే వుంది. వీళ్లు కాక డోంబు వాళ్లు ఎనిమిది ఇళ్ల వాళ్లున్నారు. పండుగుల్లోనూ, పబ్బాల్లోనూ బాజాలు వాయించడంకోసం వీళ్లకి జాగిరీలున్నాయి. భాఘసింహుల ఇంట పహరా కాయడమూ వీరి కింకో పని.

ఇవాళకి మూడుసంవత్సరాలై భాఘసింహుల కుటుంబానికీ మంగరాజుగారికీ అనేక కారణాలవల్ల విరోధంగావుంది. మంగరాజుగారు చాలాబుర్రకలమనిషి. దావా లూ కేసులూనడపడంలో ఘనాపాఠీ. అయితే దుడ్డుకర్ర పేరుచెపితేమాత్రం ఇంట్లోంచి పైకిరాడు. అందుకనే భాఘసింహుల కుటుంబంవాళ్లనేవాళ్లు: "దుడ్డు సర్వార్థ సాధనం" అని. పైగా డోంబువాళ్ల భయం వల్ల మంగరాజుగారి వూరివాళ్లు రతన పురంలో అడుగు పెట్టలేకపోయేవాళ్లు. క్రానైతే దొంగవస్తువులు పెరట్లో దాచి పెట్టారన్న నేరం మీద డోంబువాళ్లు జైలుకి వెళ్లారు. డోంబువాళ్లు వాళ్ల ఏతరం లోనూ దొంగతనం ఎరగరు. మంగరాజుగారికి రెండుసంచులు ఈ విషయంలో ఖాళీ అయిపోయాయి. మంగరాజుగారి తిరుగుబోతు పశువులు రతనపురం గ్రామంలోని పంటో పాడుచెయ్యడం మూలాన్ని ఆవేళ బలరామమల్లు గోవిందపురం దుకాణం అరుగు మీద కూచుని మంగరాజుగారిని నానా తిట్లూ తిట్టాడు. మంగరాజుగారు నోరు విప్పలేదు.

గోవిందపురానికీ, రతనపురానికీ రెండుకోసుల దూరం. కాని పొలాలు మాత్రం తగిలే వున్నాయి. మంగరాజుగారి పశువులు ఎల్లప్పుడూ రతనపురం చేలు పాడు చెయ్యడం రోజూ వింటూనే వుంటాం.

# 10

## టాంగీపిన్ని

అవాళ స్నానపూర్ణిమ. జ్యేష్ఠమాసం రోజులు. ఎండ మండిపోతూ వుంది. మహాప్రభువు జగన్నాథస్వామి అణసరకి *వెళుతున్నారు. బాగా వుక్కగా వుంది. ఇవాళకి రెండున్నర మాసాలవుతుంది, వొక్కచుక్క చినుకులేదు. గాలి కదలడం లేదు. జగన్నాథస్వామి ఎదట వున్న గరుడస్తంబం లాగ మోడు మాకులు నిలబడి వున్నాయి. తక్కిన చెట్లమాట అలా వుండనివ్వండి, రావి ఆకులు కూడా వొక్కటీ అల్లాడలేదు. వీధి ఇసకలో పిడికెడు ధాన్యం పడేస్తే పేలాలు పేలిపోతాయి. వూళ్లో తిరిగే ఆడకుక్క నల్లటిది చెరువుబురదలో పొర్లుతూ పడివుంది. నాలిక మూరెడు పైకి చాచేసి, జాపోస్తూ వుంది. నీళ్ల లోపలికి మాత్రం పోదు. నీళ్లు వేడెక్కి మరిగి పోయినట్టున్నాయి. మైదానం మీద వొక్క పశువుకానీ, చిన్న దూడ పెయ్యకానీ కనిపించడంలేదు. వైష్ణ సన్యాసులు జపమాల పట్టుకొని హరినామం ధ్యానిస్తూ వున్నట్టు, పశువులు చెట్ల కింద పడుకొని అరమూతల కళ్లతో నెమరు వేస్తున్నాయి. ఆకాశం మీద పిట్టకాకి ఎగరడం లేదు. పక్షులు చెట్టుమీద ఆకులచాటున నోళ్లు వెళ్లబెట్టుకు కూచు న్నాయి. తలపగిలి పోతున్నాది ఎండ. వేళ పడమటికి వాలుతోంది. అయినా ఆకాశం అగ్గి కురుస్తోంది.

హూ మేరా భాయిరే హూఁహూఁ
ఖబరదారిరే హూఁ హూఁ
జోర్ కరిరే హూఁహూఁ
దహణ ధరరే హూఁ హూఁ

---

* ఆషాఢ పూర్ణిమనాడు పూరీ జగన్నాథస్వామి విగ్రహానికి స్నానం చేయిస్తారు. అంచేత అది స్నానపూర్ణిమ. స్నానం వల్ల స్వామివారి రంగులు మాసిపోతాయి. కొత్త రంగులు వేయడం కోసం వేరే వొక గదిలో పదిహేను దినాలుంచుతారు. ఈపదిహేను దినాలూ అణసర అంటారు.

బాంకు చాడ్ రె హాఁహూఁ
ఖడపా ఖడపా ఖడపా— *

రతనపురం గ్రామం గోర్జిలో గౌడబోయీల కేక వినపడింది. ముందు వొకడోలీ, దాని వెనక అయిదు కావుళ్లూ వెళుతున్నాయి. డోలీ వొక ముదూకు బట్టతో పూర్తిగా కప్పేసి వుంది. ఊళ్లో పురుషవ్యక్తులు ఇంచుమించు ఎవరూ లేరు. పొలం పను లేవీ లేవు. అంచేత బాఘసింహ సోదరుల్తో కలిసి కేంద్రపడాలోని బలదేవస్వామి స్నానం పండుగ చూడ్డానికి వెళ్లారు. "సవారివచ్చింది. సవారి వచ్చింది" అంటూ వూళ్లో ఈ మొగనించి ఆ మొగదాకా సందడయిపోయింది. ముసిలమ్మలూ, సగంముసిలమ్మలూ చూడ్డం కోసం గబగబా తలుపులు తెరుచుకుని పైకి వచ్చారు. వయసులో వున్న కోడళ్లూ, అమ్మాయిలూ తలుపు చాటు నించే మొహాలుపెట్టుకుని, ముక్కులోని నిమ్మగుత్తులూ, అడ్డబాసలూ అవీ బైటికి చూపిస్తూ నుంచున్నారు.

డోలీలో కూచున్న వ్యక్తి గురించి వూళ్లో ఆడంగుల మధ్య ఎన్నో చర్చలు ప్రారంభ మయాయి. మొట్టమొదట లింగవిచారణ జరిగింది. తరవాత వ్యక్తి నిర్ణయం వచ్చింది. కొత్తకోడలు అన్నారు కొందరు. కాదు జమాదారు అన్నారు కొందరు. కాదు కాదు దొరగారు అన్నారు మరికొందరు.

"ఇవాళ దేవస్నానపూర్ణిమ. జమాదారుబాబు కాయకూర్ల కావుళ్లు పట్టించుకుని ఇంటికి వెళుతున్నారు" అంది జమ్మాతల్లి. నిర్వివాదమైన మాట ఆమెది.

డోలీ బాఘసింహుల వాకిలి దగ్గిర తిరగకపోయివుంటే జమ్మాతల్లి చెప్పిందే సిద్ధాంతమై వుండేది.

---

* హూఁ నా సోదరా హూఁ హూఁ
ఖబర్దార్ రహూఁ హూఁ
జోరు చెయ్యర హూఁ హూఁ
కుడికి పట్టర హూఁ హూఁ
ఎడమ వదులు హూఁ హూఁ
ఖడపా ఖడపా ఖడపా.

ఒడిశాలో బోయీల కేక ఇలా పాటలా వుంటుంది. ఖడపా అంటే, ఏదన్నా కాలికి ముల్లు గుచ్చుకుంటే సవారీ నిలపవలిసింది అని, ఆ గుచ్చుకున్నవాడు హెచ్చరించడం.

బోయీలు బాఘసింహుల వాకిట్లో డోలీ దమ్ముని దించేసి గావంచాలతో మొహాలు విసురుకున్నారు. నిలువెల్లా చెమట్లు వరదలు కడుతున్నాయి. ఎడమచేత్తో మొహం నించి వుడిసిళ్ల కొద్దీ చెమట తుడిచేసుకుంటున్నారు.

కొత్త కోడలుగారి పిన్ని వచ్చిందని లోపలికి కబురువెళ్లింది. గత నెలలో డాలిజోడా ఫతేసింగుగారికూతుర్ని బాఘసింహుల కుమారుడు చంద్రమణి వివాహం చేసుకున్నాడు. ఈ డోలీ సరాసరి డాలిజోడా నించి వచ్చిందని ఏ వ్యాఖ్యానమూ అక్కరలేకుండానే వూళ్లోని బుద్ధిమంతురాళ్లయిన అమ్మలక్కలందరూ గ్రహించేశారు. మంగలి మాణిక్యం అమ్మగార్లకి కబురు చెప్పడం కోసం లోపలికి పరిగెత్తింది.

మా మాణిక్యంపేరు వినేవుంటారుమీరు — లేదా వినడం అవసరం. ఈమెని ఏదో వృత్త మంగలిదే అనుకోకండి. బుద్ధిలోనూ, వ్యవహారంలోనూ, గుణంలోనూ ఎంతోమంది మగాళ్ల ముక్కు కోసేసి వదిలిపెట్టేస్తుంది. ఊళ్లో యావన్మందీ ఈమెకి భయపడతారు. ముసిలమ్మలూ, సగం ముసిలమ్మలూ ఈమె సలహా తీసుకు మరీ పని చేస్తారు. చిల్లంగి విద్యలో మాణిక్యం మహాగట్టి చెయ్యి. ఊళ్లో చిన్న పిల్లలికి దిష్టి తగిలిందంటే, మంత్రంవేసి వూదేస్తుంది. ఏదన్నాపని తన మీద వేసుకుంటో, పిసరంత లోపం రానివ్వదు. ఆడబిడ్డ ఎవరైనా నొప్పులు పడుతూవుంటే, పురుడుపోసి, స్నానాలు అయిపోయి, బారసాల తీరేదాకా కంటికి రెప్పలా కనిపెట్టుకు వుంటుంది. మూలికలూ అవీకూడా బాగా తెలుసు. పరోపకారానికి ఎంతముందుకి వస్తుందో, కయ్యమాడ్డానికి అంత కాలు దువ్వుతుంది. దెబ్బలాట వచ్చిందో, అవాళ స్నానమూ గీనమూ అంతా మానేస్తుంది. ఎవరికన్నా ఏదన్నా కష్టం వచ్చిందనుకోండీ, ఆమెని దువ్వి నాలుగు మంచిమాటల్తో ఎత్తేస్తేచాలు. తిండీ తిప్పలూ మానేసికూడా రాత్రీ పగలూ కాసుకు పనిచేస్తుంది. పెళ్లిళ్లూ వాట్లో మీరు పిలవకపోయినా సరే, మాణిక్యం హాజరవుతుంది. మీరు చెప్పండీ చెప్పకపోండి అన్ని పనులూ చేసుకుపోతుంది.

మాణిక్యం ఎరగనిదంటూ లేదు. కటకం సంగతీ, దొరగారి ఇంటిభోగట్టాలూ, పూరీ జగన్నాథస్వామి కోవెల విషయాలూ — ఇలాంటి వన్నీ వూళ్లో ఆడంగులు మాణిక్యం నోటంబడే వింటారు.

చేపలు లేకుండా చెరువులుండవచ్చునేమో కాని నిందలాడేవాళ్లు లేకుండా వూళ్లుండవు. మాణిక్యం నోరు డబడబలాడుతుందంటారు కొందరు. కోతలు కోసేస్తుం

దంటారు కొందరు. దీని మాడుతరాలనించీ వూరుదాట లేదుకదా, కటకం సంగతీ, దొరగారి ఇంటిసంగతీ దీని కెలా తెలుసంటారు కొందరు.

బాఘసింహుల లోగిల్లో మాణిక్యమంటే ఎంతోగురి. వెయ్యిసార్లు చెప్పినవీ, వందసార్లు విన్నవీ అయిన రాజకుమారుడూ, మంత్రికొడుకూ, వర్తకుడి కొడుకూ, కొత్వాలు కొడుకూ — ఈ నలుగురూకలిసి దేశాంతరం వెళ్లిన కథా, కరవెయిదేవి కథా, పూరవతలవున్న మంగళా అమ్మవారికథా — ఇలాంటి కథలన్నీ చెప్పించుకు వినడంకోసం ప్రతీదినం సాయంకాలం లోగిల్లోని అమ్మవార్ల పిలుపు వచ్చేది మాణిక్యానికి. రామరావణయుద్ధం కథ తడుపుకోకండా చెప్పేసేది మాణిక్యం. మీ యిష్టం వచ్చిన కథ అడగండి, తణుకూ బెణుకూ లేని జవాబు తప్పకండా వస్తుంది మీకు. అయితే వొక్కటి మాత్రముంది, ఆమె ఏది చెప్పినా సరే, ఊఁ కొడుతూ పోవాలి మీరు. ఆమె చెప్పింది కాదన్నారా, కొంప మునుగుతుంది. అదాలా వుండనివ్వండి. "స్వనా మరమణీ ధన్యా." మాణిక్యాన్ని ఊళ్లో అందరూ ఎఱుగుదురు. మేము వేరేపరిచయం చెయ్యనక్కరలేదు.

డోలీ వీధిలోంచి వస్తున్నప్పుడే వెంటవున్న మంగలితో మాట్లాడి సంగతి తెలుసుకుంది మాణిక్యం. బాఘసింహగారి వీధి వాకట్లోంచే నోరుచేసుకుంటూ లోపలికి పరుగెత్తిందామె.

"పెద్దమ్మగారూ, చిన్నమ్మగారూ, మద్దమ్మగారూ, పరిగెత్తుకురండి! ఎక్కడున్నారు? డాలిజోడా నించి మీ వీరకత్తెగారి సవారీ వచ్చి పూటయింది. వీధి గుమ్మంలో వుంది. వీరకత్తెగారు వస్తారని నాలుగురోజులై విన్నాను నేను. మీతో చెప్పడం మరిచిపోయాను. వారు నిన్నే బయల్దేరారు డాలిజోడా నించి. నేనడుగుతున్నాను చెప్పండి ఇంతఆలస్యం ఎందుకయిందో? డాలిజోడా నించి వచ్చేదారిలో పెద్దచెరువులేదూ, అదిగో అక్కడ స్నానాలూ అవీ చెయ్యడంలో ఆలస్యమై పోయింది."

బాఘసింహుల నలుగురు తోటికోడళ్లూ వొక్కదగ్గిర కూడారు. ఒకరి మొహాలు వొకరు సాకూతంగా చూసుకున్నారు. పిలవకండా వచ్చిన ఆగంతుకురాలు వియ్యపురాలి విషయంలో ఏమిటి కర్తవ్యం? అది ఆ చూపుల్లోని అర్థం? కాని మాణిక్యం వొక్కమాటలో దాని మీమాంస తేల్చేసింది — తక్షణం వెళ్లి వియ్యపురాలిని తోడి తెండని.

బాఘుసింహుల వీధిద్వారం తలుపుల్లోంచి నిమ్మగుత్తులూ, బేసరులూ, నత్తులూ వాటితో మూడు ముక్కులు కనిపించాయి. వియ్యపురాలు డోలీనించి దిగి దబదబా లోపల ప్రవేశించింది. 'వియ్యపురాలా' అంటే వియ్యపురాలా అంటూ పైన చెప్పిన నాశికా మూర్తుల్ని వోసారి కావిలించేసుకుందామె. ఇంట్లో వియ్యపురాళ్లు మాట్లాడకుండా నవ్వుతూ వియ్యపురాలి చేతులు పట్టుకుని లోపలికి తీసుకుపోయారు. వియ్యపురాలిని గౌరవించడంలో మాణిక్యం శ్రద్ధ అధికం. గబగబా ముందు పరిగెత్తుకువెళ్లింది. చప్పున బాఘుసింహులు గారి పడకగది గొండెం తీసేసింది. నాలుగు మూళ్ల పాత తివాసీ తెచ్చి పరిచేసింది. అబ్బాయి అత్తగారు దానిమీద కూచుని నలుగురు వియ్యపురాళ్ల చేతులూ పట్టుకుని దగ్గిర కూచో పెట్టుకుంది.

అయిదు కావుళ్లూ నడి వాకిట్లోకి తెచ్చారు. కావుళ్ల జాబితా— మామిడిపళ్లు వొక కావిడి. పెద్దపెద్ద పనసపళ్లు రెండూ వొక కావిడి. ఒక అరటిపళ్ల గెలా, (విడి రెండుపుంజీల పళ్లుకలిసి) ఒక అరటికాయల గెలా కలిసి ఒక కావిడి. బియ్యపిప్పిండి పూసిన నాలుగు పెద్దపెద్ద కుండలూ రెండు కావిళ్లు. ఈ కుండలికి అరిటాకులు మూతలు వేసి కట్టి వున్నాయి. ఇలా వెరశి మొత్తం అయిదు కావుళ్లు.

ఊళ్లోని అమ్మలక్కలు యావన్మందీ చూడ్డం కోసం పరిగెత్తుకు వచ్చారు. రేవతీ, శుకురీ, శక్తి, మాళియా, జెమ్మాతల్లీ, భీముడి పిన్నీ, హగురామా, సోదరీ, మెంకీ, కనకమా, నెత్తఅవ్వా, సాబీ, వకుళీ, పద్దిఅప్పా, శామాఅమ్మా, నళితా, బిష్కా, సుమిత్రా, గౌడువాళ్ల కనియా అమ్మా — ఒకామె చెంకని పిల్లనెత్తుకునీ, వొకామె కుర్రాడి చెయ్యిపట్టుకునీ, వొకామె ఎవరి వెనకనో నడిచీ వొకామె వొంటిగా — ఇలా అందరూ పరిగెత్తుకు వచ్చారు.

శక్రా తల్లి ఇల్లు అలుకుతూవుంది — పేడచెయ్యి కడిగిందిక వేళలేదు ఆమెకి, పాము పడగలా చెయ్యి ఎత్తుకునే వచ్చేసింది.

బాఘుసింహాగారి వాకిలి నిండిపోయింది. దేవీమూర్తిని చూసినట్టు స్త్రీజనం కొత్తకోడలు పిన్నిగారి రూపమాధుర్యం అనుభవిస్తూ చూస్తున్నారు. కాని, కనియా, కాళియా, బనమాలీ, గోపాళియా, రామియా, ఉమేశియా, కాశీ, చైతారీ, మొదలయిన వూళ్లోని పెంకి పిల్లలు పిన్నిగారి సౌందర్యం సందర్శించడం మానేసి, పిల్లి ఎండు చేపల బుట్ట చూసినట్టు అరటిపళ్లూ, మామిడిపళ్లూ చూస్తున్నారు. అది సభ్యత లేని పని; నీతి శాస్త్రానికి విరుద్ధమున్నూ. సందేహంలేదు. క్రమంగా కావిళ్ల చుట్టూ పిల్లలగుంపు హెచ్చిపోతూవుంది. చప్పున అది గ్రహించేసి, ఎడమచేత్తో

వాళ్లని మాణిక్యం రొప్పెయ్యక పోయివుంటే, నిజంగా వొక క్షణంలో దోపిడీ జరిగిపోయి వుండేది.

వియ్యపురాలి నుదుట మంగళా అమ్మతల్లిలాగ నుదురంత సిందూరమూ, కళ్లకి కాటుకా, ముక్కుని నిమ్మగుత్తూ, దాని మీద నాశికామయూరమూ, ఎడమ సెరంని సెరంకాడా, రెండు చెవులకీ పెద్ద పెద్దవి రెండు కర్ణకమ్మలూ, మెళ్లో కుత్తిగంటూ, దాని కింద పట్టుదారంతో కూర్చిన గుళ్లపేరూ, దండకి దండకడియాలూ, చేతికి పోచీటూ, వాటి మీద మురుగులూ, చేతి వేళ్లకి పేర్లు చెక్కిన వెండి వుంగరాలు ఏడూ, కాళ్లకి అయిదు ఏబలాల గవెండి కడియాలూ, కాళ్ల పదివేళ్లకీ పిల్లేళ్లూ వున్నాయి. తలమీద పది పన్నెండు పట్టుపీలికలతో కట్టిన శిగా, శిగమీద మూడు 'బెంగొాపటియా' * గుత్తులతో వున్న మూడు వెండి తల సూములూ దోపివున్నాయి. కుంభకర్ణంచు బరంపురం పదహారుమూళ్ల పట్టుచీరె కట్టుకుందామె. బుగ్గని బుగ్గడు తాంబూలముంది. డాలిజోడా ఫతేసింగు గారిది బాగా కలిగిన ఇల్లు. లోగడా విన్నారు. ఇప్పుడు అడంగులంతా ఈ అలంకారవైభవం కళ్లారా చూశారు. అవును—పెద్దిళ్లు పెద్దిళ్లే, అనుకున్నారు.

పిన్ని కూచున్నాక అంది: "నా కూతురేదమ్మా, నా కూతురేదీ? నా కూతుర్ని చూస్తాను. అయ్యో, తల్లిలేని పిల్ల. చిక్కిపోయి వుంటుంది!"

చిన్నత్తగారు కొత్త కోడల్ని తీసుకువచ్చారు. మూరెడు ముసుగు వేలాడ వేసుకుని, వంగి వంగి వచ్చింది కొత్త కోడలు. తల నేలకి తగిలించి పిన్నికి పాదాభివందనం చేసింది. పిన్ని కూతుర్ని కౌగిలించుకుని పనివి పనివి అంది:

"మా అమ్మో, మా అమ్మో, నాబిడ్డే! — నిన్ను చూడక గుడ్డిదాన్నయి పోయానే అమ్మా! నా మతాబా దీపమే! నా ఇల్లు చీకటి చేసేసి వచ్చేశావే నా తల్లీ! నా నల్ల మాణిక్యానివే మా అమ్మా!"

పనివి పనివి పిన్ని ఇదయి పోతోంది. రెండు కళ్లలోంచి ధారలు కడుతున్నాయి కన్నీళ్లు. పెద్ద వియ్యపురాలు ఆమెని పొదివి పట్టుకుంది. పవిట చెంగుతో కన్నీళ్లు వొత్తేసింది. అనేక విధాల బోధించీ, బుదిరించీ వూరుకో బెట్టింది.

"ఏం చెప్పేదమ్మా. అమ్మాయి వచ్చేసినప్పటినించీ నాకు అన్నహారాలు చేదయిపోయాయంటే నమ్మండీ" అంది పిన్ని— "వూరికే వీధిలోకి చూస్తూ

---

* బెంగొాపటియా: కప్పనోరులావుండే వెండిమువ్వలు.

కూచుంటాను. ఇటునించి మనిషన్నవాడు అప్పుడిస్తే చాలు, కూతురి విషయమే అడుగుతాను.''

కొత్త కోడలు కొత్త గొంతుక వినీ, ఈ పనివి పనివి రాగాలూ వినీ నిశ్చేర పోయింది. పిన్ని మొహం చూడాలని ముసుగు కొంచెం ఎత్తబోయింది. మహాబుద్ధి మంతురాలు పిన్ని. కూతురు భావం టపీమని గ్రహించేసింది. కూతురు ముసుగు కిందికి లాగేసి ఇలా అంది: "అయ్యో, నా సిగ్గుల చిట్టీ, నీ కెవరు నేర్పిస్తారమ్మా సిగ్గా! వియ్యపురాలో, ఏం చెప్పమంటారమ్మా, దీనితల్లికి ఎంత సిగ్గంటే,— మునిల్దయి కళ్ళుమూసింది, అయినా అత్తల ఎదట కళ్ళెత్తి చూసి ఎరగదు. మొహం మీంచి ముసుగుతీసి ఎరగదు. అత్తతో ఏదో బడబడ లాడేదనుకోండీ, మేనత్తల్ని తిట్టేదనుకోండీ — అయినా అదంతా ఆ ముసుగులో నించే. ధాన్యం కడుపులో జోడాలు పుడతాయా? తులసివిత్తనంలోంచి దూలగుండు పుడుతుందా? వయసులో వున్న ఆడపిల్లకి సిగ్గంటూ లేకపోతే— ఛీ, దాని బతుకూ వొక బతుకేనా? అలాంటి దాని వూసే ఎత్తకూడదు.''

పిన్ని మాటలు విని కూతురు మరింతముసుగు ముందుకి లాగేసుకుంది. ఒళ్లంతా కప్పేసుకుని కప్పలా కూచుంది. టాంగీలో ఆమె పింతల్లి వొకామె వుందని తన కన్నవారింట వినే దామె. ఆమె తనతల్లి పింతల్లి కూతురు. ఆమే ఈమె అనుకుంది మనస్సులో.

తరవాత పిన్ని నవ్వుతూ, కేరుతూ వియ్యపురాళ్లతో మాటామంతీ, కష్టం సుఖం సాగించింది. వియ్యంకుడూ, వియ్యపురాలు మాటలూ, నవ్వాతాలు మాటలూ, పరాచికాలమాటలూ — ఇలాంటివి ఎన్నో అయాయి. అవన్నీ వినాలని మీకు ఉబలాటం వుండవచ్చు. కాని తగుమనుషుల ఇంటి ఆడంగుల మాటలు బైటపెట్టడం మాకు సుతరామూ ఇష్టం లేదు. అంతకీ కాదని మీరు పట్టుపడితే మాత్రం, ఏమి చెపితే తప్పుండదో అవి మాత్రం చెపుతాం.

పిన్ని అంది:

"ఈ సంవత్సరం మంచి యోగం పట్టింది. అంతా బలదేవస్వామి ఉత్సవం చూడాలని పరిగెత్తారు. మా వూరు సంగతి చెప్పే అక్కర లేదు. వూరు వూరంతా సూన్యంగా వుంది. మంచియోగం కుదిరింది. దేవుడి దర్శనమూ, వియ్యపురాళ్లని చూడడమూ, వొక్కసారి కలిసివస్తాయనాను నేను. అమ్మాయి ఎలా వుందో చూస్తాను. ఈ దీనితో అందరినీ పూటుచేసి బయల్దేర దీశాను. మా వాళ్లూ—

తక్కిన బావలూ గుర్రాలమీదెక్కి ఆదారిని వెళ్లారు; ముందువెళ్లి తోటలోకూచుని వుంటారు. మంగళ్లూ, గొడులూ అందరూ వారితోనే వున్నారు. అమ్మాయిని చూడందే నేను రానన్నాను — అందుకని వొంటరిగా వచ్చేశాను. దేవుడి దర్శనం చేసుకుని ఈ దారినే తిరిగి వస్తాం. దార్లో విన్నాను వియ్యంకులూ ఉత్సవానికి వెళ్లారని. మంచిదే అయింది. అందరమూ కలిసే రావచ్చు. వియ్యపురాలో, చూడండీ, మీతో కష్టసుఖాలూ, నవ్వూ పరియాచికాలూ నాలుగు మాటలు మాట్లాడిందికి వీలు పడలేదు. తిరిగి వచ్చేటప్పుడు ఇక్కడ నాలుగు రోజులుంటాం. బావగారు వొక్క రోజే వుంటా మన్నారు. చూద్దాం, మీరు పూనుకుంటే ఎలా నాలుగురోజులూ వుండరో ఆయన! మొల్లో చెయ్యిపెట్టి వుంచేద్దాం."

అమ్మాయి తల మీద చేత్తో నిమురుతూ ఇంకా ఇలా అందామె:

"మా అమ్మే, మాతల్లే! చిన్న పిల్లవి! పోల్చలేనేమో! చాలారోజులయి పోయింది చూసి. నేను తిరిగిరానీ, వొంటిగా కూచుని ఎన్నో చెపుతాను నీకు."

చెవిలో మెల్లి మెల్లిగా ఇలాచెప్పింది:

"చూడూ సంబరంలోంచి నీకు మంచి మంచివి ఎన్నో పట్టుకు వస్తాను."

కోడలు పిన్ని పెరట్లోకి వెళ్లడంకోసం నుంచుంది: "చూడండీ, వియ్యపురాలో, నేను బహిర్భూమికి వెళ్లానంటే స్నానం చేస్తాను. నాలుగుసార్లు వెళ్లినా సరే, నాలుగుసార్లూ స్నానం చెయ్యవలసిందే. కాళ్లు మడుచుకుందికి వెళితే ముంతెడు నీళ్లు కావాలి. 'ఆచారేలక్ష్మి, విచారే పండితా."

ఇలా అంటూ వీధిగుమ్మంలోకి డోలీ దగ్గిరికి దబ్బున వెళ్లిపోయిందామె. వెంటవచ్చిన మంగలి ముందే ముంతపట్టుకుని నుంచుని వున్నాడు. ఆమెచేతికి అందిచ్చేశాడు. నీళ్లు వొలికి పోతాయేమో అన్న భయంతో ఆమె ముంత మూతి చేత్తో కప్పేసి పెరట్లోకి వెళ్లింది.

భానుసింగుగారి ఇంటిదాసీ ముతురిమా పెరటి పంచకింద స్థలంచూపించేసి, పెరటి ద్వారం దగ్గిర నుంచుంది. పిన్ని దాన్నిచూసి అంది: "చూడూ, ఉదయం నుంచీ కడుపు నొప్పెడుతూవుంది. ఏం చెయ్యనూ? ఎటుచూసినా మనుషులే. మగవాళ్లేకానీ ఆడవాళ్లేకానీ — చూస్తూ వుంటే నేను కూచోలేను."

ముత్తురిమా అంది: "లేదు, లేదు. ఎవ్వరూలేరు. తమరు వెళ్లండి."

ఇలా ఆగేసి పెరటితలుపు చేరవేసి, ఇంట్లోకి వచ్చేసిం దది.

చీకటి పడుతూ వుంది. కోడలు పిన్ని అంది: "నేను మరి వుండలేను. వాళ్లు నాకోసం చూస్తూ కూచుని వుంటారు."

వియ్యపురాళ్లు ఏమయినా ఫలహారం పుచ్చుకోమన్నారు.

"రామ — రామ — రామ! ఏమిటన్నారూ, వియ్యపురాలో, ఎంతమాటన్నారూ! ఈ ఇంట్లో పిల్లనిచ్చాను. నీళ్లయినా ముడతానా ఇక్కడ?"

నాలిక కరుచుకుంటూ అంది పిన్ని. సెలవుతీసుకుంటూ వియ్యపురాళ్లని కావలించుకుని అందామె:

"సెలవివ్వండీ నేస్తం
మనస్సు మాత్రం కట్టేసుకున్నారు.
పగలూ రాత్రీ గడవదు సుమండీ
వెక్కి వెక్కి ఏడుస్తూ నాకు!"

డోలీ వూళ్లోంచి బయల్దేరింది. పొలాల గట్ల మీంచి చీకట్లో కలిసిపోయింది. ఇక్కడ బ్రాహ్మణింపు బాబులు వచ్చేక చూడడం కోసం కావుళ్లు ఇంట్లో జాగ్రత్త చేశారు.

కోడలు పిన్ని వెళ్లిపోయాక, ఆవిడ రూపంగురించీ, స్వభావంగురించీ చాలా విమర్శ జరిగి పోయింది. అందరూ ఆమెని ప్రశంసించారు. ఒకరు రూపం మెచ్చుకున్నారు. ఒకరు గుణం మెచ్చుకున్నారు. ఒకరు ఆమె అలంకారం మెచ్చుకున్నారు. ఒకరు అరటిపళ్లు మెచ్చుకున్నారు. కాని మాణిక్యం మాత్రం ఏమందో తెలుసా?

"సరే, పెద్దింటి మనిషి. అయినా అందం మాత్రం తగినట్టు లేదు. ముందు పళ్లు రెండూ వొకదాని మీద వొకటి వున్నాయి. బుగ్గలు రెండూ మామిడి వరుగులావున్నాయి."

హాసురామా అంది:

"మాటల్లో మాధుర్యంలేదు; వొఠబడబడ."

ముత్తరీమా అంది:

"నడకా బాగులేదు, దడదడ."

శంక్రీ అంది:

"అవునవును, నవ్వా అంతే, ఫడఫడ."

శుక్రీ అంది:

"చూస్తా అంతే— "

ఏకోహిగుణంలో దోషసన్నిపాతం అయిపోయింది. కొత్త కోడల్ని పిన్ని విషయంలో ఎన్నో ప్రశ్నలు అడిగారు. కాని ఆమె ఇంతే చెప్పింది:

"టాంగి పిన్ని."

# 17

## ఇల్లెలా కాలింది?

ఇవాళ రతనపురం గ్రామంలో హాహాకారాలుగా వుంది. గత అర్ధరాత్రినించీ బాఘసింహుల ఇంట్లో నిప్పంటుకుని, ఇల్లూ, ధాన్యంకొట్లూ అన్నీ కాలిపోయి బుగ్గయి పోయాయి. అగ్గీ, బూడిదా పూసుకుని నల్లనల్లటి గోడలు నిలబడివున్నాయి. ఇంతవరకూ అగ్గి ఆరడం లేదు. ఇంటికప్పు లోపలికి కూలిపోయి అదే మండడం మండుతోంది. వెదుళ్లు అగాదాల్లాగ పేలుతున్నాయి. ఒక దగ్గిర గోడమీద రెండు వెదుళ్లూ, వొక దగ్గిర పిడికెడు చోవ్వా మండుతున్నాయి. వలంపటి స్తంబాలు అగ్ని స్తంబాల్లా అవుపిస్తున్నాయి. తలుపులూ, ద్వారబంధాలూ, అన్ని దిక్కులా ఎటుచూసినా అగ్గే. ధాన్యం గదుల్లో అగ్గిదూరి దట్టంగా పొగ వస్తోంది. జ్యేష్ఠ మాసం దినాలు. ఇల్లూ, దళ్లూ ఎండి ఎండి గుగ్గిలంలా వుండేవి. దగ్గిర మొహాం చూపడం ఎవడి తరం! అదే సమయానికి ఎక్కడుందో గాలీ అందుకుంది. కేవలం మిద్దెలోపలికి మాత్రం అగ్గి దూరలేదు. తలుపులు ముట్టుకున్నాయి. కంబార్లు కడవల్తో నీళ్లు పోస్తున్నారు. తలుపుల దగ్గిరికి వెళ్లాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు.

సంబరానికి వెళ్లినవాళ్లు వచ్చేస్తున్నారు. పగలు ఆరు ఘడియల పొద్దెక్కింది. కింద అగ్గి, మీదా అగ్గి. ఇంట్లోంచి పూతికపుల్ల అయినా తీయడం పడలేదు. నిశిరాత్రి అగ్గిముట్టుకుంది. ఆడంగులు నిద్రలో గాభరాగాలేచి, కట్టుబట్టలతో వెళ్లి చెట్టుకింద కూచున్నారు. ఇల్లు తగలబడిపోతూవుంటే బావురు పిల్లుల్లాగ ఏడుస్తున్నారు. కంబార్లు ముందే చప్పున పశువులు విప్పేసి బైటికి తోలేశారు. వాళ్లు ప్రయత్నించి వుంటే కొంత కాకపోతే కొంతయినా సామాను కాలకండా చెయ్యగలిగేవాళ్లు. కాని పైవాళ్లకోసం అగ్గిలో వురికేవాళ్లు ఎంతమంది వుంటారు?

పొద్దు వాలిపోవచ్చింది. భాకుసింహగారి ఇంట చిన్నపిల్ల మొదలుకుని ముసిలివాళ్లదాకా ఎవ్వరూ పళ్లుతోముకున్న పాపాన పోలేదు. చిన్నపిల్లలూ, కోడళ్లూ మొహం తిరిగిపోతున్నారు. ముసిలి పురోహితుడు కళురథో ఎంతో అంత బోధపరిచి అందరినీ మొహాలు కడిగించాడు. తన ఇంట్లోంచి అటుకుల్లూ, బెల్లమూ తెచ్చి తినిపించాడు. గిన్నెడేసి తరవాణీ తాగించి వాళ్లని కాస్త నేద దేర్చాడు. ఆడాళ్లలో వొకరు తింటే, వొకరు తినలేదు. గటగటా ముంతెడు మంచినీళ్లు తాగేసి, ఇంటి దిక్కు పడ్డారు.

ధాన్యం కొట్లు తప్ప తక్కిన ఇళ్లు అగ్గి ఎరిపోవచ్చింది. ఇంకా కొన్ని గదుల్లో అగ్గి రాజుతూనే వుంది. రాత్రి సుమారు రెండు ఘడియలవుతుంది. భాకు సింహులూ, తమ్ములూ, తదితర గ్రామస్తులూ కలిసి వొక చెట్టుకింద కూచుని వున్నారు. భాకుసింగుగారు అడిగారు :

"అగ్గి ఎలా ముట్టుకుంది ?"

అందరూ అదే ప్రశ్న వేశారు.

"అగ్గి ఎలా ముట్టు కుంది ?"

ఎవరు జవాబు చెపుతారు ?

కళురథో అన్నారు :

"అగ్గి ఎవరు ముట్టిస్తారు ? పెద్దపులిగుహలో ఎవరు కాలు పెడతారు ? ఇదంతా హింగుళా అమ్మవారి పని."

అందరూ అతడి మొహంకేసి చూస్తూ వుండి పోయారు.

అవును, అదే నిజం.

గోవిందరథోగారు అన్నారు :

"కాదయ్యా, అది కాదు. మంగళా అమ్మవారి కోపం, ఇదంతా. సంవత్సరం పొడుగునా మంగరాజు అమ్మవారిపూజ సాగిస్తున్నాడు, చూడ్డంలేదూ ! నేను వందసార్లన్నా చెప్పాను; అమ్మవారికి పూజ పంపండని. విన్నారు కారు. ఇప్పుడు చూశారా మరి ! నేను బాగా తెలుసుకోకండా ఏదీ చెప్పను. అమ్మవారి కుట్ర కాకపోతే పెరట్లో, పంచకింద గడ్డితాడు కుప్పకి అగ్గెలా వస్తుందంటూ ?"

మాణిక్యం చెప్పింది :

"అదేమయినా, కొత్తకోడల అదృష్టం మాత్రం చెడ్డది. ఆమె ఇంట్లో అడుగుపెట్టినప్పటినించీ నానా ఆపదలూ వస్తున్నాయి."

శ్యామా అమ్మ అంది:

"ఈ మాట మాత్రం నిజం. ముమ్మాటికీ నిజం. అనడానికి భయపడి వూరుకున్నాను, కాని చైత్రమాసంలో చూడండీ, వూరికే పుట్టలోంచి ఆవుని పాం పాడిచేసింది. అంతకిముందు వూళ్లో పాములు లేవా? ఎక్కడయినా ఆవుల్ని కరిచినట్టు విన్నామా? నాకు నాలుగు కాలాలు నిండుతున్నాయి. ఏదీ, బాఘుసింహులు గారి ఆవుని పాం కరిచింది అన్న మాట వినలేదే!"

మకరా కంబారి అన్నాడు:

"కాపోతే మరేమిటి, రెండేళ్లకింద ఏనుగుల్లాటి నా రెండెద్లూ కూలబడి పోయాయి."

అర్జున కంబారి అన్నాడు:

"ఈ తోటలో మామిడి పళ్లు కుక్కమురికిగా వుండేవి. ఈ ఏడు కలికాని కన్నా లేవు."

కంబార్లూ కంబార్ల భార్యలూ, మంగళ్లూ మంగళ్ల భార్యలూ — యావన్మందీ నిర్ణయించేదేమిటంటే కొత్త కోడలు అదృష్టం మంచిది కాదని. ఈ సిద్ధాంతం బలపర్చడం కోసమని మాణిక్యం మళ్లీ అంది:

"కనపళ్లేదూ, కోడలుగారి పిన్నమ్మ ఇంట్లో అడుగు పెట్టిందో లేదో, మూనాళ్లయినా కాలేదు, మూడు వారాలయినా కాలేదు — ఇటు అడుగుపెట్టి, అటు అడుగు తీసింది — వెంటనే ఈ ఘోరం!"

"కోడలుగారి పిన్నమ్మ ఎవరు? ఎవరాకోడలుగారి పిన్నమ్మ?"

బాఘుసింహాగా రడిగారు.

డోలీ ఎక్కి కోడలమ్మగారి పిన్నిగారు రావడమూ, గుర్రాల మీద డాలీ జోడా ఫతేసింగుగారు బలదేవస్వామి దర్శనానికి వెళ్లడమూ— మొదలైన వివరాలు చూసినవీ, విన్నవీ మాణిక్యం వర్ణించి చెప్పింది. దాంతో పిన్నిగారు పట్టుకు వచ్చిన కావిళ్ల వివరాలూ చెప్పింది, వదలకండా.

ఆటుకుళ్లు అమ్ముకునే సబ్బిఅమ్మ అంది:

"నేను ఎన్నోసుట్లు ఆటుకుళ్లు అమ్మడానికి గోవిందపురం వెళ్లాను. ఈ పిన్ని గారు సరిగ్గా అక్కడ మంగరాజుగారి ఇంటో వున్న చంపాలాగే వున్నారు."

కంబారి శంకరయ్య అన్నాడు:

"పనసకాయల కావిడి తెచ్చినమనిషి మంగరాజుగారి కంబారి."

భాషసింహ సోదరులు వొకళ్ల మొహం వొకళ్లు చూసుకున్నారు.

"ఏదీ మేం కేంద్రాపడానించి తిన్నగా దారంబడే వచ్చామే! డోలీకాని, గుర్రాలుకానీ చూడలేదే!"

కేంద్రాపడా దారికీ, డాలిజోడా పతేసింగుగారి ఇంటికీ రాత్రికిరాత్రి మనుషులు పరిగెత్తుకు వెళ్లారు. వాళ్లు తిరిగివచ్చి చెప్పిన వార్త వల్ల అదంతా కేవలం అబద్ధమని తేలింది. పిన్ని అన్న వ్యక్తే లేదట! ఈ విషయం మీద వూళ్లో ఎన్నాళ్ల దాకో చర్చమీద చర్చసాగింది. చుట్టుపక్కల వూళ్లల్లోకూడా ఇవే కబుర్లు.

ఇదంతా మంగళా అమ్మవారి మాహాత్మ్యమని వూహించారు జనం. పిశాచం చేసిన పని అయి వుంటుందంటాం మేం.

డాలిజోడాపతేసింగుగారు పరామర్శకివచ్చి, కూతుర్ని తీసుకు వెళ్లిపోయారు. "కోడలమ్మ అన్నహారాలు వదిలేసి వుండడం వల్ల తండ్రి వచ్చి తీసుకువెళ్లకపోయి వుంటే, ఆమె బతకడమే గహనమైపోయేది" అన్నారు లోకులు.

# 18

## మంగరాజుగారి భార్య

"కాలం తీరాక అంతా వెళిపోతారు
కలకాలం లోకంలో కతలు మాత్రం మిగుల్తాయి."

శ్రావణమాసం. అవాళ రాధాష్టమి. బాగా తెల్లవార లేదింకా. మసక మసకగా వుంది చీకటి. జనం పక్కలు వదలలేదు. చాలామంది మేలుకున్నారు, కాని, ఎంతో అవసరం వుంటేనేతప్ప వర్షాకాలమూ, చలికాలమూ మనుషుల్ని పక్కలు కొంచెం పట్టి వుంచేస్తాయి.

మంగరాజుగారి దాసి మరువా ఎడమచేత్తో నీళ్లచెంబు పట్టుకుని, కుడిచేత్తో తలుపుతీసి గదిలోంచి పైకి వచ్చింది. హటాత్తుగా ఆమె దృష్టి తులసికోట మీద పడింది. ఆమె వొక్కసారి తుళ్లిపడి నిలిచిపోయింది. అదేమిటి ఆ తెల్లటిది?

తులసికోట మంగరాజుగారి నడివాకట్లో వుంది. మంగరాజుగారి భార్య స్వంతవస్తువుల్లోకల్లా ఆతులసికోట వొక్కటే. బృందావతి పూజ ఆమె జీవనవ్రతం. తోటలోంచి చిన్నమొక్క తెచ్చి, స్వయంగా పాతిందామె. ఉదయాన్నే లేచి, తులసికోటచుట్టూ తుడవడమూ, పేడతో అలకడమూ, స్నానం చేసివచ్చి తులసమ్మకి నీళ్లు పోయడమూ, పిడికెడు పచ్చిబియ్యం భోగంచెయ్యడమూ, సాయంకాలం దీపంపెట్టడమూ — ఇలాంటివన్నీ చేస్తూ ఆమె దినం గడిపేసేది. తులసమ్మ ముందు దీపంపెట్టి పయ్యెద చెంగు మెడకి చుట్టుకుని, దండాలు మీద దండాలు పెట్టేదామె. మెల్లిమెల్లిగా ఆమె ఏమేమనేదో, అది తల్లి బృందావతికే తెలుసు.

మరువా మెల్లిమెల్లిగా తులసిపీని దగ్గిరికి వెళ్లింది. బాగా పరికించి చూసింది.

“ ఆఁ, ఇదేమిటి? అమ్మగారూ— ఆఁ— అమ్మగారూ, అమ్మగారూ! ”

జవాబులేదు.

మరువా చెంబు కింద పెట్టేసి, అమ్మగారి వొంటిమీద చెయ్యివేసి, వూపి చూసింది.

రాత్రి బట్టతడి వర్షం కురిసింది. అమ్మగారి బట్టలు ముద్దయి వున్నాయి. బురదలో ఇదయిపోయి వుంది శరీరం. వడగళ్లలా చల్లబడిపోయి, కొయ్యబారిపోయి వుంది.

మరువా భయంకరమైన వొక్కకేక వేసి రాగాలు తీయడం మొదలుపెట్టింది.

“ మా అమ్మగారో, మా అమ్మగారో, మమ్మల్ని వొదిలిపెట్టి వెళిపోయా రమ్మో! మా అమ్మగారో! చీమకడుపునొప్పి ఎవరు తెలుసుకుంటా రమ్మగారో! నాకు ఊష్ణంవస్తే పత్యం ఎవరు వండిపెడతా రమ్మగారో! ”

మరువా నోరు విని అందరూ పరిగెత్తుకు వచ్చారు. వాకిలి నిండిపోయింది. అందరూ రాగాలు ప్రారంభించారు. కోడళ్ల తలమీద ముసుగుల్లేవు. ఏడుస్తూ దొర్లిపోతున్నారు.

అందరిలోకీ హెచ్చురాగాలు తీసింది చంపా. వీధిగుమ్మంనించి దొడ్డిగుమ్మం దాకా పరిగెడుతూ కేకలేస్తోందామె.

అందరూ ఏడుస్తూ కూచున్నారు. ఎవర్ని ఎవరు వోదారుస్తారు? క్షణంలో వూరు ఈ కొసనించి ఆ కొసకి మెరుపులాగ పాకిపోయింది కబురు. స్త్రీలు పాచి పనులు మానేసీ, పురుషులు పని పాట్లు వదిలేసీ మంగరాజుగారి భార్య సుగుణాలు వర్ణించడం మొదలు పెట్టారు. ఏమీ సంబంధంలేని స్త్రీలు సహా ఏడ్చేశారు.

“ఇవాళ మహాష్టమి. ఊళ్లోంచి లక్ష్మి వెళ్లి పోయింది” అన్నారొకరు.

“మంగరాజుగారి ఇంటి పెనుగుడల ఇంతే. ఇవాళనించీ సిరివొదిలి పోయింది” అన్నారొకరు.

ఊళ్లో ఆడాళ్ల మధ్య పతిభక్తి విషయంవస్తే మంగరాజుగారి భార్యని ఉదహరించేవాళ్లు. ఆమె శీలం ఎంత నిర్మలమైందో, ఆమె ధర్మాభిలాష అంత పవిత్రమైంది. స్త్రీల సౌభాగ్యం భర్త అనురాగం. అది ఆమె నుదుటే లేకపోయింది. అయితే దానికామె చలించలేదు. పతిసేవే స్త్రీల ధర్మం. పతిసేవే స్త్రీల సౌఖ్యం. ఇదే ఆమె బాగా తెలుసుకున్న విషయం. కేవలం పతిసేవే కాదు, మానవసేవ. మానవ సేవే ఆమె పరమాదర్శం. తల మీదికి చేతులందినప్పటినుంచీ కుమాళ్లు దగ్గిర చేర లేదు. కోడళ్లు ఆమెని అవమానించలేదు కాని, ఇంటికి పెద్దని ఆమెను మన్నించ లేదు. అత్త కాయిలాగా వుందని కోడళ్లు వచ్చి వో నూనెచెయ్యి కాళ్లకి రాయడం ఎప్పుడూ కనబడలేదు. ఐతే, ఇది తాను స్వయంగా చేసుకున్న అపరాధం. ఏమంటే ఇంటి పెత్తనం తన చేతిలో పెట్టుకుని, కోడళ్లనీ నౌకర్లనీ దాసీలనీ అదుపులో వుంచుకునే సామర్థ్యం ఆమెలో లేదు. అలా వుండడం ఆమెకి నచ్చేది కాదు కూడాన్నూ.

ఆమె దగ్గిర కడిగిన ముంపా, కడగని ముంపా రెండూ సమానమే. ఆమెని ఎవరయినా గౌరవించారా, మంచిదే. గౌరవించలేదూ, అదీ మంచిదే. ఎవరన్నా పదితిట్లు తిట్టనీ, వినపడని మూగిదానిలా వూరుకునే దామె. సాలగ్రామం కూచో డమూ నిద్రపోడమూ వొకటే. అదిగో అలాగ ఆమె నవ్వడమూ, ఏడవడమూ ఎవ్వరూ తెలుసుకోలేక పోయారు. ఎవ్వరితోనూ కలహంలేదు. ఎవ్వరితోనూ స్నేహం లేదు. వాళ్లతోనూ వీళ్లతోనూ కూచుని కష్టసుఖాలాడడం ఎన్నడూ లేదు.

లోగిల్లో ఎవరికన్నా కాయిలా చేసిందంటే, పగలూ రాత్రీ కూచుని సేవ చేసే దామె. కాయిలా సమయంలో దాసీది కానివ్వండీ, కోడళ్లు కానివ్వండి— వొద్దంటున్నా వినకండా కాళ్లూ చేతులూ పట్టేసేది.

ఇంట్లో వాళ్లనండీ, పైవాళ్లనండీ ఎవరయినా ఉపవాసమంటూవుంటే, వాళ్లకి తినిపించాక కాని ఎంగిలి పడేది కాదు. ఊళ్లోని బీద ముసలమ్మల సంగతీ, దిక్కు లేని వితంతువులసంగతీ ఎప్పుడు కనిపెడుతూ వుండేది. ఎవరింట్లో అయినా తినిందికి లేదని వింటే చాలు, భర్తకీ కొడుకులికీ కోడళ్లకీ తెలియకండా, కుంచెడు బియ్యమో, పిడికెడు మినప్పప్పో, ఇంత ఉప్పుకల్లో, కొంచెం నూనెచుక్కో—, చిన్న గుమ్మిడి

కాయో, పుంజెడు బెండకాయలో, బీరకాయలో — ఎవరికి ఏదికావలిస్తే అది పంపించేది. ఊళ్లో ఎవళ్ల కోడలికయినా, కూతురికయినా కాయిలాగా వుందని తెలిస్తే, దాసీలుపంపి క్షేమం విచారించేది.

ఆమె ఇవ్వనివ్వండీ, మాననివ్వండీ -- నిరుపేదలకీ, కష్టజీవులకీ ఆమె అంటే పెద్ద భరోసా.

ఎంతో మంది ఇచ్చుకోలేని రైతులూ, నిరుపేదలూ ఆమె ప్రయత్నం వల్ల మంగరాజుగారి పంజాలోంచి విడుదల పొందినట్టు వినికిడి. మంగరాజుగారు ఎవరిమీదన్నా జులుము ప్రారంభిస్తే, వాళ్లు తమ కూతురినో కోడలినో పంపి మంగ రాజుగారి భార్యతో మొరపెడితే బతికి పోయారే. అందుకని మంగరాజుగారి నించి ఎన్నో చీవాట్లు తినేదామె. చంపా దగ్గిర నించీ ఎన్నో ఎత్తి పొడుపులు భరించేది. అవన్నీ చెవిటాడి ముందు శంఖంలా చూసేదామె. పైవాళ్లకి ఉపకారం చెయ్యగలిగితేచాలు కోటి నిధులు దొరికినట్టు ఆనందించేది. పండిత శివన్నగారు శిష్టభాషలో అనేవాడు: "దయా, స్నేహమూ, భక్తీ — స్వర్గీయములయిన అన్ని గుణాలూ మూర్తిమంతమయిన దేవీమూర్తి ఆమె" అని

మంగరాజుగారి భార్యలో వొక్కటే చిత్రమైన స్వభావముండేది. అది మంచి గుణమో చెడ్డగుణమో నిర్ణయించ లేకపోతున్నాం మేము. మీరే ఆలోచించండి. నాలుగుమాటలు జోడించి చిత్రవిచిత్రంగా చెప్పేశక్తి ఆమెలో లేదు. అంతేకాదు, ఆమె ఎంత నెమ్మదిగా మాట్లాడేదంటే, ఆమె మాట్లాడడం వీధి గుమ్మంలో ఎవ్వరూ ఎన్నడూ వినలేదు. కాని లోగిల్లో మంగరాజుగారు వొక దాసీ మీదో, నౌకరిమీదో కోప్పడ్డప్పుడూ, లేదా ఎవళ్లనయినా కొట్టబోయినప్పుడూ మాత్రం సంగతీసందర్భం విచారించకండా మధ్య పడేది. నేరస్తులు నిర్దోషులని నిరూపించ డానికి వాదించేది. అలాంటి సమయాల్లో సత్యాసత్య విచక్షణ వుండేదికాదామెకి. ఫలితం — మంగరాజుగారి కోపం ఆమె నెత్తిని పడేది.

పైవాళ్లకోసం తాను అవమానం సహించడమూ, అబద్ధమాడడమూ బుద్ధిమంతుల పనికాదు. అయితే ఈ పూటవరకూ ఆమె స్వభావం మారలేదు. "స్వభావో నైవముచ్యతే" దోషి కానీండీ, నిర్దోషి కానీండీ — ఎవరి దుఃఖం చూసినా ఆమె ఏడ్చేసేది.

ఇంకోమాట. లోగిల్లో ఇద్దరు దాసీల మధ్య కానీ, ఇద్దరు కోడళ్లమధ్య కానీ కలహం వచ్చినప్పుడు ఎవరు నాసిగా వుంటే వాళ్ల పక్షమే వుండేదామె. నిజానికి

ఇది పక్షపాతం కాదూ! బాగా ఆలోచించి బలవంతుల పక్షమే వుండాలి. ఆ గుణం ఆమెలో లేదు.

ఆమెలో మరో గొప్ప దోషముండేది. అవును, గొప్ప దోషమే అనాలి దాన్ని. అందుకని మంగరాజుగారు మొదటినించీ మొత్తుకునేవాడు. ఇల్లు సరిగా నడిపించలేకపోయేదామె. రూపాయలనండీ, కాసులే అనండీ — వీటి విలువ కసెంతా తెలిసేది కాదామెకి. వీటికోసం ఆమె ప్రయత్నించేదే కాదు. అంచేత ఆమె చేతికే వచ్చేవి కావవి. ఎప్పుడో దైవికంగా వొక బేడో, పావలో, లేదా రూపాయో ఆమె చేతిలో పడిందే అనుకోండి — ధాన్యం వుడికించే బానకిందో చిబుబుట్టకిందో పడేసేది. ఊళ్లో ఎవరి అమ్మాయి అయినా అత్తవారింటికి వెళ్లినప్పుడు, చిన్న చీరో, జడకుచ్చులో, లేదా నెయ్యివుండలో, మురమురాలో కొని ఇచ్చేది. లేదా, ఎవరింట్లో అయినా తిండికి లేదంటే వాళ్లకిచ్చేసేది.

అయితే ఇలా ఆమె ఇచ్చేదని చెవులతో వినడమే. కళ్లతో మాత్రం ఎవ్వరూ చూడలేదు. ఏది ఎలా వుంటేనేం, ఆమె స్వభావం మంచిది కానివ్వండీ, చెడ్డది కానివ్వండీ — ఇవాళ ఆమె కళ్లుమూసిందంటే ఇంటిల్లిపాదే కాదు, విన్నవాళ్లంతా విచారిస్తున్నారు. ఏడుస్తున్నారు. కాని అందరిలోకీ వొక్కడు మాత్రం ఏడవడం లేదు.

ముకుంద కంబారి బోసినోరు ఆఁ అని తెరిచేసి, కళ్లు మూసుకుని, మాంసం పిసరంటూ లేని పొడవాంటి కాళ్లు రెండూ చాపేసుకుని గోడకి చేరబడే కూచున్నాడు. ముకుందుడికి నా అన్నవాళ్లెవరూ ఇంటా బయటా ఎక్కడా వున్నట్టు లేదు. వాడి వయస్సూ, జాతీ, కులమూ, గుణమూ, వూరూ ఏం చెప్పమంటారు? కంబారి గాడి విషయం ఎవడికి కావాలి! వాడే స్వయంగా చెప్పేవాడు - మంగరాజుగారి భార్య పుట్టినపుడు మంత్రసానిని పిలవడానికి వాడే వెళ్లాడట! వాడి చేతులమీదే పెరిగి ఆమె పెద్దదైందట! ఆమె కన్నవారింటి దగ్గరనించే ఆమెతో వాడు వచ్చాడు. మూగాడి మాటలు మూగాడి తల్లికి తెలుస్తాయి. మంగరాజుగారిభార్య మనస్సులోని మాటలు ముకుందుడే గ్రహించేవాడు. దేనిగురించి అయినా ఆమె దుఃఖం పెట్టుకుని, విచారిస్తూ కూచుంటే ముకుందుడు వచ్చి బలబలా ఆమె మొహం చూస్తూ నుంచునేవాడు. వాడి మొహంచూసి, ఆమె తల వంచేసుకునేది. ఆ మూగ చూపుల్లోనే అన్ని విషయాలూ పరిష్కారమయిపోయేవి. ఓదార్పు అక్కరలేకుండానే ఆమె వూరుకునేది. ఆమె విచారంగా వుంటే వాడి కళ్లల్లోంచి కన్నీళ్లు ధారలు కట్టేవి. అలాంటిది, ఇవాళ ఆమె చనిపోయి పడివుంటే, వాడు ఏడవడంలేదు.

ప్రపంచంలోని సమస్తసౌఖ్యమూ — సమస్తశాంతీ — సమస్త ఆధారమూ — సమస్తఆశా — సమస్తసాంత్వనమూ — సమస్త స్నేహమూ వొక్కసారి నాశనమైన వాడు ఏడవలేడు.

ఉండి వుండి పెద్దనిట్టూర్పులు మాత్రం విడిచిపెడుతున్నాడు ముకుందుడు. అంచేతే ఏమో వాడి శుష్కహృదయం పగిలిపోకండా వుంది!

మంగరాజుగారు భార్య తలతట్టు కూచుని అదే ధ్యానంతో ఆమె మొహం చూస్తున్నాడు. ఆయన రెండు కళ్లనించీ కన్నీళ్లు నిశ్చల ప్రవాహంలా ప్రవహిస్తున్నాయి.

మంగరాజుగారి కళ్లల్లో కన్నీళ్లు రావడం ఎవ్వడూ ఎన్నడూ చూడలేదు. కొత్తగా ఇవాళే ఆయన కంట కన్నీళ్లు కనిపించాయి. స్నేహమూ, అభిమానమూ, సిగ్గూ, బిడియమూ, ధర్మమూ — ఇవేవీ మంగరాజుగారి హృదయం స్పృశించలేదనేవాళ్లు లోకులు. ఆయన బాగా తెలుసుకున్నదల్లా వొక్కటే — "రూప్యం ఏవ మనుష్యానాం చతుర్వర్గ ఫలప్రదా" అని. పగలూ, రాత్రీ రూపాయలు — రూపాయలమీదే ఆయన ధ్యాస. రూపాయలే ఆయన జ్ఞానం.

మౌనంగా కూచుని ఎన్నోసార్లు ఆయన ఆలోచిస్తూ వుండేవాడు. అలాంటపుడు వొక విధమైన జ్యోతి ఆయన కళ్లల్లో మెరుస్తూ అవుపించేది. సముద్రగర్భంలోంచి పెదపెద్ద కల్లోలతరంగాలు వచ్చి వొడ్డున విరిగి పడిపోయినట్టు, హృదయంలోని రకరకాల ఆలోచనా తరంగాలు వచ్చి ఆయన కనుబొమ్మల్లో కరిగిపోయేవి.

ఇవాళ మంగరాజుగారి ఆలోచనలు మరోలాంటివి. నేత్రాలు అర్ధ నిమీలితాలుగా వున్నాయి; కదలికలేకండా వున్నాయి; కన్నీళ్లతో తడిసి వున్నాయి.

మంగరాజుగారు నిజంగా భార్యకోసం ఏడుస్తున్నారా? ప్రియపదార్థంతో వియోగం వస్తే మనిషి సహించలేడు. మంగరాజుగారు పవిత్రమైన దాంపత్య జీవనంలో, స్వర్గీయమైన మాధుర్యం అనుభవించారా? ఏదీ? ఎక్కడ? భార్యతో ఆయన ప్రేమగా రెండుమాటలాడడం ఎవరూ ఎప్పుడూ వినలేదే! మరి? ఇప్పుడింత వ్యాకుల మెందుకని?

ఏమయినా ఇవాళ భార్య పోవడంతోనే ఆయన వియోగవేదన అనుభవిస్తున్నాడని అమాయకమైన విశ్వాసంతో అంగీకరిస్తున్నాం అగ్నిసాక్షిగా ఎవర్నయితే పీనిమీద వివాహం చేసుకుని అరాంగిగా అంగీకరించారో, ఆమె

మంచిదే కానీ, చెడ్డదే కానీ — ఆమె మీద వొక మమకారం ఏర్పడి వుంటుంది. ఇది నైసర్గికమయిన మానవ ధర్మం. ఇది లేకండా వుండటం సహజంగా సాధ్యం కాదు.

భార్య ధర్మకర్మల్లో సహధర్మిణి. ప్రాణాధికమయిన సంతాన సంతతికి తల్లి. సుఖదుఃఖాల్లో ఏకమాత్ర సమభాగిని. రోగావస్థలో శుశ్రూషా కారిణి. ఆపదలో మంత్రి. శరీర రక్షణలో ధాత్రి.

నువ్వు పాషాణం వంటి వాడివే అనుకో. ఆమె సుగుణాల మహత్వ అనుభవించగల శక్తి నీకు లేకపోయిందే అనుకో జీ; వితకాలంలో నీవు ఆమెను ప్రేమించలేదే అనుకో — అయినా ఆమె నిన్ను వదిలేసి కళ్లుమూసిందంటే ఆమె వియోగ వేదన నువ్వు అనుభవించాలి. తప్పదు.

ఇక సాధ్వీ, శీలవతీ, పతిపరాయణా, ధర్మస్వభావం కలదీ అయిన భార్య సుగుణాలు వొకసారి హృదయంలో అనుభవానికి వచ్చిన వాడికి ఆమె వియోగం ఎంతవేదన కలిగిస్తుందో వర్ణించాలంటే భాష చాలదు. అది భార్యా వియోగం అనుభవించిన వాడికి మాత్రమే అవగతమవుతుంది. నాగుపాము ఎవణ్ణి కరుస్తుందో వాడికే తెలుస్తుంది విషంవల్ల ఎంతబాధకలుగుతుందో. అది మాటల్లో చెప్పాలంటే సాధ్యం కాదు.

భార్యా వియోగం అనుభవించిన వాడికే తెలుస్తుంది—రక్తం ప్రవహిస్తూ వున్న నరాలు యావత్తూ తెగిపోయి, హృత్పిండం శూన్యంగా పడి వుండడమంటే ఏమిటో. వాడికే అవగతమవుతుంది — ప్రపంచంలోని సమస్తసౌందర్య పదార్థాల సౌందర్యమూ, సమస్త మాధుర్యాల మాధుర్యమూ, సమస్త పుష్పాల సుగంధమూ, సమస్త సంగీతాల మూర్ఛనా తరంగమూ, సమస్త పవిత్రతా చితాగ్నిలో భస్మీభూతమై పోవడమంటే ఏమిటో. రెండుమాటల్లో చెప్పాలంటే తనని తాను మృతలోకం మధ్య వున్నట్టుభావిస్తాడతడు. బతికిన వాళ్ల మధ్య మృతుడైనట్టున్నూ భావిస్తాడు.

మంగరాజుగారి జీవనక్షేత్రంలో రెండునదులు ప్రవహిస్తూ వుండేవి. ఒకటి కెరటాల్తో కల్లోలమై, పాముల్తోనూ, మొసళ్లతోనూ నిండి వొడ్లు వొరుసుకుంటూ పారుతున్న చర్మణ్వతీనది. రెండోది అంతఃస్రోత, పూతసలిల ఫల్గునది. ఇవాళతో ఫల్గునది శాశ్వతంగా ఇంకి పోయింది.

తాగుబోతువాడి ఎదట వొక గిన్నెలోకల్లూ, వొక గిన్నెలో నీళ్లూ వున్నాయనుకోండి. వాడు కల్లుగిన్నె నే హెచ్చు ప్రేమిస్తాడు. దాన్నే బాగా జాగ్రత్త చేస్తాడు. కాని నీళ్ల గిన్నె సంపూర్ణంగా శూన్యమైపోయిందనుకోండి, అప్పుడు

అతడికి తెలిసివస్తుంది — 'కల్లు మత్తు కలిగిస్తుంది, నిజమే కాని నీరు తనకి జీవనమే ఇస్తుంది' అని.

మంగరాజుగారి అవస్థ చూస్తే, దుఃఖమూ, అనుతాపమూ—రెండూ ఆయనలో కలిగాయని అనుకుంటున్నాము. దుఃఖంవస్తే మనిషి ఏడుస్తాడు. అనుతాపంలో ఏడవడు. దుఃఖం హృదయానికి మండుతూన్న అగ్నిహోత్రం. అనుతాపం కుములుతూన్న నిప్పు. తన దుష్కార్యాలూ, తన అనాదరణా — వీటితో తన భార్య చావుకి సంబంధం వుందని అతడికి అనుతాపం కలిగిందంటారా?

మంగరాజుగారు చేసిన దుష్కార్యాలు లెక్కా జమా లేదు. ఏనీ ఎప్పుడూ అనుతాపం అనుభవించినట్టు ఎవ్వరూ చూడలేదే! అయినా ఎవరు చెప్పగలరు? క్షణక్షణం మారుతూవుండే మానవస్వభావంలో ఎప్పుడేమార్పువస్తుందో ఎవడికి తెలుసు?

సృష్టికర్త స్త్రీ పురుషులందరినీ వొకే మూలపదార్థంతో నిర్మాణం చేశాడు. రక్తం, మాంసం, అస్థి, మలం, మూత్రం — వీటితో ఎలా శరీరం తయారైందో, అలాగే దయా, మాయా, స్నేహమూ, మమతా, హింసా, ద్వేషమూ, నిష్ఠురత్వమూ మొదలయిన ప్రవృత్తులతో తయారైంది మనస్సు. వీట్లో ఏది ఎప్పుడు ఎంత అవసరమో అంత,సమభాగంలోపనిచేస్తే మనిషి మనిషనిపించుకుంటాడు. లేదా వాట్లో ఒక ప్రవృత్తి బలవత్తరమైనదై, హద్దు దాటి, తక్కినవాటి మీద తన ఆధిపత్యం స్థాపిస్తే మనిషిలోని మానవత్వం లోపిస్తుంది. అలాంటపుడు వాడు దేవతన్నా కావచ్చు లేదా రాక్షసుడిగా నైనా తయారు కావచ్చు.

దీనివల్ల తేలిందేమిటంటే మనిషిమనస్సు, స్వర్గీయప్రవృత్తీ, నారకీయప్రవృత్తీ- ఈ రెండింటితోనూ నిర్మితమై వుందన్నమాట. స్వర్గీయప్రవృత్తి మనిషిని దేవత చేస్తుంది. నారకీయప్రవృత్తి రాక్షసుణ్ణి చేస్తుంది. ఒక మనిషి దయాపరవశుడై మరొకడి ప్రాణం రక్షించడంకోసం వెళ్లి, తన ప్రాణం వదిలిపెట్టాడని మీరు విన్నారనుకోండి, అప్పుడు మీరు అతణ్ణి దేవత అనరూ!

అలాగే వొకవ్యక్తి చిన్నబంగారు వస్తువుకోసమో, వొక వెండి పిసరకోసమో వొకశిశువుని హత్యచేశారని విన్నారనుకోండి — సరిపోల్చిచూడండి, పురాణాల్లో వర్ణించిన రాక్షసుడూ ఆ హంతకుడూ వొక్కలాగే కనిపిస్తారో లేదో! ఐతే ఇలాంటి దృష్టాంతాలు ప్రపంచంలో తక్కువలేకపోయినా ప్రతిచోటా వుండవు. మనిషి చిరకాలంనించీ మనిషే. అతడి మనస్సుయొక్క మూలపదార్థం సమానంగా వుండినాకూడా, బాహ్యప్రవృత్తి అసమానంగా వుంటుంది. కోట్లకొద్దీ మనుషుల్ని

చూసినా అందులో వొకరితో వొకరి స్వరూపం కలవదు. మానవ ప్రకృతికూడా అంతే. కొంతమంది చిత్తవృత్తి బలంగావుంటుంది. కొందరిది దుర్బలంగా వుంటుంది. కొంతమందిది కదలికే లేకుండా సుప్తంగా వుంటుంది. సమయాన్నిబట్టి ఘటనా చక్రంలోపడి, ఆసుప్త వృత్తే మేలుకుని విజృంభించడమూ వుంది. తాగుబోతులయి వున్న జగాయి, మధాయిలు, పరమ వైష్ణవులవుతారని ఎవరనుకున్నారు ? క్రీస్తు విరోధి, దుర్మార్గుడూ అయిన పాలు ఇవాళ మహాపురుషుల్లో గణింపబడుతున్నాడు. గాధి నందనుడు రాజరుషి విశ్వామిత్రుడు తన బ్రహ్మనిష్ఠా, తపస్సూ అన్నీ వదిలిపెట్టి మేనక కడకంటిచూపుకి లొంగిపోయాడు. బాగా ఆలోచించండి. ఇలా నిమిషంలో పరివర్తనం రావడానికి కారణం వొక సంఘమూ, వొక సంసర్గమూఅని వ్యక్తమవు తుంది. భగవాన్ శంకరాచార్యుల మహావాక్యం స్మరించతగ్గది :

క్షణమిహ సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా.

సనాతనమైన బ్రహ్మధర్మ మ పదేశిస్తున్నది :

మీరు పాపాన్ని అసహ్యించండి,
పాపిని అసహ్యించకండి.

ఏ ప్రవృత్తి వల్ల మనిషి పశ్చాత్తాపపడతాడో, అదిగో ఆ ప్రవృత్తి మంగరాజు గారిలో మేలుకోలేదని ఎవరు చెప్పగలరు ? మేం దేవుళ్లం కాం కదా! మంగరాజు గారి మనస్సులో మాట ఎలా తెలుసుకోగలం ? తెలుసుకున్నా, దుఃఖమూ, అను తాపమూ ఆయన మనస్సుని ఎలా ఆవరించాయో, ఎలా ఆయన కంఠం గద్గదిక పరుస్తున్నాయో, ఎలా బాహ్యజ్ఞానం పోగొడుతున్నాయో — అదంతా వర్ణించి చెప్పడానికి మాకు శక్తి చాలదు. జడ్డివాడు ఎలా అయితే కాళ్లూ చేతులూ వూపుతూ తన మనోభావం చెప్పడానికి ప్రయత్నిస్తాడో, అలాగే మేమూ ఏదో అదీ ఇదీ ఇంత వాగేశాం.

పాఠకమహాశయులారా! క్షమించండి. ఇంతతో ఆగుదాం. అదిగో దేవమంద్రములు, పుని స్త్రీ వాయిద్యాలు మోగుతున్నాయి. "శుభం గవ్వలు"* ఏరి, మంగళ పేటికలో † వేసుకోడాని కని, ముత్తయిదువలు వీధిలోకి చూస్తు న్నారు. ఇంతతో ఆగుదాం.

---

* శుభం గవ్వలు : ముత్తయిదువ శవం స్మశానంకి తీసుకుపోయేటపుడు, భర్త ముందునడిచి చల్లేగవ్వలు.

† సిందూరమూ, పన్నే, అద్దమూ వుంచుకునే బెత్తు పెట్టె.

# 19

## పోలీసు ఎంక్వయిరీ

గోవిందపురంలో ప్రతీరోజూ ఎలా తెల్లవారేదో ఇవాళా అలాగే తెల్లవారింది. కాని పొద్దు కనిపించలేదు. మేఘం చిన్న చినుకులు చిటపట లాడిస్తూవుంది.

ఉదయం మేఘం మేఘం కాదు
ఉదయం చుట్టం చుట్టం కాదు.

మేఘం కొంచెం తెరిపిచ్చినట్టుంది. పొలాల్లో కలుపుతీతలు అయిపోయాయి. ఎవరూ పొలాలికి వెళ్లడం లేదు. ఒకరు అరుగుమీద కూచుని ఏదో నూరుతూవుంటే, ఒకరు పొమ్ములసాల శుభ్రం చేస్తున్నారు. ఒకరూ వొకరూ తలమీద తల్లారి పెట్టుకుని, చేతిలో చిన్న తాడూ కొడవలీ పట్టుకుని, ఆకుడొల్ల ముట్టించి పొగ పీలుస్తూ, భుజంమీద కావిడిబద్ద వేసుకుని గడ్డికోతకి బయల్దేరుతున్నారు. ఒకరు పందిరిమీద గుమ్మిడి తీగ సరిచేస్తున్నారు. ఇంట్లో వుప్పులేదని విని హరిపురాణ, భార్య చేస్తూన్న దుర్వ్యయం సప్రమాణంగా నిరూపణ చేస్తున్నాడు.

ఆడంగులు పాచిపనులు ముగించేసి పెరట్లోంచి చెరువుకి పయనమవుతున్నారు. సాలెవీథి ఝుష్ — దుమ్, ఝుస్ — దుమ్ శబ్దంతో కిందా మీదా పడుతోంది. సాలెయువతులు అరుగులమీద కూచుని దడదడా పంటికర్రలు తిప్పేస్తున్నారు.

వేళ సుమారు మూడు ఘడియలు దాటుతుంది. శామశాహుగారి కంబారి గోపాలసామలు తల్లారి నెత్తిని పెట్టుకుని, పారపట్టుకుని, వంగి, పొలం గట్టు సరిచేస్తున్నాడు. దారి పక్క పొలం. మంగరాజుగారి కంబారి ఘుసురియా గోబరాజెనా ఇంటికేసి గబగబా వెళుతున్నాడు. గోపాలంమీద అతడి దృష్టిపడింది దాంతో చెయ్యెత్తి ఇసారా చేసి అతణ్ణి దగ్గిరికి పిలిచాడు.

"ఇదిగో నేను వొక పెద్దపని మీద వెళుతున్నాను. చాలా రహస్యమైన విషయం. నువ్వంటే నమ్మకం నాకు. అంచేత చెపుతున్నాను" అంటూ అతడి చెవిలో ఏదో మెల్లిమెల్లిగా చెప్పాడు. "తెలిసిందా, ఖబర్దార్! ఈ మాట మళ్లీ పిట్టమనిషి చెవిలో పడకూడదు. బాబుగారు ఎవ్వరితోనూ చెప్పొద్దన్నారు."

ఘుషురియా అక్కడినించి ముందుకి వెళుతూ దారిలో మకరాజెనా బారికిని చూశాడు. అతడి చెవిలోనూ ఏదో మెల్లిమెల్లిగా కొన్ని మాటలు చెప్పేసి

"తెలిసిందా, ఖబడ్దార్! మళ్లీ ఈ మాట పిట్టమనిషి చెవిలో పడకూడదు" అని ఉపదేశించి ముందుకి నడిచాడు. తరవాత దనెయిసాహూ, వినోదియా, నటవరియా, భీముడమ్మా అతడికి కనిపించారు. వాళ్లతోనూ అలాగే మెల్లిమెల్లిగా చెప్పేసి "తెలిసిందా, ఖబడ్దార్! ఈ మాట మ పిట్టమనిషికి తెలియకూడదు," అంటూ ఉపదేశం చేశాడు.

గోపాలం మరింకా పనేమిటి చేస్తాడు? తన కామందు దగ్గిరికి పరిగెత్తాడు. హరిసాహూ శివసాహూకి చెప్పాడు. హటియా నటియాకి చెప్పాడు. జెమ్మాఅమ్మ శ్యామతల్లికి చెప్పింది. శ్రీమతి కన్యాతల్లికి చెప్పింది. ఊరువూరంతా చెప్పుకున్నారు. అందరూ మెల్లిమెల్లిగానే మాట్లాడుకున్నారు. అందరూ విషయం రహస్యంగా వుంచాలనే ఉపదేశాలు చేసుకున్నారు.

"ఇప్పుడే జమాదారు వచ్చేస్తాడు" అన్నారొకరు. ఇంకొకరు ఆమాట ఖండించారు.

"ఊఁ ఊఁ, అలా కాదు. ఖూనీకేసు. దారోగా స్వయంగా గుర్రం మీద వస్తాడు."

కాని బాగా తెలిసిన వాళ్లు ఏమన్నారంటే: "ఇది మీ ఇంటిమాటా, మా ఇంటిమాటా అనుకున్నారా? కటకం నించి కుంపినీవోడు పటాలం పట్టుకు మరీ వస్తాడు. ఊళ్లో అందరికీ ఆరదండాలు పడతాయి." ఈమాట నిస్సందేహంగా అంతా వొప్పుకున్నారు.

క్షణంలో వూరంతా నిస్తబ్దమై వూరుకుంది. అత్తచాటు కోడళ్లూ, తల్లి చాటు కూతుళ్లూ నీళ్లలో మునిగేసి, గబగబా వచ్చేశారు. బట్టలు పిండుకుందికే అవకాశం లేదు. తడిబట్ట పడపడా రాసుకుంటూ కాళ్లకింద నీళ్లు కారుతున్నాయి. తొందరలో నీళ్లకడవలు పూర్తిగా ముంచలేకపోయారు. పెద్ద దేశభక్తులు సభల్లో ఉపన్యాసాలు ఝూడించినట్టు గడగడా నీళ్ల కడవలు శబ్దం చేశాయి. బెత్తంతో సహా బడిపంతులు అంతర్ధానమైపోవడంవల్ల వీధిబడి కుర్రాళ్లు వీధిగోర్జిలో అల్లరిచేస్తూ పరిగెడుతున్నారు. ఖూనీ నేరస్థుణ్ణి పోలీసువాళ్లు కట్టుకు పట్టుకు పోయినట్టు వొక చిన్న కుర్రాణ్ణి వొక పెద్దకుర్రాడు పట్టుకు పోతున్నాడు. ఆ కుర్రాడే అందరికంటే అధికం పరిగెత్తాడు.

ఘుఘురియా తిరిగి వచ్చేసి మంగరాజుగారికి కబురు చెప్పాడు:

"గోబరా జెనా ఇంట్లో లేడు. నిన్నరాతిరినించీ వాడు ఇంటికి వెళ్లలేదు."

మంగరాజుగారు ముందు కంబార్లని పంపారు. తరవాత తానే స్వయంగా సాలివీధికి వెళ్లి ప్రతీగుమ్మం తిరిగారు. కాని వొక్కడూ దొరకలేదు. ఎవరి ఇంటికి వెళ్లినా తలుపు వేసే వుండేది. ఇంట్లో పిట్టమనిషి కనపళ్లేదు.

మంగరాజుగారు చాలా సతమతమైపోతున్నారు. కాలుకాలిన పిల్లిలాగ ఇంట్లోకీ బైటికీ తిరిగేస్తున్నారు. ఎవ్వరూ కనబడక ఏదీ స్థిరపరుచుకోలేక పోతున్నారు.

ఘుషురియా కంబారి వొక దుడ్డుకర్ర పుచ్చుకుని, పెరట్లో కుక్కని తరుము తున్నాడు. రెండు నక్కలు ముగిపెండెలో దూరి, పులుకూ పులుకూ పంచకేసి చూస్తూ, కదలకండా వూరుకున్నాయి.

వేళ మధ్యాహ్నం దాటింది. గోవిందపురం గ్రామం తూర్పుకొసని వొక తట్టు గుర్రంమీద వొక విశాలమూర్తిఅవుపించాడు. అతడి విశాలమయిన గడ్డం ఛాతీని కప్పేస్తూ వుంది. అతడి వొంటిని ఆరుకల్లీల వదులు లాల్చీ, తలమీద వంకటోపీ, కాళ్లకి వదులు పాయిజామా వున్నాయి. గుర్రం టకటకా ధీమాగా కదం నడక నడుస్తోంది. ముందూ వెనకా అయిదుగురు చౌకీదార్లు భుజాల మీద దుడ్డుకర్రలు వేసుకుని రొజుకుంటూ పరిగెడుతున్నారు. అందరిలోకీ ముందు గోబరా జెనా దుడ్డు భుజం మీద వేసుకుని పరిగెడుతున్నాడు.

మంగరాజుగారి ఇంటిముందు గోబరా జెనా వెనక్కి తిరిగి నిలబడిపోయాడు. గుర్రం మీది రౌతు అడిగాడు:

"ఈ ఇల్లేనా?"

గోబరా జెనా చేతులు జోడించి జవాబు చెప్పాడు:

"ఖోదావంద్!"

గుర్రంమీంచి విశాలమూర్తి దిగిపోయాడు. "బిస్మిల్లా" అంటూ వొక పెద్ద నిట్టూర్పు వదిలి పెట్టా డతడు.

మరో ఘడియ గడిచాక వీధి గోర్జిలో మరో గుర్రమూ, గుర్రం మీద మరో రౌతూ అవుపించారు. గుర్రం వూరిమీద తిరిగి బతికే తట్టు ఎముకలు బైటికివచ్చేసి, వయస్సు ఇంత అని చెప్పకండా చెపుతున్నాయి. వెనక కాళ్లు వొకదాన్ని వొకటి రాసుకుని, రోమాలు వూడిపోయి, రక్తాలు కారుతున్నాయి. కళ్లు గుంటలు పడిపోయి పెద్దపెద్ద గుడ్లు పైకి వచ్చేసి వున్నాయి. వీపు మీద బొంతా, బొంత మీద ఎర్రబనాతగుడ్డ దూది బొంతా వేసివుంది.

గుర్రం మీది కొత్త మాంచి భారీ మనిషి. అతడు వేసుకున్న దుస్తులూ భారీగానే వున్నాయి. మణియా బంది నాలుగు వరసల పూలంచు ధోవతి, వొంటి మీద అంగరఖా, తలమీద జరీతలపాగా మంచి డాబుగా వున్నాయి. వెనక వొక షాకీదారు వెమగ దుడ్డు భుజంమీద వేసుకుని, కుడిచేత్తో వొక వాయిలకొమ్మతో గుర్రాన్ని బాదుతూ అదిలిస్తున్నాడు. సయిసు ఘానీ కుర్రాడు వొక తాడు కళ్లేనికి కట్టి గుర్రాన్ని ముందుకు లాగుతున్నాడు. గుర్రం మెడచాపేసి, మహాకష్టంమీద, మెల్లి మెల్లిగా వూగుతూ నడుస్తోంది.

ఈ గుర్రం కూడా మొదటి గుర్రంలాగే మంగరాజుగారి ఇంటిముందు నిలబడింది. గుర్రం మీది వ్యక్తి వొకమనిషి భుజాలు వూతపట్టుకుని దిగబోతూ బోర్లా పడిపోయాడు. చప్పున లేచిపోయి, వూతఇచ్చిన మనిషి దవడమీద ఫఢీ అని వొకటి తగిలించాడు. అంటే ఆ మనిషి జాగ్రత్తగా వుండకపోవడమే తాను పడిపోవడానికి కారణమని లోకులనుకోవాలి. అదీ అతడి అభిప్రాయం. కాకపోతే అలాంటి పక్కా—రౌతు పడిపోవడమేమిటి? అతడు గుర్రంమీంచి దిగబోతూ వుంటే — సయిసు కుర్రాడు శాయశక్తులా పట్టుకుంటూవున్నాకూడా — జగన్నాథ్ స్వామిరథం ముందు, గుడిసెనగుళ్ల దగ్గిర శరథా ఇసకలో భక్తులు దొర్లిపోయినట్టు, గుర్రం మూడు నాలుగుసార్లు దొర్లిపోయిలేచింది. గుర్రం బుగ్గిలో దొర్లుతూన్నప్పుడే, దానిమీద ఎక్కి—వచ్చిన వ్యక్తి తన వొంటిమీద అక్కడక్కడ వున్న తామర బకిరేసుకుంటూ పళ్లికిలించాడు.

సేఖ్ ఇనాయేత్ హుసేను కటకంజిల్లాలో వొక వొకటోరకం పోలీసు దారోగా. పార్శీవిద్యలో మాంచి గట్టిపిండం. ఒడియా వొఠి పనికిమాలిన విద్య. అంచేత ఆయన వొడియాలో రాసేవాడు కాదు. సర్కారు కాగితాలో పార్శీ దస్తఖతు చేసేవాడు. తన పనివాడితనంవల్ల ఏకవరసని కేంద్రాపడా థానాలో వుంటున్నాడాయన. గతఏడు జిల్లాకచేరీ సిరస్తాదారూ, పేస్కారూ బెత్తాయించిన మామూళ్లు చేరడం ఆలస్యం కావడం వల్ల వోసారి బదిలీ అవుతుందని పుకార్లు వినిపించాయి, అంతే.

మున్షీ చక్రధరదాసు కూడా బాగా అన్నీ తెలిసిన పోలీసు ఉద్యోగి. ఈయన రిపోర్టు చదివి దొరగారు మెచ్చుకుంటారని చౌకీదార్లు చెప్పుకుంటూ వుంటారు.

మంగరాజుగారి కచేరీ చావిడిలో పోలీసుకచేరీ జరుగుతూ వుంది. స్వయంగా సేఖ్ ఇనాయేత్ హుసేను గారు వొక జంబుఖానా మీద, గద్దాం చాపేసి

కూచున్నారు. ఎదట కుడిపక్క మున్సీ చక్రధరదాసు వొక తుంగచాప మీద, గుర్రం మీద పరిచిన బొంత పరిచేసి కూచున్నారు. ఎదట ఇరవై మూరల దూరంలో బంట్రోతు గులాం ఖాదరూ, హరిసింగూ, మరి అయిదుగురు చౌకీదార్లూ నుంచుని వున్నారు. రామచంద్ర మంగరాజుగారు అరస్టయి వాళ్లముందు తల వేలవేసుకుని నుంచుని వున్నారు.

మంగరాజుగారి ఇంటి చుట్టూ ఘాటు వేసేశారు. బయటి మనుష్యులు లోపలికి కానీ, లోపలి మనుష్యులు బైటికి కానీ వచ్చిందికి హుకుం లేదు.

మొదట, ఆడవాళ్లని వొకపక్కకి తప్పించి ఇల్లు సోదా చెయ్యడం ప్రారంభించారు. ఇంట్లోని ప్రతీ సందూకు పెట్టే, బుట్టపెట్టే, బోనుపెట్టే తనిఖీ చేశారు. ధాన్యం కొట్లో ఇనపగజాలు పొడిచి చూశారు. కూటికుండలు వెదికారు. ఇంట్లో వొకటి రెండు చోట్ల తవ్వి చూశారు. పెణక వొకటి రెండుచోట్ల విప్పి న్నీ చూశారు. ఎవ్విధమయిని నిషేధవస్తువూ దొరకలేదు. మంగరాజుగారి పడకగదిలో మాత్రం మూడు నాలుగు మూళ్ల వెదురు దుడ్డొకటి దొరికింది. ఇంటి వెనక పెరట్లో పంచకింద వొక ఆడమనిషి శవం, తుంగచాపలో చుట్టేసి అవుపించింది. అది వీధిలోకి తీసుకు వచ్చారు. అది స్త్రీ శవం; శారియాదని గోబరా జెనా చెప్పాడు.

దారోగాగారు గెడ్డం దులుపుకుంటూ, మంగరాజుగారికేసి చూసి అన్నారు: "క్యా, రామచందర్ మంగారాజ్, అబ్ క్యా మతలబ్ హై? — రతన్‌పూర్ డోంబ్ లోగ్‌కా మామలా యాద్ హై?"

మున్సీగారన్నారు: "ఒక్క మాఘుంతోనే చలిపోతుందనుకున్నారేమో మంగరాజుగారు?"

మేం సి ఐ డీ పనిచేసి తెలుసుకున్నాం. రతనపురం డొంబువాళ్లని జైయిల్లో వేయించడంకోసం దారోగాగారికి మంగరాజుగారు వెయ్యిరూపాయలు లంచ మిస్తామన్నారు. కాని తరవాత పంగనామాలు పెట్టారు. అదిగో, ఆ సంగతే ఇప్పుడు దారోగారు ముదలకించారు.

నేరం ఎంక్వాయిరీ ఆరంభమైంది. మున్సీ చక్రధర దాసుగారు పేద్ద దస్త్రం విప్పేసి రికార్డు విప్పారు. పీకకి తాడుకట్టి, మూతికి జీలుగు బిరడా బిగించీ వున్న చీనామట్టి సిరాబుడ్డి దగ్గిర వుంచబడింది. మున్సీగారు వొక రెల్లుపుల్ల కలం, చేప కర్రఛిడిది తీసి చాకుతో పాళీచెక్కి, ముందు —

శ్రీరాములు
శ్రీ గురుదేవులు ఉద్ధరించాలి.
శ్రీ జగన్నాథ్ మహాప్రభువు చరణాలు శరణ్యం
శ్రీ బలదేవస్వామి పాదాలు శరణ్యం
శ్రీ లింగరాజు మహాప్రభువు చరణాలు శరణ్యం
గ్రామదేవత చరణాలు శరణ్యం

ఇలా దేవతల పేర్లు రాశాక, కచేరీపనులు ప్రారంభించారు.

"సర్కారు కంపెనీ బహద్దరువారు ఫిర్యాది.

రామచంద్రమంగరాజు, సాకీను : గోవిందపురం. జిల్లా : కటకం, ముద్దాయి.

శారియా అనే శాలియువతిని హత్యచేసి, ఆమె ఇంట్లోంచి నెత్త అనే ఆవు వొకటీ, ఇంకా కొన్ని వస్తువులూ దోపిడి చెయ్యడం నేరం.

ఇల్లు సోదా జరిగింది. హుకుం పొందిన చౌకిదార్లు వూరంతా తిరిగి వచ్చి భోగట్టా చెప్పారు వూళ్లో మగవాడన్న పురుగు లేదని. తలుపు చాటునించి ఆడంగులే జవాబు చెప్పారు. దీనివల్ల తెలిసిందేమిటంటే, సగంమంది చుట్టాలింటికి వెళ్లారు. నాలుగోవంతు మంది ఆవులో ఎద్దులో తప్పిపోతే వెదకడానికి వెళ్లారు. ఎనిమిదో వంతుమంది పూరీ జగన్నాథస్వామి దర్శనంకోసం వెళ్లారు. తక్కినవాళ్లు కాయిలాతో మంచంపట్టి వున్నారు. కేవలం ఇద్దరు మనుష్యులు తప్పించి తక్కిన సాక్షులు తమ కర్తవ్యం తాముగుర్తించి, తమంతటతామే హాజరై వచ్చేశారు.

గ్రామంలోని వాళ్లు హాజరు కాకపోవడంతోనే దారోగాగారు బారుకుల మీద వురిమారు.

"దద్దమ్మలు! గాడిదలు! బేకూఫ్‌లు! పనికిరాని వెధవలు!"అంటూ వూరు వూరంతా గడగడ లాడించేశారు. దాంతో గుద్దులూ, తాపులూ సాగించి తలుపులు కొట్టేంత పని చేశారు బారుకులు. సన్నిపాత జ్వరంతో వున్న రోగి తుంగచాప కప్పేసుకుని రెండు రోజులు యముడి కళ్లల్లో ఆయినా కారం కొట్టేయ వచ్చు. కాని, పోలీసు వాళ్లని టోపీలో ఎవడు వెయ్యగలడు?

మగవాళ్లు తిన్నగా ఇంట్లోంచి పైకివచ్చేశారు. రెండురోజులు కచేరీ సాగింది. ముప్ఫయి ఇద్దరు సాక్షులు సాక్ష్యం చెప్పారు. మొదటిదినం ఇద్దరి చౌకీదార్ల పూచీతో శవం పరీక్షకోసం కటకం చలానా చేశారు. జైలుకి పంపవలసిన ఖైదీ

విషయంలో మున్సీగారు దస్తా హరిదళం కాగితాలు పూర్తి చేశారు. మీరు తెలుసుకోవడంకోసం అందులోంచి కొందరుసాక్షులు చెప్పినసాక్ష్యాలు కింద వివరిస్తున్నాము.

ఒకటో నెంబరు సాక్షి: సర్కారు కంపెనీ బహద్దరు పక్షం.

నా పేరు గోబరా జెనా. తండ్రిపేరు గుహియా జెనా, మృతుడు. పాణు జాతి. వయస్సు నలభై అయిదు సంవత్సరాలు. వృత్తి: ఊళ్లో చాకీదారీ. సాకీను గోవిందపురం. ప్రగణా బాలుబిశ. జిల్లా కటకం.

నేను వూళ్లో చాకీదారుని. తెల్లవార్లూ తిరుగుతూ పారా ఇస్తుంటాను. గత రాత్రి పారా ఇస్తూవున్న సమయంలో, అర్ధరాత్రపుడు శారియా సాలిమనిషి "చంపేశాడు, చంపేశాడు" అంటూ మంగరాజుగారి ఇల్లా కాతల కేకలువేస్తూ వుండేది నేను విన్నాను. ఆమెని ఎవరో దుడ్డుకర్రతో కొడుతూ వున్నట్టు వినిపించింది.

క్రాసు పరీక్షలో అతడిలా చెప్పాడు:

"లేదు, నేనప్పుడు మంగరాజు గారిని చూడలేదు." మళ్లీ అన్నాడు: "అవునవును, నేను ఆయన నోరు విన్నాను. ఈ ఆవు శారియాదే. దీనిపేరు నెత్తా. ఇవాళకి నెల అయింది, మంగరాజుగారి వాకిట ఇది కట్టి వుండడం చూస్తున్నాను. ఇక్కడికది ఎలా వచ్చిందో ఎరగను."

మళ్లీ ఇలా చెప్పాడు:

"మంగరాజుగారు కట్టి పట్టుక వచ్చారు.

। ఈ గీతసంతకం గోబరా జెనాది.

రెండో నెంబరుసాక్షి హాజరై మొదట, ఏమీఎరగనని చెప్పాడు. దారోగా సాహెబుగారు గట్టిగా కోపగించి అతణ్ణి న్యూలుదిక్కు తిప్పి తేవలసిందని హుకుం చేశారు. అందుకని ఇద్దరు చాకీదార్లకి అతణ్ణి అప్పగించారు. అరగంట అయాక విడిపోయిన జుత్తూ, వొంటినిండా ధూళీ, ఫుమీదా చేతులమీదా దవడమీదా దెబ్బలూ వాటితో అతడు హాజరై ఇలా అన్నాడు:

"హుజూర్, నేనంతా నిజం చెపుతాను. నాపేరు సనారణా. తండ్రిపేరు వనారణా. జాతి మాలీలు. వయస్సు ముప్ఫయి సంవత్సరాలు. వృత్తి గ్రామదేవత పూజా, వ్యవసాయమున్నూ. సాకీను గోవిందపురం. ప్రగణా బాలుకుశ. జిల్లా కటకం.

నేను శారియాని ఎరుగుదును. ఆమె ఎలా చచ్చిపోయిందో నాకు తెలియదు. ఇవాళకి సుమారు సంవత్సరమో సంవత్సరం నరో అవుతుంది. ఒకనాటి ఉదయం

మంగరాజుగారు ఒక కంబారిచేత నాకు కబురంపారు. నన్నువారి తోటలోకి తీసుకువెళ్ళారు. ఎవరూ లేకుండా చూసి నాతో చెప్పారు: “చూడూ సనా, నిన్ను నేను కోరుతున్నాను. నువ్వు ఒక పని చేసిపెట్టాలి. నేను చెప్పింది నువ్వు చేస్తే నీకు నాపొలంమధ్య ఒకటోరకమయిన మడిచెక్కలు రెండెకరాలు భాగాని కిస్తాను. రెండురూపాయలు కజ్జం తినడానికీ ఇస్తాను” అన్నారు.

“ఏం చెయ్యాలో చెప్పండి” అన్నాను నేను. మంగరాజుగారు ఇలా అన్నారు. “ఇదిగో ఈ భగియా సేనాపతి వున్నాడు చూడూ, వాడి పెళ్ళాం శారియా - అది గొడ్డుది. కొడుకు కావాలని ప్రతీదినం మంగళాఅమ్మవారిదగ్గిర మొక్కుతుంది. తెలిసిందా? నువ్వు వెళ్ళి దాంతో ఏమి చెపుతావంటే — ‘అమ్మవారు కల్లో చెప్పిందనీ, నువ్వు పూజ చేస్తే అమ్మవారు స్వయంగా మాట్లాడుతుందనీ కొడుకు నిస్తుందనీ, చెప్పు’ అన్నారు.

మంగరాజుగారు చెప్పినప్రకారం రెండుమూడుసార్లు వెళ్ళి భగియాతోనూ, శారియాతోనూ చెప్పాను. నేను చెప్పిందంతా వాళ్ళు బాగా విన్నారు. కానీ ఏమీ జవాబు చెప్పలేదు.

ఒకనాడు భగియా నన్ను వాళ్ళ ఇంటికి పిలిచి తీసుకువెళ్ళాడు. ఎలా పూజ చెయ్యడం? పూజకి ఏమిటేమిటి కావాలి? ఎంత ఖర్చవుతుంది? అని అడిగాడు. నేను వాడికి అన్నీ చెప్పాను. పూజకి కావలిసినవి కొనడంకోసం వాడిదగ్గిరనించి పదణాల పరక చిల్లరడబ్బులు పుచ్చుకువచ్చాను.

ఒకరోజు శనివారం సాయంకాలం బాగా చీకటి పడ్డాక నేనూ, మంగరాజుగారూ, మంగలి జగన్నాథమూ, పారపట్టుకుని ఒక కంబారీ - ఇలా నలుగురమూ కలిసి మంగళాఅమ్మవారి దగ్గిరకి వెళ్ళాము. మంగరాజుగారు బెత్తాయించినప్రకారం అమ్మవారిగద్దె కిందనించి వెనకతట్టు పెద్ద వొండలాగ ఒక గొయ్యి తవ్వాము. గోతిలో మంగలి జగన్నాథం దాగున్నాడు. గొయ్యి కనపడకండా ఆకులూ కొమ్మలూ వేసి పైన కప్పేశాం. ఆ ఉదయమే నేను భగియానీ శారియానీ ఉపవాసం వుండమని చెప్పేసి వచ్చాను. అర్ధరాత్రి, పూరు మాటు మణిగాక, వాళ్ళని పిల్చుకు వెళ్ళి అమ్మవారి దగ్గిర పూజ ప్రారంభించాను. నైవేద్యం నివేదించి అమ్మవారిని ఎన్నో విధాల ప్రార్థించాను. నేను చెప్పినప్రకారం శారియా, భగియా మెడకి బట్టలు చుట్టుకుని అమ్మవారిముందు సాష్టాంగపడి వున్నారు. అమ్మవారికి నేను మరింత విన్నవించాను. “తల్లీ, మంగళాదేవీ, శారియాకి స్వయంగా వరమియ్యి.

ఆమె ఎన్నో దినాలయి నిన్ను సేవిస్తోంది. ఎంతమందికో నువ్వు వరాలిచ్చావు. వీళ్ళకీ వరమియ్యి" అన్నాను.

గోతిలోంచి జగన్నాథం పలికాడు. "ఒరే శారియా, నువ్వు ఎన్నోదినాలయి నన్ను సేవిస్తున్నావు. ప్రతీరోజూ స్నానంచేసి వెళ్ళినప్పుడు నాకు దండం పెడుతున్నావు. నీళ్ళు పోస్తున్నావు. నువ్వు పోసిన నీళ్ళు నాకు అందుతున్నాయి. నీకు వరమిస్తున్నాను. నీకు ముగ్గురు కొడుకులు పుడతారు. నీకు కావలిసినంత బంగారమూ, రూపాయలూ దొరుకుతాయి. నువ్వు నాకు గుడి కట్టించు. రేపు తెల తెలవారకండా మీ ఇద్దరూ స్నానాల రేవుకి రండి. నా పూజాపుష్పం మందారపువ్వు ఎక్కడ పడి వుంటుందో అక్కడ తవ్వి చూడండి. ఏది దొరికితే అది పట్టుకుపోయి, ఇంట్లో జాగ్రత్త చెయ్యండి. దానికి రోజూ పూజ చెయ్యండి. అలాంటివి దొంతులు దొంతులు మీకు ఇస్తాను. నా ఆజ్ఞ వినకపోతే భగియా పీక నులిపేస్తాను."

శారియా, భగియాలు భయంతో గడగడా వొణికిపోతూ వుండేవాళ్ళు. నోటమాట పెగల్లేదు. నేను పూజ పూర్తిచేశాను. వాళ్ళకి కొంచెం ప్రసాదం ఇచ్చి, వాళ్ళని ఇంటికి దిగబెట్టేసి వచ్చాను. మిగిలిన ప్రసాదం మూటకట్టాను.

నేను వాళ్ళని దిగబెట్టేసి వచ్చాక నవ్వుతూ జగన్నాథం గోతిలోంచి పైకి వచ్చాడు. మేమిద్దరం వెళ్ళి మంగరాజు గారిచ్చిన మొహరు నీలాటిరేవు దగ్గర పాతాం. దానిమీద మందారపువ్వు పెట్టి ఇంటికి వచ్చేశాం.

ఆ మర్నాడు నేను భగియా ఇంటికి వెళ్ళాను. నన్ను చూసి వాళ్ళిద్దరూ ప్రాధేయపడుతూ "ఘనం అమ్మవారిగుడి ఎలా కట్టడం? ఉపాయమేదో మీరే చెప్పండి" అన్నారు. నేను వాళ్ళకి నచ్చచెప్పిన ప్రకారం వాళ్ళ ఆరెకరాల ఎనిమిది కుంటలు పొలం తాకట్టుపెట్టి సొమ్ము పట్టుకెళ్ళారు.

సర్కారువారి జమాదారుగారు వచ్చి భగియా ఇల్లు పడగొట్టించి వెళ్లారు. మంగరాజుగారి కంబార్లు ఇల్లు విరగ్గొట్టేశారు. జమాదారుగారు నుంచునే వుండేవారు. భగియా సామానులన్నీ మోసుకువెళ్లిపోయారు వాళ్లు. ఇల్లు పడిపోయినప్పటినించీ భగియా పిచ్చెత్తిపోయి వూళ్లో తిరుగుతున్నాడు. శారియా ఏడెనిమిది రోజులయి మంగరాజుగారి పెరటి గుమ్మంలో కూచుని ఏడవడం నేను విన్నాను."

క్రాసు పరీక్షలో ఇలా చెప్పాడు :

"మంగరాజుగారు శారియాకి ఎన్నిరూపాయలిచ్చారో నేను ఎరగను. దస్తావేజు రిజిస్టరీ చేయడం కోసం కటకం తీసుకువెళ్లినప్పుడు శారియాకి వొక కోక

కొని ఇచ్చారు. అది నాకు తెలుసు. గుడికట్టడంకోసం సుమారు ఇరవై బళ్లరాళ్లు మంగరాజుగారు మంగళా అమ్మవారిదగ్గిర కుప్పపోయించారు. మంగరాజు గారు ఆవాళ నాకు నాలుగణాలే ఇచ్చారు. మరేమీ ఇవ్వలేదు. భయంవల్ల నేను అడగ లేను. నేను మరేమీఎరగను.

(సం) సనారణా

మూడో నెంబరు సాక్షి:

నాపేరు మరువా. తండ్రిపేరు లక్ష్మణతిహాడి. జాతి బ్రాహ్మలం. వయస్సు తెలీదు. సా: ప్రస్తుతం గోవిందపురం. జి: కటకం.

"శారియా ఏం జబ్బుతో చచ్చిపోయిందో నాకు తెలీదు. ఈ పూటకి ఎనిమిది దినాలై మా పెరటిగుమ్మంలో కూచుని వుండేది. ఎవర్నిచూసినా అరిచేది. 'నా ఆరెకరాల ఎనిమిది కుంటలు' నా నెత్తి, నా నెత్తి' — ఇదే అంటూ అరుస్తూ వుండేది. మా అమ్మగారిని చూస్తే కాళ్లమీదపడి ఏడ్చేది. అమ్మగారూ ఏడ్చేవారు. చంపా శారియాని మువ్వారు చీపురుతోకొట్టి తరిమేసింది. కాని అది కదలలేదు. ఎనిమిది దినాలయి సచ్చి మంచినీళ్లు ముట్టలేదు. అమ్మగారు ఆమె తినే అన్నం కొంచెం అరిటాకులోపెట్టి దానిముందు వుంచేవారు. కాని అది తినేది కాదు. కుక్కో, ఆవో అన్నం తినేసేది. అప్పుడప్పుడు అమ్మగారు దాని దగ్గిర కూచుని బుదిరించి చెపితే ఒక కద్దో రెండు కళ్లో తినేది. అమ్మ గారు కూడా ఏడు గోత్రాలయి ఎంగిలిపడలేదు. తినమంటే ఆమె మరింత ఏడ్చేవారు. అంచేత నేనేమీ చెప్పే - న్ని కాదు. సప్తమినాడు వొంటిపూట వంటచేసి మంగళా అమ్మవారి దగ్గిరకి జయుద్దేరా రామె. అదేసమయానికి శారియా అరిచింది. హవిష్యాన్నం అమ్మగారు దానిముందు పెట్టేశారు. అప్పటినించీ, అమ్మగారు ఇంటికివచ్చి అదే మంచం పట్టడం పట్టారు. పోయిన అష్టమినాడు ఆమెకాలం చేశారు."

క్రాసులో ఇలా చెప్పింది:

"అమ్మగారికి ఏం జబ్బుచేసిందో నేను ఎరగను. స్నాన పౌర్ణమికి తొమ్మిది పది దినాల ముందే ఆమెకి కొంచెంకొంచెం కాయిలా ఆరంభమైంది. స్నానపూర్ణిమ నాడు చంపా సవారీమీద ఎక్కడికో వెళ్లింది. నవ్వుతూ తిరిగివచ్చి ఎమిటేమిటో చెప్పింది. అవాళనించే అమ్మగారి శోకం హెచ్చిపోయింది. రాత్రిళ్లు ,ఏమీ తినే వారు కారు. పగలూ తిండి అంతంతగానే వుండేది. ఎప్పుడూ ఏడుస్తూ వుండేవా రామె. శారియా పొలం వదిలెయ్యమని బాబుగారి కాళ్లమీదపడి చెప్పారామె. బాబుగారు ససేమిరా వినుకోలేదు. చంపా కసిరింది. దాంతో మరేమీ ఆమె

చెప్పలేదు. తిండి విడిచిపెట్టేశారు. ఆమె జబ్బుకోసం ముకుందుడు కవిరాజు దగ్గర మందు పట్టుకు వచ్చాడు. ఆమె మందు తినలేదు. తలకిమట్టించి కింద పెట్టేశారు."

క్రాసులో ఇంకా ఇలా చెప్పింది :

"నేను ఇవాళ్ళకి పదేళ్ళయి ఈ ఇంట్లో ఉంటున్నాను. నా కన్నవారిల్లు పూరీబ్రాహ్మణాగ్రహారంలో ఉండేది. నా భర్తపేరు నాగనాథ తిహాడీ. నాపెళ్ళి నాటికి నాకు పదేళ్ళ వయస్సట! నా భర్త వయస్సు అరవై నాలుగు సంవత్సరాలు. నాభర్త తన పొలం అమ్మేసి మా నాన్నకి ఎనభై రూపాయలిచ్చాడుట. పెళ్ళి నాటికి నాభర్తకి ఉబ్బసం జబ్బు ఉండేది! ఆ జబ్బుతోనే ఆయన చచ్చిపోయాడు. నాభర్త ఇంట్లో మరెవ్వరూ లేరు. మా నాన్న వెళ్ళి నా భర్త పొలమూ, ఇల్లూ అమ్మేసి నన్ను మా ఇంటికి తెచ్చేశాడు. కన్నవారింట ఆరేళ్ళు ఉన్నాను.

మా వూళ్ళో లలితాదాసు బావాజీ వుండేవాడు. ఆయనదగ్గిరకి నేను చైతన్య చరితామృతం వినడానికి వెళ్ళాను. దానిమీద మా అన్నదమ్ములు దెబ్బలాడారు. నేను బృందావనం వెళ్ళడంకోసం వోనాడు రాత్రి బావాజీతో వచ్చేసి, కటకం తెలంగా బజారులో వున్నాను. మంగరాజుగారు దావామీద కటకం వచ్చారు. ఆయనతో వచ్చేశాను. అప్పటినించీ ఇక్కడే ఉన్నాను."

ం ఈ సున్నా సంతకం మరవాది.

నాలుగో నెంబరు సాక్షి:

నా పేరు బయిధరమహంతి. తండ్రిపేరు డబురుధరమహంతి. జాతి కరణాలు. వయస్సు నలభైఆరు సంవత్సరాలు. సాకీను కనకపురం ప్రగణా ఝుంకడ. జిల్లా కటకం.

ఇవాళకి ఇరవై సంవత్సరాలై ఈ పతేపురు సరషండ తాలూకాలో గుమాస్తాగా వున్నాను. దీనికి మొదట మేదినీపురం కెరామత్ అలీ జమీందారుగా వుండేవారు. ఇప్పుడు రామచంద్ర మంగరాజుగారు జమీందారు. దండన షరతు తనఖా దస్తావేజు ప్రకారం జమీందారీ సంపాదించారీయన.

(దారోగా చాలాచాలా క్రాసు చేశారు సాక్షిని. సాక్షికూడా చాలా చాలా చెప్పాడు. అదంతా వదిలేసి సాక్షి చెప్పినదాంట్లోంచి నిగ్గుమాత్రం తీసి కింద రాస్తున్నాం.)

సాక్షి : మంగరాజుగారు ఇంట్లోంచి రూపాయలిచ్చి జమీందారీ కొనలేదు. జమీందారీలో వసూలయిన సొమ్ములోంచే కొన్నారు. మొదటి సంవత్సరం

జమీందారీ శిస్తులు వసూలుచేసి, జమీందారు దిల్‌దార్ మియాఁ గారికి ఇచ్చారు. మొదటిసంవత్సరం శిస్తులు వసూలు చేసి, అవి పట్టుకుని మేదినీపురం వెళ్ళారు. వారి వెంట నేనూ వెళ్ళాను. "పాతజమిందారుగారితో బాధపడింహ వంశస్థులు కుట్ర పన్నారు.అందుచేత శిస్తులు వసూలు కాలేదు.ఏందారి? తెల్లవారితే నటువంది" * అని జమీందారుగారితో మంగరాజుగారు చెప్పారు. జమీందారీ వడ్డీభోగ్యం తనఖా రాయించుకుని, తాను పట్టుకెళ్ళిన శిస్తు సొమ్ము జమీందారుకి రుణమిచ్చారు.

జమీందారు రుణం చేశారని ఇటు రైతులదగ్గిర మంగరాజుగారు వడ్డీ వసూలు చేసేవారు. ఆఖరికి అధికార్లకి లంచాలు మేపి, అసలు వడ్డీలు ముప్ఫయివేల రూపాయలకి దస్తావేజు రాయించారు.

దిలుమియాఁ నిషాలో వున్నప్పుడు దస్తావేజుమీద సంతకం చేసేశారు. దాంతో మంగరాజుగారు మేదినీపురం వెళ్ళడం మానేశారు. కటకంలోనే వుండి దావా నడిపించారు. జమీందారీ దఖలు పరుచుకున్నారు.

క్రాసులో ఇలా చెప్పాడు సాక్షి :

"అవును. భగియా సేనాపతిదగ్గిర ఆరెకరాల ఎనిమిదికుంటలు భూమి వడ్డీ భోగ్యం,దండనపరతు పెట్టి తనఖాదస్తావేజు రాయించుకున్నారు, మంగరాజుగారు. దస్తావేజులో నూటాయాభై రూపాయలు రుణమిచ్చినట్టు రాసివుంది. దస్తావేజురాతకీ దావాఖర్చులికీ ఎంత అయిందో—చిఠా చూసి చెపతాను. (చిఠాచూసి) వెరశి మొత్తం ముప్ఫయి అయిదు రూపాయిల పదణాలా మూడ్డొలీలు."

సాక్షి ఇంకా ఇలా చెప్పాడు :

"అవును, మంగరాజుగారు కటకం మునసబుకోర్టులో భగియాచందుమీద దావావేశారు. ఆకేసుకి సంబంధించిన సమనులూ, డిక్రీనోటీసూ, వేలంనోటీసూ—అన్నీ నాదగ్గిరే వున్నాయి. భగియాకి ఏమీ అందించలేదు. బేటామీను మంగరాజుగారి దగ్గిర బహుమతీ పుచ్చుకుని, నాచేత రశీదు రాయించేసి, కాగితాలు నాదగ్గిరే పడేసి వెళ్ళిపోయేవాడు. శారియా ఎలా చచ్చిపోయిందో నాకు తెలియదు. ఈ ఆవు భగియా చందుది.

(సం) బాయిధర మహాంతి

* నటువంది : జమీందార్లు సర్కారువారికి పేష్కసు చెల్లించేరోజు.

అయిదో నెంబరు సాక్షి

"నా పేరు చంపా. తండ్రి పేరు తెలియదు. జాతి: ఈ ఇంట్లో మనిషినే. సాకీను గోవిందపురం. జిల్లా కటకం.

నేను శారియాని ఎరగను. దాని ఇల్లు ఈ వూళ్లో లేదు. అది మా ఇల్లా కాతల చవ్వలేదు. ఇంకెక్కడో చచ్చిపోయి మా ఇల్లా కాతల పడివుంది. దానికి ఊష్ణం వచ్చింది. అంచేత చచ్చిపోయింది. మా బాబుగారు దాన్నేమీ అనలేదు. బాబు గారు చాలా మంచిమనిషి. కదిలే నీటిలో కాలుపెట్టరు. అమ్మగారికి ఊష్ణం చ్చింది. అంచేత ఆవిడ చచ్చిపోయారు. ఆవిడకోసం నేను అన్నం మానేశాను. ఎంతో ఏడుస్తున్నాను. (సాక్షి రాగాలు తీసి ఏడవడం మొదలెట్టింది. దారోగా దబాయించాక పూరుకుంది) ఈ ఆవు మా ఇంట్లో పుట్టింది. కాదు కాదు, శారి యాకి సొమ్మిచ్చి కొన్నాము."

౦ ఈ సున్నా సతకం చంపాది.

రాత్రి చాలా పొద్దు పోయింది. ఆవాళిటికి కచేరీ బందయింది.

దారోగా, మున్షీ, చాకీదారు గోబరాజెనా చాలా రాత్రిదాకా కూచుని ఆలోచించారు. తగిన సాక్షులు జతపెట్టి మర్నాడు మళ్ళీ సాక్షి విచారణ ఆరంభించారు.

ఆరో నెంబరు సాక్షి:

"నా పేరు బనాజెనా. తండ్రిపేరు దనాజెనా. జాతి పాణు. వయస్సు పద్దెనిమిది. వృత్తి పాలేరు. సాకీను మట్రాపురం. ప్రగణా బాలుబిసి. జిల్లా కటకం.

నేను శారియాని ఎరుగుదును. వాళ్ళగుమ్మానికి అనేకసార్లు వెళ్ళాను. ఆమె ఇల్లు సాతుణియా, బ్రాహ్మణవీధి. కాదు కాదు పాణువీధిలో కాదు కాదు ఈ వూళ్ళోనే. రామచంద్ర మంగరాజుగారు వారం రోజులనించీ ఆమెని పట్టుకు వచ్చి కొట్టారు. ఈ వెదురుకర్రతో కొట్టారు. (సాక్షి కర్ర చూపించాడు.)

గత ద్వాదశినాడు ఒద్దరాత్రపుడు మంగరాజుగారు కొడుతూ వుండగా నేను చూశాను. శారియా వీపుమీద ఇరవై దెబ్బలు కొట్టారు. నేను మా కామందుల పశువులు వెదకడానికని అప్పుడు ఇలా వచ్చాను. మా ఇల్లు ఇక్కడికి రెండు కోసుళ్లుంది. మంగరాజుగారితో నాకేమీ విరోధం లేదు. గోబరాజెనా చాకీదారు నా బావమరిది కాదు.

। ఈ గీత సంతకం బనాజెనాది.

ఏడ్లో నెంబరు సాక్షి :

"నా పేరు ధూకెయిజనా. తండ్రి పేరు నంగుడజెనా. జాతి పాణు. వయస్సు ఊడోఁ తెలీదు. వృత్తి పాలేరు. సాకీను రాయిపురం. ప్రగణా బాలుబిశి. జిల్లా కటకం.

గత నవమినాడు అర్ధరాత్రపుడు ముద్దాయి రామచంద్ర మంగరాజుగారు ఈ మడ్డు కర్రతో శారియాని కొడుతూవుండగా నేను చూశాను. నేను వుప్పుకొనడం కోసం దుకాణందగ్గిరికి వచ్చాను. రాత్రయిపోయింది. దుకాణం గడపమీద పడుకుండి పోయాను. దభీదభీ శబ్దం వినిపించింది. ఏమిటా అని దుకాణం ఇంటికొప్పుమీదెక్కి చూశాను. కాదు కాదు, మంగరాజుగారి ఇంటి వెన్ను మీదెక్కి చూశాను. అంతా కనపడుతూనే ఉండేది.

ఈ ఆవు ఎన్నోసుట్లు చూశాను. ఆవుపేరు బవుళీ. ఈ ఆవు భగియచందుది. రామచంద్ర మంగరాజుగారు ఆతడి ఇంట్లోదూరి, దొంగలాడి పట్టుకు వచ్చేశారు. కన్నం తవ్వి దొంగలాడి పట్టుకు వచ్చేశారు.

క్రాసుపరీక్షలో సాక్షి ఇలా చెప్పాడు :

"గోబరా జెనా మా పింతల్లి కొడుకు కాడు. వాడు నన్ను పిలుచుకురాలేదు. సాక్ష్యం చెప్పడం కోసం నాఅంతట నేనే వచ్చాను. గోబరా జెనా నాకు తిండి పెట్టలేదు. నా ఇంటి దగ్గరనించి అటుకుల్లా బియ్యమూ నేనే తెచ్చుకున్నాను. నవమి ఇవాళికి ఇరవై రోజులయో, ఇరవయిరెండురోజులయో వెళిపోయింది. ఇవాళ తిథి ఏమిటో నాకు తెలీదు."

1 ఈ గీతసంతకం ధుకెయిజెనాది.

ఎనిమిదో నెంబరు సాక్షి :

"నా పేరు ఖతుచందు. తండ్రి పేరు నితాచందు. జాతి సాలీలు. వయస్సు ఇరవై ఎనిమిది. వృత్తి బట్టలు నేత. సాకీను గోవిందపురం. జిల్లా కటకం.

ఈ ఆవు భగియాచందుది. నాకు తెలుసు. భగియా నా పొరుగు. సర్కారు జమాదారు వచ్చి భగియా ఇల్లుపడగొట్టించేసిన నాడే మంగరాజుగారు ఆవు పట్టుకు పోయారు. వారి వాకట్లో కట్టేసుకున్నారు. ఎంచేత ఆవు పట్టుకుపోయారో అది నాకు తెలీదు. మంగరాజుగారి కంబార్లు వెళ్ళి భగియా ఇల్లుపడగొట్టేశారు. ఇంట్లో వస్తువులు యావత్తూ మోసుకుపోయారు. భగియా, శారియా ఇద్దరు గోల పెడుతూ వీధిలో మొత్తుకుంటూ వుండేవారు. సర్కారు వారి జమాదారు రావడం వల్ల

మేమందరం తలుపులు బిగించుకుని ఇళ్లల్లో దాక్కున్నాం. నేను తలుపు బిగించేసి సందులోంచి చూస్తూ వుండేవాణ్ణి. చౌకియా గోబరా జెనా నన్ను పిలుస్తూ వుండేవాడు. నేను పలకలేదు. మా ఇంటిది పలికింది. నేను ఇంట్లో లేనని చెప్పేసింది.

( ) ఈ గోరువంకల సంతకం ఖతుచందుది.

ముద్దాయి వాఙ్మూలం:

పేరు రామచంద్ర మంగరాజు. తండ్రి పేరు ధనీనాయకు. జాతి ఖండాయతులు. వయస్సు యాభై రెండు సంవత్సరాలు. వృత్తి జమీందారు. సాకీను గోవిందపురం. జిల్లా కటకం.

నేను శారియాని చంపలేదు. భగవాన్లు నా దగ్గర అప్పు పుచ్చుకున్నాడు. దావా వేసి అతడి ఆరెకరాల ఎనిమిది కుంటలుభూమీ డిక్రీ పొందాను. దావా కర్చుల కింద అతడి ఇల్లు పుచ్చుకున్నాను.

(సం.) రామచంద్ర మంగరాజు.

సరిగ్గా ఆ దేసమయానికి వొక వెర్రాడు అక్కడికి వచ్చాడు. నడుంకి వొక చింకిగుడ్డ చుట్టుకుని వున్నాడు. తల విరబోసుకున్నాడు. ఒళ్లంతా దూళీ బురదా పులుముకున్నాడు. చేతిలో వొక పాతకుండ పట్టుకున్నాడు. రావడంతోనే గంతు లేసి ఆడాడు వెర్రాడు. శారియా, శారియా అంటూ పాట పాడాడు.

వెర్రాణ్ణి చూసి వూళ్లోవాళ్లు హాహాకారాలు చేశారు. "ఒరే. భగవాన్లూ, నీనుదుట ఇదా రాసివుంది?" అంటూ జాలిగా అన్నారు.

మంగరాజుగారి మీద వెర్రాడి దృష్టిపడింది. వెంటనే ఆయన్ని కరవడానికి పరిగెత్తాడు వాడు. చౌకీదార్లు వాణ్ణి పట్టుకున్నారు. వాణ్ణి ఆపడం కష్టమైంది. దారోగా గారి హుకుం ప్రకారం వాణ్ణి కట్టేశారు.

దారోగా గారి విచారణ పూర్తయింది. మొత్తం ముప్ఫయి ఇద్దరు సాక్ష్యమిచ్చారు. అందులో నలుగుర్ని మాత్రం వుంచి తక్కిన వాళ్లని వదిలేశారు.

పొద్దు బారెడు మీదికి వచ్చాక, మంగరాజుగారిని అరదండాలు వేసి పట్టుకుపోయారు. చుట్టూ చౌకీదార్లు నడిచారు. మధ్య మంగరాజుగారు. తలమీద వొక గావంచా గుడ్డ వేసుకుని, తల వంచుకుని నడుస్తున్నారాయన. పెద్ద సంబరంలాగ వూళ్లోవాళ్లు బారులుతీరి నుంచుని చూస్తున్నారు. ముందు గోబరా జెనా నడుస్తున్నాడు. వెనక మున్సీగారున్నారు.

మంగరాజుగారి ఈ దురవస్థ చూసి వూళ్లో వాళ్లయినా విచారించారేమో సరిగ్గా చెప్పలేం. చంపా మాత్రం "మా బాబు గారో, మా బాబు గారో, మా బాబుగార్ని ఎక్కడికి తీసుకు పోతున్నారు? మా బాబు గారో!" అంటూ రాళ్లు కరిగేట్టు ఏడుస్తూ వీధిలో పరిగెడుతూ వుంటే వీధి వీధంతా ఇదయిపోయింది. మంగరాజుగారు రెండుమూడు సార్లు వెనక్కి తిరిగి ఆమెని వెళ్లి పొమ్మని చెప్పారు. దారోగా, మున్షీ చికాకుపడిపోతున్నారు. ఆమె వినిపించుకోలేదు. తలమీద ముసుగు లేదు. ఏడ్చి ఏడ్చి మతి తప్పి పోతున్నట్టుంది.

అలా ఆమె రెండు కోసులు వెళ్లింది చంపా. మంగరాజుగారికి వినిపించే నట్టు "కొట్టుగదిలో అన్నీ చెదలుపట్టిపోతాయి. ఎలకలు తినేస్తాయి. ఏందారి?" అంది. మంగరాజుగారు కొంచెం ఆగిపోయారు. పాతవాటి రెండు తాళంచెవులు ఆమెచేతిలో పెట్టేశారు. "అన్నీ జాగ్రత్త చెయ్యి. ఏమీ విచారించకు. వెళ్లు" అన్నారు.

తాళం చెవులు రెండూ జాగ్రత్తగా చంపా మొల్లో దోపింది. "మీరు భోజనం మానెయ్యకండి. ఉపవాసం వుండకండి" అంటూ చెప్పింది. మంగలి గోవిందం ఆమె వెంట వున్నాడు. ఇద్దరూ కలిసి ఇంటికి వచ్చేశారు. తిరిగి వచ్చేసే టప్పుడు ఆమె ఏడవడం ఎవరూ వినలేదు.

దారోగా సాహెబు థానా చేరుకుని సాక్షులు చెప్పిన సాక్ష్యం, మున్షీ రాసింది — మరొకసారి విన్నారు. మున్షీగారికి చెప్పవలసిన సలహాలుచెప్పి బాగా సవరణలు చేయించారు. సాక్షులికి సదుపదేశమూ చేశారు. తరవాత రిపోర్టుతో కూడా ముద్దాయిని కటకం మేజిస్ట్రేటుగారి దగ్గిరికి పంపించి వేశారు. దారోగాగారు రాసిన రిపోర్టు సరయిన నకలు సంపాదించాం, మీకు వినాలని వుంటే వినండి.

దారోగా గారి రిపోర్టు నకలు

ధర్మావతారా,

ఈ అక్టోబరు మూడోతారీకు ఉదయం ఎనిమిది గంటలప్పుడు నేను సాడలా కాలో వున్న నా థానా కచేరీలో కూచుని సర్కారువారి పని చేస్తున్నాను. మున్షీ చక్రధరదాసు నా కుడిపక్క కూచుని డయిరీ తయారు చేస్తున్నాడు. కనిస్టీబులు గులాం కాదరూ, హరిసింగూ డ్యూటీలో వున్నారు. ఆ సమయంలో సదరు థానా ఇలాకా, ఫతేపూరు పరషంత తాలూకా గోవిందపురం చౌకీదారు గోబరా జెనా

థానాలో హాజరై, సదరుతాలూకా సదరు గ్రామంలో శారియా అనే సాలీల స్త్రీని సదరు గ్రామం నివాసి రామచంద్ర మంగరాజు ఖూనీ చేశాడని రిపోర్టు చేశాడు.

ఈ రిపోర్టు అందడంతోనే ఈ సేవకుడు ఏలినవారికి రిపోర్టురాసి — సదరు ముద్దాయి వొక జమీందారు కావడం వల్లనూ, మంచి పీకలుతీసే మనిషి కావడం వల్లనూ, బుద్ధివినియోగించి తక్షణం రవానా అయి, సదరు నేరం జరిగిన స్థలానికి వెళ్లి — సదరు ఆసామీ ఇంట్లో కుక్కనయినా విడిచిపెట్టకండా సోదాచేసి — ఎంతో జాగ్రత్తగా ఆసామీని అరస్టు చేశాను.

తరవాత సదరు ఔరత్ శారియా శవమూ, దాని ఇంట్లోని సామానులూ, సదరు ఔరత్ తాలూకు వొక సపేద్ ఆవూ సదరు ముద్దాయి దగ్గిరినించి వెదికి స్వాధీనపరుచుకున్నాను. సదరు ముద్దాయి సదరు శారియాని కొట్టిన వెదురుకర్ర కూడా స్వాధీనపరచుకుని భద్రపరిచాను.

ముద్దాయి రామచందర్ మంగారాజు స్వయంగా వొక దుడ్డుకర్రతో కొట్టి శారియాని ఖూనీచేసిన షైనం నలుగురు సాక్షులు చెప్పిన సాక్ష్యం వల్ల రుజూవవుతున్నాది. సదరు సాక్షులు స్వయంగా తమకళ్లతో నేరం చూసిన సాక్షులు.

సదరు ముద్దాయి వొక బుర్రమారుపులమనిషి. ఒక ఇమాన్‌దార్ ముసల్మాను తాలూకు జమీందారీ దగాబాజీచేసి చంపాయించాడు. సదరు సంగతి నాలుగో నెంబరు సాక్షి సాక్ష్యం వల్ల రుజూవవుతున్నాది. సదరు ముద్దాయి సదరు ఖూనీ చేయుడం స్థిరపడింది. కనక హుజూరు వారి ఎదటికి హాజరు చేసుకుంటున్నాను. హుజూరు ఖోదావంద్; తల్లి దండ్రి. లోకానికి పాదుషా. రిపోర్టులోని తప్పులు క్షమించాలి. న్యాయవిచారణ జరిగించాలి.

10 తారీఖు, అక్టోబరు సం. 1831
దారోగా ఇనాఎత్ హుసేన్
థానా కేంద్రా పడా

షరా: వేరేజతపరిచిన కాగితం జాబితా ప్రకారం దొంగవస్తువులు హారిసింగు బంట్రోతు పూచీలో పంపడమైనది. ఈ విధంగా ముద్దాయి శారియాని ఖూనీ చెయ్యడంవల్ల ఆమె భర్త భగియా చందు బాగా వెర్రెత్తిపోయాడు. వాడు ప్రజల మీద విరగబడుతూ వుండడంచేతా, సదరు పిచ్చివాడికి వేరే దక్షత లేకపోవడం చేతా వాణ్ణి హుజూరు వారి దగ్గిరికి పంపించాను. హుజూరువారు అధికార్లు.
సన పదిహేను.

# 20

## వకీలు రామరామలాలు

కర్ర కటకటాల రిమైండుఖానా గదిలో వొకమూల గోడకి చేరబడి కళ్లు మూసుకుని వొక ఖైదీ కూచుని వున్నాడు. నలుగురు జవాన్లు కాపలా కాస్తున్నారు. పాపం, ఖైదీతో వొక మాటన్నా మాటాడేవారు లేరు. సుఖంగా వున్నప్పుడు అందరూ నేస్తాలే. డబ్బుకోసం అందరూ దాసులయి వుంటారు. సమయం వస్తే ఎవ్వరూ ఎవ్వరివారూ కారు.

మీరు చూస్తూనే వుంటారు, కొందరివాకిట్లో గడ్డి బలిసిపోయి వుంటుంది. కొందరి వాకిట్లో మనుషులు కిటకిటలాడుతుంటారు. దశ అలా చేస్తుంది. ఒక ఇంగ్లీషుకవి చెప్పాడు :

“ స్నేహితులు లేని బతుకూ, సూర్యుడులేని లోకం వొకటే. ”

అని. అంచేతనే మనిషి స్నేహితుల్ని విడిచిపెట్టి వుండలేడు.

“ నమస్కారం మంగరాజుగారూ! ”

ఖైదీ తుళ్ళిపడి చూశాడు. ఇంతకి ముందు అతడు ఎన్నో నమస్కారాలు విని వున్నాడు. కాని ఈవేళ ఈ నమస్కారం విని తన బొందెలో ఏదో ప్రాణం లేచి వచ్చినట్టనిపించింది తనకి. ఖైదీ పల్లెత్తి మాటాడకుండా, నమస్కారం చేసిన వ్యక్తిని నఖశిఖపర్యంతం చూస్తూ వుండిపోయాడు. నమస్కారం చేసిన వ్యక్తి విశాల మూర్తి. మోకాళ్లుదాకా వేలాడుతున్నాయి చేతులు. వదులుచేతుల గళ్ళకోటు, అక్కడక్కడ సిరామరకల్తో, మోకాళ్లు దాటి వేలాడుతోంది. మూరెడు వెడల్పూ, ఇరవై నాలుగు మూళ్ళ పొడవూ కల జరీ తలపాగాగుడ్డతో చుట్టిన తలపాగా నెత్తి మీద వుంది. ముప్పువ్వులంచు మణియాబంది ధోవతీ, కాళ్ళకి పువ్వులు చెక్కిన మహారాష్ట్రం చెప్పులూ వున్నాయి. రెండుపక్కలా కేబీసుగా వేసుకున్న జరీవాణీ గుండెమీద క్రాసుమార్కులా వుంది. చెవుల్లో రెల్లుకలందోపి వుంది. మీసాలు బొద్దుగా వున్నాయి. బుగ్గలో బుగ్గెడు తాంబూల ముంది.

ఆ మూర్తిని చూసి ఆశా, భరోసా, ఆశ్చర్యమూ, సందేహమూ ఖైదీ మనస్సుని కలవరపరిచాయి. నోటమాట పెగల్లేదు. తెలిసిన మనిషిలాగ, బాగా పరిచయం వున్నవాడిలాగ నమస్కారం చేశాడు. ఎవరీవ్యక్తి? మా అనుమాన మేమి

టంటే ఆయన వొక బంధువయి వుంటాడని. చాణక్య నీతిశాస్త్రంతో మాకు బాగా పరిచయముంది. అంచేతే ఈ మీమాంసకి సాహసిస్తున్నాము.

రాజద్వారే స్మశానే చయ స్తిష్ఠతి సబాంధవః.

అంటే — రాజద్వారంలో అనగా కచేరీలో. స్మశానంలో అనగా వల్ల కాట్లో. తిష్ఠతి అనగా ఉంటారు. ఇత్యర్థః. సబాంధవః అనగా — వకీళ్ళు కచేరీ లోనూ, నక్కలు వల్లకాట్లోనూ వుంటారు. వీళ్లే బాంధవులు. బతికివున్నవాళ్ళకీ, చచ్చిపోయినవాళ్ళకీ భేదం మాత్ర ముంటుంది.

ఖైదీ ఎంతోసేపు అలా తెల్లమొహం వేసి చూస్తూ వుండనవసరం లేక పోయింది. కాపలా కాస్తూ వున్న బంట్రోతు గోపీసింగు ఆయన్ని పరిచయం చేశాడు. "చూడండీ వీరిపేరు రామరామలాలు. కచేరీ అంతటికీ పెద్ద వకీలు. వీరిని బాగా పట్టండి. దొరగారికి వీరిమాటమీద మంచిగురి. వీరెంత చెపితే అంత."

వకీలు బాబుగారిగుండె సంతోషంతో మరింత పొంగిపోయింది. ఒకసారి ఛాతీ చూసుకునీ, రెండుసార్లు భుజాలు చూసుకునీ, మూడుసార్లు గొంతుక సవ రించుకునీ బాగా పరిచయమున్న మనిషిలాగ మాట్లాడా డాయన.

"మంగరాజుగారూ, వ్యవహారం ఇంత ముదరబెట్టేశారు. ముందు నాకు కబురు చెయ్యలేకపోయారా? లోకంలోని యావత్తు వ్యవహారాలూ నా దగ్గిరికి వస్తాయి. ఊమ్మొయ్యడానికి కూడా నాకు అవకాశ మివ్వరు జనం. అయినా మీపేరు వినడంతోనే పరుగెత్తుకు వచ్చాను."

మంగరాజుగారు పెద్ద నిట్టూర్పు వదిలేసి, బాంౡమని ఏడ్చేశారు. చేతులు జోడించి శిరస్సు నేలకి తగిలించారు.

వకీలు: లేవండి, లేవండి. ఇప్పటినించీ అంతా నాదీ భారం. మీరు నిశ్చింతగా కూచోండి. మరేం ఫరవాలేదు. నిన్న రాత్రి దొరగారి బంగాళాకి వెళ్ళాను. ఎన్నో వ్యవహారాల ప్రశక్తి వచ్చింది. మీసంగతి నిన్న తెలిసివుంటే ఇవాళ ఏం చేసేవాణ్ణో మీకే తెలిసేది. మీ కేసు వివరాలు నేను అప్పుడే తెలిసేసుకున్నాను. అంతా అబద్ధం. అంతా కంజాయింపు. అంతా మోసం. వాడున్నాడే ఆదొంగమొహం దారోగా, వాడే ఇదంతా చేశాడు. వాడిదే ఈపితలాటకమంతా. ఆ దారోగాపని ఏం చేస్తానో చూద్దురుగాని. వొక్కసారి దొరగారితో మాట్లాడ నివ్వండి.

మంగరాజు: (చేతులు జోడించి) వకీలు బాబుగారూ, నేనేం చేసేది? నన్ను బతికించండి. నాకు ప్రాణదానం చెయ్యండి. మీరు నా ధర్మతండ్రులు. నేను మీ పుత్రాణ్ణి. పుత్రబుద్ధి నాది. మీదే భారం.

వకీలు: మీరేమీ చెప్పనక్కరలేదు. నాకన్నీ తెలుసు. అన్నీ చేస్తాను. అయితే విశేష మేమిటో తెలుసా? కేసు పెద్దది. బాగా దిట్టమైంది. ఉరికేసు. ముందే జాగ్రత్తపడకపోతే వురి తప్పదు. పైగా ఆ దొంగమొహం దారోగా వదల కండా వెంటాడుతున్నాడు. మీరు బుద్ధిమంతులు. మీకు అధికంగా చెప్పనక్కర లేదు. కచేరీ వ్యవహారాలన్నీ మీకు కంఠోపాఠం. కొంచెం ఖర్చుపెట్టాలి. ఖర్చుకి జంకితే సాగదు. పిడికిలి విప్పాలి. దారోగా ఏమిటి చెప్పుకు తిరుగుతున్నాడో విన్నారుకదా! మరి మీరే ఆలోచించండి.

మంగరాజు: (ఏడుస్తూ) అయ్యా, ఇందులో ఎంత ఖర్చవుతుంది? నా చేతిలో ఎర్రని ఏగానీ లేదు. వెనకాల నాఅన్నవా డెవ్వడూ లేడు. గుమాస్తా నౌకర్లూ వస్తే, దారోగా నా దగ్గిర చేరనివ్వడం లేదు. నన్ను విడిపించెయ్యండి ఇంటికి వెళ్లాక మీకు వెయ్యి రూపాయ లిచ్చుకుంటాను.

గోపీసింగు: మంగరాజు గారూ, మీరు ఈ బుద్ధి వినియోగించే జమీందారీ సంపాదించారా? ఇక్కడ కొనడం, అమ్మడం, ఏముందికనక, అరువు బేరాలాడు తున్నారు? ముద్దాయి రక్షించమంటాడు. వకీలు డబ్బిప్పించమంటాడు. డబ్బు ముందు పెట్టండి. తరవాత మాట్లాడండి. రూపాయిలూ, రూపాయిలు పైకి తియ్యండీ, కేసు గెలవాలంటే. వకీలుగారూ, ఖైదీతో మరి మాట్లాడనివ్వకండీ! రెండుమాటలు మాట్లాడనిమ్మని చెప్పారు నాజరుగారు. నేను వొక్కణ్ణే కాను కదా! మేం నలుగురం.

వకీలు: వింటున్నారా? మంగరాజుగారూ! సామాన్యమయిన విషయంకాదిది. బంట్రోతు దగ్గిరనించి అధికారిదాకా అందరినీ వొప్పించుకు రావాలి. వ్యవహారం ఎంత గట్టిదంటే, మరో వకీలయితే నగదు పదివేలు పుచ్చుకుని కూడా సాహసించ లేడు. నేను కనక ఇందులో చెయిపెడుతున్నాను. మీరు నన్ను ఎప్పుడయితే ధర్మ తండ్రన్నారో, మరి మిమ్మల్ని ముంచేసుకుంటానా? సరే, ఈ కేసులో ఎంతసొమ్ము ఖర్చయినా నేను పెడతాను. కాని, ఇందులో పదివేలుకి దమ్మిడీ తక్కువయితే సాగదు. అంచేత మీ జమీందారీ నాకు వడ్డీ భోగ్యం దండన షరతుతో తనఖా దస్తావేజు రాసెయ్యండి. డబ్బంతా ఇప్పుడే ఖర్చయిపోతుందని ఏమీలేదు. కేసు ఆఖరయాక దమ్మిడీ పైసల్తో మీకు అప్పగిస్తాను.

మంగరాజుగారు బుగ్గకింద చెయ్యిపెట్టుకుని కొంచెపు ఏదో ఆలోచించారు పాము కాళ్లు పాముకే కనిపిస్తాయి. వడ్డీభోగ్యం తనఖా దస్తావేజు విషయం మంగ రాజుగారికి బాగా తెలుసు. అయితే మనిషి కొట్టుకుపోతూ వున్నప్పుడు, పుల్లితోక దొరికినా వదిలి పెట్టడు.

వకీలు రామరామలాలు పనిపడ్డప్పుడు మాంచి చురుకుగా వుంటాడు. రెండు గంటల్లో స్టాంపులు కొనేసి, దస్తావేజు చిత్తూ, సాఫూ పూర్తిచేసేసి, సబురిజిస్ట్రారు ఆఫీసులో రిజిస్టరు చేయించి వేశారు.

వకీలుగారు చివర్న చెప్పారు: "మంగరాజుగారూ, మీరు నిశ్చింతగా రిమాండులో కూచోండి. నేనున్నాను. మీకే విచారమూ లేదు.

# 21

## కటకం సెషను జడ్జికోర్టు

ఇవాళ సెషన్సు కోర్టులో బాగా గందికగా వుంది. కచేరీవాళ్లు మొదలుకుని, బజార్లో తిరిగే వాళ్ల వరకూ అందరూ చూసిందికి పరిగెడుతున్నారు. ఎక్కడన్నా పోటీ పల్లా* అయితే గాయకులు వేషాలు వెయ్యకముందే జనం ఎలా వచ్చి కూచుంటారో, అదిగో అలాగే వొకళ్ల తరవాత వొకళ్లు వచ్చి కచేరీ నిండి పోతున్నారు. కావలసినంత సందడిగా వుంది. గోలగోలగానూ వుంది. ఇద్దరు బంట్రోతులు "చూప్!" "చూప్!" అని అదిలిస్తూ మరింత గోలచేస్తున్నారు.

పల్లెటూరునించి వొక మోతుబరి జమీందారు ఖూనీ కేసులో సెషన్సుకి వచ్చాడు. అయిదు రోజులయి విచారణ జరుగుతోంది. ఇవాళ ఆఖరురోజు. కేసు ఇంకా ఆరంభం కాలేదు. రేపు బుధవారం. సీమకి టపా వెళ్తుంది. దొరగారు "మై డియర్ లేడీ," అని అరంభించి త్వరత్వరగా ఉత్తరం రాసేస్తున్నారు. క్రిమినలు కేసు వచ్చిందంటే జడ్జిగారు ఇంగ్లీషు పత్రిక విప్పడమో, ఉత్తరం రాసు కోడమో మామ్మూలు. పనంతా పేష్కారే చేసేసే వాడు. దొరగారు వాజ్మూలం కాగితాలమీద వొక్కొక సంతకమూ గీసెయ్యడమూ, జడ్జిమెంటు వినిపించెయ్యడమూ తప్పకుండా చేసేవారు. ప్రస్తుతం అలా కాదు. జడ్జిదొరగారు ప్రతీదీ స్వహస్తాలతో రాయవలిసిందే. ఏమంటే సాక్షులు చెప్పిందీ, జడ్జిమెంటు అంతా ఇంగ్లీషు మయం

* పల్లా: ఒడిశాలో వొక నాట్య విశేషం.

ఇవ్వడు. కాని మేం ఒడియా వాళ్లం. పాఠకులూ వొడియా వాళ్ళే. కనక అవన్నీ మేము తర్జుమా చేసి రాయవలసి వస్తుంది.

దొరగారు ఇంత వుమ్మేసి, కవరు అంటించేసి, జంట్రోతుచేత పోస్టాఫీసుకి పంపించేశారు. తరవాత అన్నారు:

"ఉవెలు బాబూ, కేసు ప్రవేశపెట్టండి" అని.

సర్కారు తరఫు వకీలు ఈశానచంద్రసర్కారూ, పోలీసు దారోగా ఇనాయెత్ హుసేనూ, ముద్దాయి వకీలు రామరామలాలూ హాజరయారు.

ఖైదీ రామచంద్ర మంగరాజు కర్ర కటకటాల బోనులో చేతులు జోడించి నుంచున్నాడు. జడ్జీగారి కుడిపక్క కుర్చీలో కూచుని, హోలీబైబిలు పట్టుకుని డాక్టరు దొరగారు సాక్ష్య మిచ్చారు —

"నా పేరు ఏ. బి. సి. డి. డగ్లసు. తండ్రిపేరు ఇ. జి. ఎఫ్. హెచ్. డగ్లసు. జాతి ఆంగ్లేయులు. వయస్సు నలభై సంవత్సరాలు. ప్రస్తుత కాపురం కటకం.

నేను కటకం జిల్లా సర్జనుగా వున్నాను. గత ఎనిమిదో తేదీ ఉదయం ఏడు గంటల ముప్ఫయి నిమిషాలప్పుడు సర్కారు పోస్టుమార్టము గదిలో శారియా శవం నాచేత పోస్టుమార్టము ఎగ్జామినిషను చేయబడింది. చౌకీదారు గోబరాజెనా పోలీసు చెప్పిన ప్రకారం ఆ శవం శారియాదని చెపుతున్నాను. నేను బాగా పరీక్ష చేశాను. అంచేత గట్టిగా చెప్పగలను. ప్రాణహాని కలిగించే ఎవ్విధమయిన సాధనంచేతా ఆమె చావు జరగలేదు. దీర్ఘకాలం ఉపవాసం వుండిన్నీ, మానసికంగా బాధ పడిన్నీ ఆమె చనిపోయిందని నాకు తగినంత ఆధారం కనిపించింది."

జడ్జీగారు క్రాసు చేశారు. దానికి సాక్షి ఇంకా ఇలా చెప్పాడు:

"శవం శరీరంమీద ఎవ్విధమైన దెబ్బలూ కనిపించలేదు. ఆమె శరీరంలో రక్తం శుష్కించిపోయింది. హృదయంలో రక్తం ఉన్నట్టే లేదు. జీర్ణకోశం శూన్యంగా వుంది. మలమూత్రాల నాళాల్లో పదార్థమున్నట్టే అవుపించలేదు. ఈ కారణా లన్నిటివల్లా ఆమె ఉపవాసం మూలానే మరణించినట్టు తెలుస్తోంది."

సర్కారు వకీలు క్రాసు చేశాడు. దానికి సాక్షి ఇలా చెప్పాడు:

"అవును, శవం వీపుమీద మూడుచోట్ల గుర్తులున్నట్టు గోబరాజెనా మాకు చూపించాడు. నేను బాగా పరీక్ష చేసి చూశాను. అవి దెబ్బలు గుర్తులు కావు.

ప్రాణం పోయాక వేడి ఇనుంతోనో, మరేదయినా అగ్నిపదార్థంతోనో వాతలు పెడితే అయే గుర్తులవి.”

మళ్లీ సర్కారు వకీలు క్రాసు చేశాడు. సాక్షి ఇలా చెప్పాడు:

“లేదు, నేను స్వయంగా కత్తి పట్టుకుని శవం కొయ్యలేదు. నేటివు డాక్టరు గౌరాంగకరా, కంపౌండరు వాసుదేవ పట్నాయకూ నా ఎదట శవం కోశారు.”

మళ్లీ సర్కారు వకీలు క్రాసు చేశాడు. సాక్షి కొంచెం చిరాకుపడుతూ చెప్పాడు:

“ఇవాళకి పది సంవత్సరాల ఆరుమాసాలై సివిలుసర్జను ఉద్యోగం చేస్తున్నాను. మొదట మిలిటరీ డిపార్టుమెంటులో ఉండేవాణ్ణి. నేను లండను కాలేజీలో చదివి డాక్టరు పరీక్ష ప్యాసయాను”

మళ్ళీ క్రాసులో సాక్షి ఇలా చెప్పాడు:

“మొదట నేను హాస్పిటలు అసిస్టంటుగా వున్నాను. బర్మాయుద్ధంలో నాకు ప్రమోషనయింది.”

జడ్జీగారు ముద్దాయి వకీలుకేసిచూసి అన్నారు: “తుమారా కుచ్ సవాల్ హై?”

ముద్దాయి పక్షం వకీలు రామరామలాలు డాక్టరు దొరగారికేసి చూస్తూ అడిగారు:

“ఊఁ, చూడండీ, కోర్టువారి ఎదటవున్న ముద్దాయిగారి దుడ్డుకర్ర గుర్తులు శవం వీపు మీద ఏమన్నా కనిపించాయా?”

జడ్జీ: నాన్ సెన్సు, అవుర్ క్యా పూఛ్ నేకో హై పూఛో.”

వాది వకీలు సాక్షిని మళ్లీ అడిగాడు:

“సరే, శారియా ఉపవాసముండి చచ్చిపోయిందని మీరు అంటున్నారు కదా! అయితే, ఆమె తనంతట తాను తిండి మానేసిందా? ముద్దాయి దాన్ని తిండి మానిపించేశాడా?

జడ్జీ: కుఛ్ బాత్ నహీఁ. గో ఆన్, చలో చలో.

ముద్దాయి వకీలు మళ్లీ అడిగాడు:

“ఊఁ— శారియా ముద్దాయి పెరట్లో చచ్చిపోయిందనడానికి ఏమిటండీ రుజువూ?

జడ్జీగారు కోపం ఆపుకోలేకయారు.

"దేఖో, తుమ్ ఐసా బేహుదా సవాల్ కరోగే తో, తుమారా ఒకాలతీ కేన్సిల్ కర్దేగా."

వకీలు : హుజూర్ ? ఖోదావంద్ ! — కన్న తల్లిదండ్రులు — దునియాకా బాద్షా

ముద్దాయి దగ్గిర వాజ్మూలం పుచ్చుకున్నాక, ఉభయపక్షాల వకీళ్లూ ఆర్గ్యుమెంట్సు ప్రారంభించారు. ఓ, వొకరొకరు మించిపోయారు. పక్కా రెండున్నర గంటలు వాగ్యుద్ధం జరిగింది. ఈ అవకాశం తీసుకుని జడ్జీదొరగారు బారెడు పొడవు ఇంగ్లీషు పేపరు చదివేసి, టిఫిను ముగించేసుకు వచ్చారు. అధికారి ఆపక పోయి వుంటే వాగ్యుద్ధం అలా ఎన్నిగంటలయినా సాగేదే.

అధికారి ఆజ్ఞప్రకారం శిరస్తాదారు వివరంగా కేసు జడ్జిమెంటు తయారు చేశాడు. అదంతా పన్నెండు తావులు పట్టింది. పూర్తిగా అది తయారుచేసి ప్రకటించేసరికి మూడు దినాలు పట్టింది. మేము ఆ జడ్జిమెంటు అసలుకి సరయిన నకలు సంపాదించాం. కాని అన్నివిషయాలూ మొదటినించీ మేము క్లుప్తంగా చెప్పుకు వస్తూ వుండడంచేత జడ్జిమెంటులో ఏమాత్రం వివరిస్తే అన్నివిషయాలూ మీరు బాగా తెలుసుకోగలుగుతారో, ఆ మాత్రమే కింద వివరిస్తున్నాము.

క్రిమినలు సెషన్సు జడ్జికోర్టు. హెచ్. ఆర్. జేక్సన్ ఎస్క్వైర్, సెషన్సుజడ్జి. మిల్కియత్ శ్రీయుత ఈస్టిండియాకంపెనీ బహద్దర్, ఒడిశాఖండం, జిల్లా కటకం.

పిర్యాది : సర్కారు బహద్దర్ వారు.

ముద్దాయి : రామచంద్ర మంగరాజు. సాకీను గోవిందపురం. ప్రగనా అసురేశ్వరం. జిల్లా కటకం.

కేసు : శారియా అనే వొక సాలె స్త్రీని హత్యచేయడమూ, ఆమె ఇంట్లోంచి వస్తువులు దోపిడీచేసి పట్టుకుపోవడమున్నూ.

ఫయిలులోని అన్నివిషయాలూ చూశాకా, ఉభయపక్షాలూ ఇచ్చిన వాజ్మూలాలూ వకీళ్ల క్రాసు పరీక్షలూ విన్నాకా ఇది పోలీసువారు తెచ్చిన కేసని వ్యక్తమయింది.

జిల్లా మాజస్ట్రేటుగారని ముద్దాయిమీద నరహత్యా నేరం ఆరోపించి కేసు సెషన్సుకి పంపారు. ముద్దాయి మీద నేరం రుజువు చెయ్యడం కోసం పోలీసులు ఎనమండుగురిచేత సాక్ష్యం ఇప్పించారు. నేను సాక్షుల్ని చాలా జాగ్రత్తగా విచారించాను. వాళ్లు చెప్పినవన్నీ సావధానంగా విన్నాను. ఉభయపక్షాల వకీళూ

సాగించిన ఆర్గ్యుమెంట్సు బాగా విన్నాను. అన్నీ విచారించి తుదకి ఈ కింది నిశ్చయానికి వచ్చాను.

పోలీసులు చెప్పిన ప్రకారం ముద్దాయి దుడ్డుకర్రతో కొట్టి శారియాని హత్య చెయ్యలేదు. చాలా దినాలు తిండి మానేయడమూ, మానసికంగా విచారం పట్టుకోడమూ ఆమె చావుకి కారణం. మేమిలానమ్మడానికి కారణం ఏమంటే —

ఒకటి: ఖూనీకేసులో ముఖ్యమయిన సాక్షి సివిలుసర్జను స్పష్టంగా చెప్పారు. "శవం శరీరం మీద ఎవ్విధమయిన దెబ్బల గుర్తులూ లేవు" అని.

రెండు: సాక్షులు చెప్పిన సాక్ష్యంబట్టి ఈ కేసు పూర్తిగా బనాయించి తెచ్చిందని స్పష్టపడింది.

మొట్టమొదట రిపోర్టుచేసిన గోబరా జెనా చౌకీదారే ఈకేసు కల్పించడంలో సూత్రధారుడని మా నమ్మకం. వాడి మొదటి రిపోర్టూ, చివరఇచ్చిన సాక్ష్యమూ— రెండూ పోల్చిచూస్తే స్పష్టంగా తెలుస్తుంది — అబద్ధం నిజంచెయ్యడానికి మొదటి నించీ వాడు ఎంత ప్రయత్నించిందీన్నీ. కచేరీలో వేసినప్రశ్నల్లో తప్పించుకోలేక వాడు దొరికిపోయాడు.

మంగరాజు దుడ్డుకర్రతో శారియాని కొట్టడం కళ్లతోచూశామని సాక్ష్యమిచ్చిన బనా జెనా, ధొకెయి జెనాలు ఇద్దరూ గోబరా జెనా బంధువులు. వాళ్ల ఇల్లు ముద్దాయి ఇంటికి రెండు కోసులు దూరంలో వుంది. అర్ధరాత్రి వాళ్లు మేలుకుని వచ్చి, ముద్దాయి చేసినపని కళ్లతో చూశారనడం అసంభవం.

మూడు: నేరం జరిగిందన్న స్థలం ప్లాను పోలీసువాళ్లు దాఖలు చేశారు. ముద్దాయి నుంచుని శారియాని కొట్టాడన్నస్థలానికీ, సాక్షులు నుంచుని చూశామన్న చోటికీ మధ్య మూడు వరసల ఇళ్లు వున్నాయి. అంచేత అక్కడినించి కంటితో చూశారనడానికి వల్లకాదు. అంతేకాక క్రాసుపరీక్షలో సాక్షులు వొకరుచెప్పింది వొకరిదాంతో పొందకండా వుంది. అంచేత వారి సాక్ష్యం వొకటీ నమ్మదగింది కాదని రుజువైంది.

ఈ దౌర్భాగ్యులు పల్లెటూరి అమాయకులు. అంచేత పైవాళ్ల దుర్బోధలో సులువుగా పడిపోయి, దాని వల్ల వచ్చేఫలితం తెలుసుకోలేకపోయినారు. గోబరా జెనా అనేక మార్లు అసత్యం చెప్పడంచేత వాణ్ణి క్రిమినలు కింద జమకట్టాను.

ముద్దాయి గత చరిత్ర చెడ్డదని రుజువు చెయ్యడంకోసం పోలీసులు కొంత మందిచేత సాక్ష్యం చెప్పించారు. ముద్దాయి ఫరాయిసొమ్ము కాజెయ్యడం కోసం

ఎంత కుటిల బుద్ధయినా ప్రయోగించగలడని దానివల్ల గ్రహించాను. అయితే అతడు ఎవరిమీదా ఎప్పుడు చెయిచేసుకున్నట్టు రుజువు కాలేదు. అంచేత ఇలాంటి వ్యక్తి ద్వారా నరహత్య జరుగుతుందనడానికి వల్ల కాదు. అంతేకాక, శారియాని తాను హత్యచేయవలసినంత కారణమూ మాకు కనపడలేదు.

చచ్చిపోయిన శారియా తాలూకూ, భగియాచందు తాలూకూ పన్నెలూ, కండెలూ, రాట్నమూ, పంటికర్రలూ మొదలయిన నేతపనిముట్లూ, గిన్నెలూ, ముంతలూ — ముద్దాయి ఇంట్లోంచి పోలీసు వాళ్లు పైకి తీశారు. ఐతే ముద్దాయి సివిలు కోర్టులో దాఖలుచేసిన జాబితా ప్రకారం, భగియాచందు ముద్దాయి దగ్గిర తన ఆరెకరాల ఎనిమిదికుంటలు భూమి వడ్డీ భోగ్యం తనఖాపెట్టినట్టూ, ఆ దావాలో దావాఖర్చులు మింజుమలె ముద్దాయి భగియాచందు ఇల్లూ, ఇంట్లోని వస్తువులూ వేలంలో కొన్నట్టూ తెలుస్తోంది.

నిజానికి ఆ తనఖా దావా చాలా మోసంచేసి బనాయించిందే. అయితే ప్రస్తుతం ఈ కేసులో దానికేమీ సంబంధం లేదు.

భగియాచందు తాలూకు ఆరెకరాల ఎనిమిది కుంటలు ఇనాం భూమి. దానికి శిస్తులేదు. ఆభూమీ, అతడి ఇల్లూ, మిగిలిన ఆస్తీ యావత్తూ మంగరాజు అపహరించాడు. ఆ దుఃఖంతో భగియాచందు పిచ్చెత్తిపోయాడు. శారియా ప్రాయోపవాసం చేసి ప్రాణం వదిలేసింది. ఇదే మా సంపూర్ణ విశ్వాసం. కాని అంతమాత్రం చేత ముద్దాయి మీద ఖూనీనేరం మోపడానికి వల్ల కాదు.

ముద్దాయి వాకిట్లోంచి నెత్త అనే ఆవు పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. ఆవు భగియాచందు దని ఉభయపక్షాలూ అంగీకరించారు. తక్కిన వాటితోపాటు ఆవున్నూ దావా ఖర్చులకింద వేలంలో కొన్నానని ముద్దాయి చెపుతున్నాడు. కాని ఇది పూర్తిగా అబద్ధం. ఏమంటే అతడు వేలంలో పాడిన వాటి జాబితా నకలు సివిలుకోర్టులోంచి ఈ కోర్టులో దాఖలుచేశారు. ఆవు సంగతి అందులోలేదు.

మోసంచేసి పరధనం కాజెయ్యడంలో ముద్దాయి ధురంధరుడని తగినంత రుజువుంది. అతడు మొదట సామాన్య వ్యక్తిగా వుండేవాడు. కపటోపాయం అవలంబించి చాలా గడించాడు. ఊళ్లో జమీందారయాడు. మోతుబరీ అయాడు. భగిచందు దుర్బలుడు. మంగరాజుని ఎదిరించి ప్రతీకారం చెయ్యలేడు. అంచేత దురాశ నెత్తికెక్కి భగిచందు ఆవు మంగరాజు అపహరించాడు. ఈ కారణం వల్ల నేను ఈ కింది తీర్పు ఇస్తున్నాను.

ముద్దాయి రామచంద్రమంగరాజు మీద మోపబడిన ఖూనీకేసు రద్దు చేసి అతణ్ణి విడుదల చేస్తున్నాను. నెత్త అనే పేరుకల ఆవు అపహరించిన నేరానికి అతణ్ణి ఆరుమాసాలు కఠినశిక్ష విధిస్తున్నాను. అయిదువందలు రూపాయిలు జరిమానాకూడా వేస్తున్నాను. జరీమానా వసూలు కాకపోతే మరిమూడు మాసాలు ఖైదుశిక్ష అనుభవించాలి.

మే 17 తారీకు. సం. 1832
హెచ్. ఆర్. జేక్సన్
సెషన్ జడ్జి

కోర్టు ముగిసింది. జడ్జీదొరగారి బగ్గీ వెళ్లిపోయింది. నలుగురు బంట్రోతులు వొక ఖైదీని అరదండాలు వేసి నాజరు ఖానానించి అరస్టువారంటు పట్టుకుని జైలుకి బయల్దేరారు. వకీలు రామరామలాలు కచేరీ ముందున్న మర్రిచెట్టు మొదట కూచుని వున్నాడు. ఖైదీమీద దూరంనించే ఆయన చూపుపడింది. వెంటనే గట్టిగా అన్నాడాయన :

చూశారా, మంగరాజుగారూ! ఇవాళ దొరగారితో మీ కోసం ఎలా పోట్లాడానో చూశారు కదా! ఉరితప్పించేశాను. మరేమీ విచారించకండి. జంకూ కొంకూ లేకండా జైల్లోకి వెళిపోండి. ఒక బుంగ నూనెకి గానుగతిప్పి వుంటారో లేదో మీరు, సుప్రీం కోర్టులో అపీలుచేసి విడిపించేస్తాను మిమ్మల్ని.''

మాకు నిజమయిన భోగట్టా వచ్చింది, అపీలు కోసం ఎవ్విధమయిన ప్రయత్నమూ జరగ లేదు.

## 22

## గోపిసాహు దుకాణంలో

విరూపానదీ తీరం. గోపాలపురం రేవు. ఇదే కటకం వెళ్లేదారి. జనం ఇక్కడే నదిదాటి వెళతారు. లోగడ గోపాలపురం వూరు ఇక్కడే వుండేది. వెనకటి భాద్రపదమాసం అష్టమి పెద్ద వరదల్లో వూరంతా కొట్టుకు పోయింది. వూరేమోపోయింది. పేరు మాత్రం నిలిచివుంది. రేవు మీద పెద్ద మర్రిచెట్టుంది. చెట్టుమొదట గోపిసాహు దుకాణం. దుకాణం ఇల్లు ఏడుమూళ్ల పొడవూ అయిదు మూళ్ల వెడల్పూ వుంది. రెండు గదులవి. ఒకటి మిద్దె. రెండోది మిద్దెకాదు.

దుకాణం ముందు రెండుమూళ్ల పొడవు గడప. దైవికంగా ఎవరన్నా బాటసార్లు వుండిపోతే ఆ మిద్దలేని రెండో గదిలో వంట చేసుకునేవారు.

గోపి ముసిలయిపోయాడు. వ్యవసాయం పనికి సామర్థ్యంలేదు. గత ఏడు ముసిల్ది కళ్లు మూసేసింది. అవాళనించే అతడి నడుం విరిగిపోయింది. కొడుకులు ముసిలాణ్ణి పని చెయ్యనివ్వరు. గోపి వూరికే కూచునేరకం కాదు. కూచోడంకంటే కదలడం మంచిది. సంవత్సరంనించి పంట కొంచెం నయంగా వుంది. పగలు గడియ పొద్దెక్కాక, రెండు మెతుకులు నోట్లో వేసుకుని దుకాణానికి వచ్చేస్తాడు గోపి. పొద్దు బాగా వాలిపోయాక, పొడవాటి గొట్టం తాళం దుకాణం గదికి వేసేసి ఇంటికి వెళ్లిపోతాడు. దుకాణం ఇంటికి అరకోసు దూరంలో వుంది. దుకాణంలో బియ్యమూ, పప్పూ, ఉప్పూ, అటుకుళ్లూ, పొగాకూ వుంచేవాడు గోపి. సాయంత్రం ఇంటికి వెళ్లిపోయేటప్పుడు డబ్బులూ అవీ వొక బుట్టలో పెట్టుకుని ఇంటికి పట్టుకు పోయేవాడు.

గోపి వూళ్లో వాళ్లతో అనేవాడు: "నేను ఇప్పుడిప్పుడు ఖర్చుదార్నయి పోతున్నాను. సాయంకాలం ఆవగింజంత నల్లమందు వెయ్యకపోతే రాత్రి నిద్రపట్ట కండా వుంది. నల్లమందు వేసుకుని, ఇంత అటుకుళ్లగుండో, ఇంత మరమరాలగుండో నోట్లో వేసుకోపోతే సాగదు. పొగాకు పిసర అలవాటు వుండనేవుంది. అయితే ఈ ఖర్చంతా నా సొంతగడనలోంచే చేస్తాను. దుకాణం పెట్టడం కోసం కొడుకులు మదుపు పెట్టిన అర్ధరూపాయి మూలధనంలోంచి కానీ, పరకా లాభం వస్తుంది. దాంతోనే గడుపుకుంటున్నాను. మదుపులో చెయ్యిపెట్టడం మాత్రం జరగదు."

ఆశ్వయుజ మాసం రోజులు. పగలంతా మేఘాలు పరిగెడుతూనే వున్నాయి. రెండుమూడు జల్లులు కురవనూ కురిశాయి. చిటపటా చినుకులు కురుస్తూ వుంటే రహ దారి బురద బురద అయిపోయి జుర్రుపాములు వేస్తాయి. బాటసార్లెవళ్లూ లేరు. ఇంకా పొద్దు బారెడుంది. కాని మేఘంవల్ల చీకటికమ్ముకు వస్తున్నట్టు కనిపిస్తోంది.

గోపి దుకాణంలోకి చూసి అన్నాడు: "ఇవాళ ఉదయాన్నే ఎవళ్ల మొహం చూశానో, ఒక అధలా పొగాకు రెమ్మయినా అమ్మకం కాలేదు."

గోపి దుకాణం సామానంతా వొక బుట్టలో పెట్టాడు. గావంచాగుడ్డ తలకి చుట్టుకున్నాడు. అరుగుమీదికి వచ్చి కూచున్నాడు. ఆకాశంకేసి చూసి తనలో తాను అనుకున్నాడు. "పొద్దుగుంకలేదు."

నదిరేవుకేసి చూశాడు. ఎవరయినా బాటసార్లు దాటివస్తున్నారేమో అని తదేకదృష్టితో రేవుకేసి చూస్తు భజనపాట ఆరంభించాడు:

కాలమంతా గడిచిపోతుందోయ్
వ్యర్థముగ గడిచింది కాలం
    శ్రీహరిని భజియింప లేదోయ్
ఆయువంతా ఏరులాగే
    ఆగకండా పారతోందోయ్
కాలసంద్రంలో కలిస్తే
    మళ్లీ రాదోయ్, మళ్లీ రాదోయ్.
విషయపంకంలోనె మునిగీ
    పగలు కాదోయ్ రాత్రి కాదోయ్
నువ్వు వచ్చిన మొదటితావూ
    రామరామా మరచినావోయ్
దీనజన బాంధవుడు కలడోయ్
    అతడి పదములె నాకు శరణోయ్
కాలమంతా గడిచిపోయిందోయ్!

"ఏయ్, దుకాణంతాతా! ఉండిందికి స్థలం దొరుకుతుందా?"

గోపీ తుళ్లిపడి చూశాడు. దుకాణం ముందు ఇద్దరు బాటసార్లు నుంచుని వున్నారు. ఒకడు పురుషుడు, రెండో ఆమె స్త్రీ. పురుషుడు పంచకట్టుకున్నాడు. తలకి గావంచా చుట్టుకున్నాడు. వీపుమీద వొక మూట వేలాడుతోంది. భుజమ్మీద తాటాకు గొడుగుంది. స్త్రీ అతడి వెనకనుంచుంది. పట్టుచీరె కట్టుకుంది. కుంభకర్ణంచు నీలిచీర మడతవేసి ముసుగులాగ పైన వేసుకుని వొళ్లంతా కప్పుకుని వుంది. ముక్కులోని నిమ్మగుత్తూ, హంసా మాత్రం పైకి కనిపిస్తున్నాయి. వేషమే పట్టి ఇచ్చేస్తోంది నండేదో, పడేదో! బట్టలూ వేషమూ చూసి గోపీ గ్రహించేశాడు, గొప్ప సాహుకార్లని. ఉన్నపాళాన అరుగు మీంచి దిగిపోయాడు గోపి. బాటసారులిద్దరికీ రెండు దండాలు పెట్టాడు.

"బాబూ, దయచెయ్యండి, దయచెయ్యండి. దుకాణంమీదికి దయచెయ్యండి. కందా కానివ్వండి. కావలసినవన్నీ వున్నాయి. ఇస్తాను" అన్నాడు.

బాటసార్లు కాళ్లకేసి చూసి రెండు చెంబులనీళ్లు తెచ్చి ఇచ్చాడు గోపి. మిద్దెలేని గదిలో వొక చిరిగిన చాప పరిచేశాడు. ముందు స్త్రీ వ్యక్తి పాదప్రక్షాళనం చేసుకుంది. తుడుచుకుని, తడిబట్ట పైనించితీసేని చాప మీద మఠం వేసుకుని కూచుంది. ఆమె వొంటిమీది వస్తువులూ, బట్టలూ చూసి ప్రతీ మాటకీ చిత్తం అనీ, కామందులు అనీ, అమ్మగారూ అనీ తగిలిస్తూ మాట్లాడు తున్నాడుగోపి. స్త్రీవ్యక్తి కూడా గోపిభక్తికి సంతోషిస్తూ వుంది. ఏలినవారు అన్నీ ఆమె ఆనందం చెప్పనక్కర లేదు.

కొంగు చివర ముడివిప్పి వొక పావలా కాసు గోపి దిక్కు గిరవాటేసిందామె. "ఇదిగో, తాతా ! వంట సామానులియ్యి" అంది.

గోపీ తడబడిపోతూలేచి పావలా కాసు తీశాడు. రెండుమూడుసార్లు కిందా మీదా దాన్ని తిప్పిచూశాడు. రెండుసార్లు దాన్ని ముద్దెట్టుకున్నాడు. ఒకసారి నోటికి తగిలించాడు. తరవాత బొడ్డుకింద పంచికొంగుని ముడేసి దోపుకున్నాడు.

గోపి మొహంచూస్తేనే తెలుస్తోంది. అతడు మరోసారి అనుకుని వుంటాడు — "ఇవాళ ఉదయాన్నే ఎవళ్ల మొహం చూశానో, సామాను పుచ్చుకోకండా పావలా కాసు వచ్చింది" అని. దుకాణం పెట్టినప్పటినించీ ఇది కొత్త సంగతి.

గోపీ వంటసామాను యావత్తూ, అంటే — బియ్యమూ, పొట్టుతియ్యని మినప్పప్పూ, ఉప్పూ తెచ్చి దగ్గిర పెట్టేసి, రెండు ఎండు కొబ్బిరాకులు పొయ్యిలో వేసి అగ్గి రాజేశాడు. స్త్రీ అన్నం వండిందికి సిద్ధపడింది. పురుషుడు నీళ్ల కడవ పుచ్చుకుని నీళ్లకి బయులు దేరాడు.

స్త్రీ గోపితో అంది: "ఓయి ముసిలబ్బాయీ, ఇక్కడ పాలూ, నెయ్యీ దొరుకుతుందా? పాలూ నెయ్యీ లేకండా నేను తినలేను."

గోపి అన్నాడు:

"నిజమండీ అమ్మగారూ, నిజమండీ, దొరక్క ఇవన్నీ కానీ, ఏలినవారు ముట్టవలసినవేనా ఇవి! ఫలహారంకోసం బాగా బాగు చేసిన సన్నని అటుకుళ్లూ, నీళ్లు కలవని ఆవు పాలూ, పంచదారా, లేదా దక్షిణదేశం కొత్త బెల్లమూ వుంటే కామందులికి బాగుండేది. కందా కోసం పెద్ద సపడచేపా, లేదా మంచి మారుపూ, బొంతరటి కాయలూ, పొట్టుతీసిన పెసరపప్పూ, పాలూ నెయ్యీ వుంటే బావుండి పోను. ఏం చేసేదండీ అమ్మగారూ, ఇది కంగాలీ దేశం. ఏదో నా అదృష్టం! తమ పాదధూళి నా దుకాణంలో పడింది. అమ్మగారూ, సెబ్బులివ్వండి. వూళ్లో తిరిగి చూస్తాను."

ఆమె మళ్లీ వొక పావలా కాసుతీసి గోపి మీదికి గిరవాటేసింది. వెనకటిలాగే పావలా కాసు తీశాను గోపి. మొలని దోపుకుని వూళ్లోకి పరిగెత్తాడు.

బాగా చీకటి పడ్డాక గోపి చిన్నకొడుకు బృందావన సాహు చిన్నఅరిటి దొన్నెలో రెండుమూడు తులాలు నెయ్యీ, ఒక మట్టిపిడతలో సుమారు అద్దెడు పాలూ, రెండు వంకాయలూ పట్టుకువచ్చి దుకాణం గడపమీద పెట్టేసి అన్నాడు:

"మా బాబు పంపాడండీ అమ్మగారూ, వాడికి రేచీకటి. అంచేత రాలేక పోయాడండి."

చెప్పేసి వెళ్లిపోయాడు బృందావనం.

దుకాణంలో మూడో మనిషి లేడు. ఆడామె వంట చేస్తోంది. మగతను అందిస్తున్నాడు. ఇద్దరూ మాటామంతీ ఆరంభించారు.

స్త్రీ: విన్నావురా గోవిందం! విన్నావూ! చెవులికి వినపడిందా? నన్ను అందరూ అమ్మగారనేవారు. ఎక్కడికి వెళ్లినా అమ్మగారనే పిలుస్తారు. నిన్ను బాబుగారని ఎవరనేవార్రా? ఓరే, పద. కటకంపద. నిన్నేం చేసేస్తానో చూద్దువుకాని. నీకు నాలుగు రోజులై బోధపర్చి బోధపర్చి అలిసిపోయాను.

గోవిందం: ఒద్దండీ చంపా అమ్మగారూ! పదండీ వూరికి వెళిపోదాం. అక్కడే వుందాం. భూమీగట్రాకొందాం. వ్యవసాయం చేద్దాం. పాలేర్లు పెట్టుకుందాం.

చంపా: ఒరే, అందుకే అంటారు లోకులు:

మహానీచం చీకటిరాత్రి
మహానీచం మంగలిజాతి

అని. భూమీ గీమీ ఎందుకురా? ఒరే, మనం మనతో పట్టుకువచ్చిందివుంటే - అది వందేళ్లు, రెండు వందల ఏళ్లు కూచునితింటే తరగదు.

గోవిందం: ఊఁ ఊఁ, అదంతా పనికిరాదండి. నేను వూరికెళ్లిపోతాను. ఎన్నాళ్లో అయిపోయింది. ఇంటికబురు తెలీలేదు. గుండెల్లో ఏదో కెలికినట్టవుతోంది. కాదంటే నా వాటానాకిచ్చేయండి. నామానాన్ని నేను పోతాను. మీ ఇష్టం వచ్చినట్టు మీరు చేసుకోండి.

చంపా: వాటా? వాటా ఏమిటి? అన్నదమ్ముల పంపకమా, వాటా? ఒరే అందుకే అంటారు:

"పొరుగమ్మ పప్పులుచూసి ఉవ్విళ్లూరింది
పిడకముక్క బెల్లం ముంచి పరపర నమిలింది!"

ధనం అక్కడా నాదే. నేను దొంగలాడి తెచ్చానంటావా? వారం దినా లయింది. ఎండనకా, వాననకా, బురదనకా, బుగ్గనకా, ఇవాళ ఈ వూరంటే రేపు ఆ వూరనీ, ఇవాళ వీళ్లపంచఅంటే రేపు వాళ్ల పంచ అనీ — ఇలా తిప్పి తిప్పి నా ప్రాణాలు తినేశావు. చెప్పు, బాబుగారి పడకగదిలో మూల మూడు చోట్ల బంగారం రూపాయలూ, వెండిరూపాయలూ, బంగారం వస్తువులూ, పాతిపెట్టిన వన్నీ ఎవరు పాతారు? అర్ధరాత్రపుడు నేను గొయ్యితవ్వేదాన్ని. బాబుగారూ నేనూ పాతేవాళ్లం. నువ్వు ఎరగనన్నా ఎరుగుదువా? ఇవన్నీ నావి కాకపోతే మరెవళ్లవి?

గోవిందం: రూపాయిలు పాతారు. అన్నీ చేశారు. కాని తాళాలు లేక పోతే ఎలా వచ్చేవి? తాళాలు తేవాలన్న ఉపాయం ఎవరు చెప్పారు?

చంపా: అబ్బా, భూం బొక్కేశావు! మహాగొప్ప ఉపాయం చూపించాడ్రా! నాకు ఉపాయం మరి తోచేది కాదు కామోసు! నీకు కళ్లు లేవూ! అవాళ బాబుగారి వెనకాల ఇసకలో కాలు కాలిపోతూవుంటే, రెండుకోసుల్లు పరిగెత్తి పరిగెత్తి పాదాలు పొక్కలెక్కిపోయాయి. ఏడ్చిఏడ్చి గొంతుక ఎలువు రాని పోయింది. పైగా ఉపాయం చెప్పావంటావు, ఉపాయం! బుద్ధిరా బుద్ధి — మేస్తోందిగడ్డి! సరికానీ చెప్పు, నేను ఆ బాపనముండతో నేస్తం కట్టి, రాత్రి దానింట్లోవుండి, భూమిపట్టా దాని పెట్లోంచి పట్టుకు వచ్చేశాను కదా, ఈ ఉపాయమూ నువ్వే చెప్పావా?

గోవిందం మరేమీ మాట్లాడలేదు. అలిగివచ్చి అరుగుమీద కూచున్నాడు. చంపాకూడా మాట్లాడలేదు.

ఒక బళ్లోనే చదువు. ఒక గురువుగారిదే బెత్తం. చతురుడూ చతురికా. ఎవ్వరికీ ఎవ్వరూ తీసిపోరు. అంత సుళువుగా ఎవరు వెనక్కి తగ్గేస్తారు?

ఉభయులూ వొకళ్ల కొకళ్లు బాగా ఎరుగుదురు. డబ్బూ దస్కం గోవిందం చేతికివెళ్లి మంగలి కొంపలో కూర్తే మళ్లీ తిరిగి రావడం వొట్టిదని చంపా ఆలోచన. పైగా గోవిందం పెళ్లం విషయమూ, తల్లి సంగతీ కూడా తనకి జ్ఞాపకం వచ్చింది.

ఇటు గోవిందం ఆలోచన ఏమిటంటే—చంపా కటకంలో అడుగు పెట్టిందో, దాన్ని ఆయితిలో వుంచడం సాధ్యంకాని పని. ఎంగిలాకు నాకేకుక్క మళ్లో

ఎంగిలాకు చూస్తే, మొదటిదాన్ని కాల్తో కుమ్మేసి రెండోదానికోసం పరిగెడు తుంది.

రెండు వ్యతిరేక పక్షాలు బలంలో సరిసమానంగా వుంటే ఎవరిస్థానాల్లో అవి కాళ్లుకదపకండా వుంటాయి.

రాత్రి అయిదు ఘడియలో ఆరు ఘడియలో అయింది. అన్నమూ, పప్పూ తయార్లై సిద్ధంగావుంది. చంపా నుంచుని కొంచేపు ఏదో ఆలోచించింది. గోవిందం దగ్గిరికి వచ్చి దువ్వుతున్నట్టు అంది.

"చూడూ గోవిందం, ఏటవతల నాలుగు కోసుల్లో దాని ఇల్లని చెపుతు న్నావు కదా! సరే, కటకం పద. నేనేదో కొంతసొమ్మిస్తాను. ఇంటి దగ్గిర ఇచ్చేసి వద్దువుకాని. నువ్వు నామాట వినవంటావూ, అయితే సొమ్ముకాదు కదా, చిల్లి గవ్వ కడిగేసిన నీళ్లయినా చేతిలో పెట్టను. తెలిసిందా? రా! ఆకలేస్తోంది. తిందాం రా!"

గోవిందానికి కూడా ఆకలిమండిపోతుంది. బహుశా చంపా మాటల్లో సగం సమ్మతించి లేవబోతున్నాడు వాడు. అయితే చీకట్లో చంపాకి అది అవుపించలేదు. గోవిందం నించి జవాబు రాకపోవడంతోనే ఆరికాలుమంట నెత్తికెక్కిందామెకి.

"అవును, కుక్కని కూతుకూతంటే మూతి ముద్దెడుతుంది. పోరా! పో! తింటే తింటావు. తినకపోతే పోతావు" అంటూ ఝూడించింది.

గోవిందం లేవబోతున్నవాడల్లా మళ్లీ చదికిలబడిపోయాడు. అంతంత గుడ్లుచేసి చంపా కట్టు చూశాడు. లోలోపల అనుకున్నాడు:

"అవునే, నేను కుక్కని. నువ్వు రాణీవి" అని. తానైతే నోరు విప్పి ఏమీ అనలేదు.

గోవిందం ఇంతవరకూ తన అదృష్టం గురించి ఎన్నోకలలు కన్నాడు. ఎంతో పొలమూ — ఎన్నోతోటలూ — ఎన్నో ఎడ్లూ — ఎంతోమంది పాలేర్లూ — ఎన్నో పాడిఆవులు తన సొమ్ములసాల్లో కట్టేసి వున్నాయి — ఎంతోమంది తన దగ్గిర అప్పుకావాలని వచ్చి వాకట్లో కూచుని వున్నారు —

అన్ని ఆశలూ వొక్కసారి అడియాశలయిపోయాయి. పేకమేడలు కూలిపో యాయి.

రోజంతా వర్షంలోనూ, బురదలోనూ తిరిగి తిరిగి అలిసిపోయి వున్నాడు. దానిమీద ఆకలి.

గోవిందం ఇంతవరకూ మనస్సులో దుఃఖపడుతూ కూచుని ఆలోచిస్తున్నాడు. ఇప్పుడు చంపా కుక్క అనడంతోనే బుర్రలో తేళ్లు పొడిచినట్టు వొళ్లంతా మండి పోయింది. ఏమీ అనలేకపోతున్నాడు. తనకి తెలుసు — తనలాంటివాళ్లు ఇద్దరయినా బలంలో చంపాతో చాలరు. ఆమె ఎన్నో సార్లు మంగరాజుగారి పాలేర్లని — నువ్వా నేనా అన్నలాంటి వాళ్లని చావగొట్టడం తాను కళ్లారా చూశాడు. ఊకలో నిప్పు రాజుతున్నట్టు లోపల్లోపల తన హృదయం కుమిలిపోతూ వుంది.

చంపా రెండు ఆకులు పరిచింది. రెండింటిలోనూ అన్నం వడ్డించింది. అన్నంమధ్య గొయ్యిచేసి పప్పు వడ్డించింది. బృందావనం తెచ్చిన పాలపిడత చేత్తో పుచ్చుకుని వొకసారి పైకి చూసింది. తన విస్తరి అన్నంలో అన్నీ వొంపేసుకుంది. చీకట్లో కూచుని గోవిందం అంతా పులుకూ పులుకూ చూస్తున్నాడు. పాలు వొంపేసుకోడం చూసి తన వొంటిమీద అగ్గి వొలకపోసినట్టనిపించింది.

"పాలచుక్క సంగతి ఇలా వుంది. మరి రూపాయలూ బంగారమూ చెప్పేదేముంది?" అనుకున్నాడు లోపల.

చంపా పిలిచింది:

"ఇదిగో నీ అన్నం. తినూ, తినకపో. నేనింత పిసకరించలేను."

చంపా తడిచెయ్యి నోటిమీద రాసేసుకుంది. గొంతుకూచున్నట్టు విస్తటి ముందు కూచుంది. అడ్డ మూడే కళ్లు. పెద్దపెద్ద ముద్దలు బొర్రుకుంటూ క్షణంలో విస్తరాకు ఖాళీ చేసేసింది. పొయ్యి దగ్గర నోరు కడిగేసుకుంది. మళ్లీ వొకసారి పైకిచూసి పిలిచింది.

"రారా! రా! అన్నం తినూ! రా!"

జవాబులేదు. మళ్లీ వొళ్లుమండింద దామెకి.

"దీన్నే అంటారు, అన్నం తీపుతీసిందని!"

మండుతూన్న అగ్గిలో గడ్డిపరకపడ్డట్టయింది గోవిందానికి, ఈ మాట.

చంపా చాపమీద మాటలోంచి సగంబట్ట విప్పేసి, మూట జాగ్రత్తగా తలకింద మెడ దాకా వున్నట్టుపరిచేసి, దాని మీద వెల్లకిలా పడుకుండి పోయింది.

గోవిందం అలాగే అరుగు మీద కూచుని ఆలోచిస్తున్నాడు. పాము పడగలోంచి మణిలాక్కోవడం సులువైనపని కాదని అతడికి తెలిసి పోయింది.

మేము గోవిందపురం ప్రజలనించి విన్నదేమిటంటే గోవిందం మనస్సులో ఇంకా వేరే ఆశ ఏదో వుందని.

స్త్రీ దగ్గరనించి మర్యాదా, ప్రేమా, భక్తీ ఆశించడం పురుషజాతి స్వభావం. చంపా నడవడి బట్టి తెలిసిందేమిటంటే ఆమె ఇష్టపడితే ఇష్టపడుతుంది. కాని నవ్వుమాత్రం ఎప్పటికీ మంగళివే. అంతకంటె అధికం కాదు.

గోవిందం అలా ఎంతసేపు కూచున్నాడో తెలియదు.

చీకటి. రాత్రి ఘోరంగా వుంది. మనిషి తన వొళ్లు తాను చూడలేడు. సాం, సాం మంటూ దక్షిణి వాయువు వీస్తోంది. జల్లుమీదజల్లు కురుస్తోంది వర్షం. మర్రిచెట్టు చీకటికుప్పలా వూగుతూ ఏదో భయం పుట్టించే ధ్వని చేస్తోంది. గబ్బిలాలు చిన్న చిన్న చీకటి ముక్కల్లాగ నాలుగుదిక్కులా ఎగురుతూ వెళ్లి ఆ చీకటికుప్పలో వేలాడుతున్నాయి. మరికొన్ని, చీకటి తునకల్లాగ ఎగిరి ఆకాశంలో కలిసిపో తున్నాయి. కొన్ని కిచ్ కిచ్ మంటూ మర్రిపళ్లు కొరుక్కుతింటున్నాయి. టపటప మంటూ మర్రిపళ్లు కిందరాలుతున్నాయి. ఎటుచూసినా పైశాచిక శబ్దాలు. దుకాణంలో చంపా తీస్తున్న టోకుర్లు మరింత భయంకరంగా వినిపిస్తున్నాయి.

అదిగో, ఆ చీకటి కుప్పకింద రెండు జంతువులు ఖేం — ఖేం కరుచుకుంటు న్నాయి. అది విని గోవిందం తుల్లిపడి చూశాడు. దుకాణంలో వెలుగుతూన్న దీపం క్రమంగా తగ్గిపోతూవుంది. చివరి సంధ్యలో పశ్చిమాకాశం మీద వొకే వొక్క ఎర్రటి కిరణరేఖ తొంగిచూసినట్టు గదిమధ్య వెలుగుతూన్న దీపం కిరణరేఖ నిస్తేజంగా, ఆ చీకటిలో తొంగి చూస్తోంది.

గోవిందం బాగా నిదానించి చూశాడు. రెండు నక్కలు మర్రిపళ్లుతింటూ దెబ్బలాడాయి. ఒక నక్క రెండోదాన్ని తరిమేసి, మర్రిపళ్లన్నీ తానే స్వాధీనం చేసుకుంది.

గోవిందం నక్కచేసినపనిచూసి ఏమిగ్రహించాడో, ఏమిటి మనస్సులో భావించాడో — లేచికూచున్నాడు. నాలుగు దిక్కులూ జాగ్రత్తగా పరికించాడు. మెల్లిగా, అతిమెల్లిగా లోపలికి వెళ్లాడు. పాదాలనించి తలదాకా చంపాని చూశాడు. గోడ గూటిలోవుంచిన పొదితీశాడు. మెల్లిమెల్లిగా పొది విప్పాడు. అందులోంచి ఏమిటో తీశాడు. నడుంకి గట్టిబట్ట చుట్టుకున్నాడు. మెల్లిమెల్లిగా వెళ్లి చంపాని రెప్పవెయ్యకండా చూశాడు.

నేలమీద నిద్రపోతూన్న పందిని అడివిలో ఆకు చిట్టెడ ఎలా చూస్తుందో, అదిగో అలా చూస్తున్నాడు.

అతడి రెండు కళ్లూ మండుతున్నాయి.

కుడి చేత్తో ఏదో గట్టిగా పట్టుకున్నాడు.

ఎంత జాగ్రత్తగా వున్నాడో!

ఎంత ధీరత్వంగా వున్నాడో!

ఊపిరన్నా గట్టిగా తియ్యడం లేదు.

గోవిందం కుడికాలు తీసి ముందుకు వేశాడు.

ఒక జ్యోతి తళతళమని చంపా మీద పడి గోడ మీంచి వెళిపోయింది.

గోవిందం తుళ్లి పడ్డాడు.

ఒక్క అంగలో వచ్చి దుకాణం గడప దిగిపోయాడు.

నాలుగు దిక్కులా జాగ్రత్తగా పరికించాడు. ఎక్కడా ఏమీ లేదు. ఎప్పటి లాగా అన్ని దిక్కులా ఘోరమయిన పైశాచిక శబ్దం. చెట్టుకింది కొమ్మల్లోంచి కొన్ని చీకటి ముక్కలు ఫడఫడమని ఎగిరిపోయాయి. మర్రిపళ్లు తింటూవున్న నక్క వెళ్లిపోయింది.

గోవిందం చేతిలోవున్న వస్తువే దీపం వెలుగుపడి అలా తళతళ లాడింది. గోవిందం గ్రహించేశాడు.

మొదటికంటే మరింత సాహసం తెచ్చుకున్నాడు. మెల్లి మెల్లిగా అడుగులు వేశాడు. గదిలోకి వెళ్లాడు. పందిమీద ఆకు చిట్టెడ ఎలా పడుతుందో అలాగ చంపా మీద పడ్డాడు.

సరిగ్గా అదే సమయానికి దీపంవత్తి పెమ్మిద మధ్యలో మండిపోయి టపీమని ఆరిపోయింది. అంచేత మరేమీ అవుపించలేదు.

గదిలో ఘోరమయిన మూలుగు. కాళ్లూ చేతులూ కొట్టుకుంటున్న శబ్దం. తరవాత వొక్కసారి నిశ్శబ్దం.

ఆ శబ్దం విని నక్కలు భయపడి పారిపోయాయి. చెట్టుమీంచి చీకటి ముక్కలు విరజిమ్మినట్టు ఫడఫడ రెక్కలాడిస్తూ గబ్బిలాలు ఎగిరి పోయాయి.

సరిగ్గా ఆదేసమయానికి వో పెద్దగాలి వచ్చి దుకాణం పక్కగా చెట్టుని వూపేసి విడిచి పెట్టింది.

ఒక్క క్షణం అక్కడ, కనపడని చీకట్లో ప్రళయం వచ్చినట్టు అనిపించింది.

# 23

## కర్మఫలం

గోపాలపురం దగ్గిర విరూపానది బాగా వెడల్పుగా వుంటుంది; సుమారు మైలన్నా వుంటుంది. అయితే ప్రవాహం మాత్రం అంత వెడల్పు కాదు. బాగా లోతుగా మడుగులా వుంటుంది, సంకీర్ణంగా. నది దక్షిణందిక్కు ప్రవాహం. గోపాలపురం రేవు దగ్గిరనించి అంతవరకూ వుత్తి ఇసక. అంతగా పెద్ద వరదవస్తే రేవు దాకా నీళ్లు వస్తాయి. పదిపన్నెండు రోజులయి వర్షంలేక ఏరు మామ్మూలుగా వుండేది. మొన్నటి సాయంకాలం నించీ కొంచెం కొంచెం వరదనీరు వస్తోంది. ముద్దముద్దగా నురుగు వరసలు కట్టి తేలిపోతూ వుంది. అక్కడక్కడ పుల్ల గుమ్మడి లాగ నురుగు సుళ్లలోపడి ముక్కలు ముక్కలై పోతూవుంది. చెత్తా చెదారం ఎంతో కొట్టుకుపోతూ వుంది. లెక్కా జమా లేదు. బాగాలోతుగా మడుగులా వుండడం వల్ల ఇక్కడ గోముఖం జాతి మొసళ్ల ఉపద్రవం జాస్తి. ఘడియాలజాతి మొసళ్లు చెప్పేఅక్కరలేదు, మందలు మందలుంటాయి. అంచేత సాహసించి అక్కడ మడుకులోతు నీళ్లకంటే అధికం లోతుకి ఎవ్వరూ వెళ్లరు. పైగా కొత్త నీరు వస్తే మొసళ్లు మరీ చెలరేగిపోతాయి. కొత్తనీరు వస్తే నురుగులోనే మొసలి మింగేస్తుందని సామెత.

రేవులో పగలూ రాత్రీ వొక పడవకట్టి వుంటుంది. పల్లెజనమూ, సంతల వాళ్లూ దానిమీద నది దాటి రాకపోకలు జరుపుతారు. సర్కారు టపా దాటించడం కోసం పడవమనిషి రాత్రీ పగలూ గుడిసె వేసుకుని అక్కడ తైనాతీ వుంటాడు. అందుకోసం సర్కారునుండి నెలకి రెండు రూపాయలు దొరికే దతడికి, పల్లెటూరి జనం నగదేమీ ఇచ్చేవాళ్లు కాదు. పుష్యమాసం ధాన్యం కోతలపుడు పడవతను పొలం పొలమూ తిరిగి ఇంటికి వొక ధాన్యం కట్ట చొప్పున వసూలు చేసేవాడు. సంతరోజు సంతబేరగాళ్లు ఎవరయినా ఇన్ని ఎండు పిత్తపరిగిలో, రెండు వంకాయపిందెలో, పిడికెడు వుప్పుగళ్లో, కసింత నూనెబొట్లో ఇచ్చి పోయేవాళ్లు.

అప్పుడప్పుడు పెద్ద సాహుకార్లో, కొత్తప్రయాణీకులో జతపడితే కానో, అర్ధణావో బక్షీసు దొరికేది. దేశకాల పాత్రలబట్టి ఈ అదాయం కొద్దోగొప్పో వుండేది. కాని సర్కారు మనుషులు — అంటే, థానా దారోగా, మన్షీ, కానగోయి నది దాటే రోజు చెవినులపడమో, వొక లెంప కాయో, అంతకీ లేదంటే వొక తిట్టో తప్పకండా వుండేది. కేవుట చందియా బెహరా చెప్పేవాడు, ఈ రేవులో పడవనడుపుతూ తాను ముసిలయిపోయాడు. తనలాగ దిట్టమైన నావికుడు ఈ చుట్టుపక్కల లేడు, అని.

రాత్రి ఆఖరైపోవచ్చింది. రాత్రి బాగా వర్షం కురిసింది. మంచి తుఫానే వచ్చి వెళ్లింది. ఇప్పుడు వర్షం కాని, గాలి కాని లేదు. మేఘం ఇంకా అలాగే కమ్ముకుని వుంది. అక్కడక్కడ మాత్రం కొంచెం కొంచెం సందులా అయి, చిన్న చిన్న చుక్కలు మినుకూమినుకూ తొంగిచూసి, చప్పున దాగుండిపోతున్నాయి. సరిగ్గా అదేసమయానికి వొక బాటసారి చిన్న మూట వీపుమీద వేసుకుని, రేవు దగ్గిర నది వొడ్డంబట తిరుగుతున్నాడు. నది వొడ్డంబడి నలభైయాభై మూళ్లు నడిచిపోయి, తిరిగి రేవుదగ్గిరికి వచ్చేస్తున్నాడు. బహుశా నది ఈదేసి ఆవతల వొడ్డుకి వెళ్లాలని అతడి ఉద్దేశం. కానైతే సాహసం చాలకండా వుంది.

రేవులో నుంచుని పిలిచాడు బాటసారి — "ఓయి పడవన్నా! ఓయి పడవన్నా!"

చందియా బెహరా ఇసకలో పడవతెడ్డు పాతేసి, వొక పొడవాటి తాడుతో పడవవొడ్డుని కట్టేసి, రేవు దగ్గిర పాకలో పడుకుని వున్నాడు.

బాటసారి మళ్లీ జాగ్రత్తగా ఇంకోసారి పిలిచాడు — "ఓయి పడవన్నా! ఓయి పడవన్నా!"

బాటసారి అలాకేక వేసి, తుళ్లిపడ్డట్టు వొకసారి వెనక్కి తిరిగి చూశాడు.

పడవతను నిద్రపోతున్నాడా? ఇంత పిలుస్తూంటే పలకడేం? కాని మాకు బాగా తెలుసు, రాత్రి తెల్లవారిఝామునించీ లేచి కూచునే వుంటాడు పడవతను. బ్రాహ్మీ ముహూర్తంలో పక్కవదలాలని శాస్త్రకారులు చెప్పారు. అయితే శాస్త్రం పాటించాలని చందియా బెహరా లేచేవాడని కాదు. అప్పుడప్పుడు రాత్రి చివరిఝాములో టపా వచ్చిపడేది. అంచేత వాడు మేలుకుని వుండేవాడు. అదీకాక మరోమాట, పొద్దుకూకేసరికి రేవు బందయిపోయేది. త్వరత్వరగా రెండు

మెతుకులు నోట్లోవేసుకొని చందియా నిద్రపోయేవాడు. రాత్రంతా ఎంత నిద్ర పోతాడని!

చందియా గుడిసెలో రెండు ముడుకుల మధ్యా తలపెట్టుకొని కూచుని వున్నాడు. ఎదట అగ్గికుంపటివుంది. ఊక అగ్గికి రెండు చేతులూ చాపేసి వున్నాడతడు. బహుశా అతడు మనస్సులో ఏమనుకుంటున్నాడంటే — "వేళకాని వేళ ఈ బాటసారి ఎవడు?" సర్కారు మనిషిమాత్రం కాదు. ఇది నిశ్చయం. ఈ మనిషి అన్నా, అన్నా అని పిలుస్తున్నాడు. సర్కారు మనిషయితే తన భార్యకి తమ్ముణనో, మరేమనో వరసకట్టి పిలిచేవాడు. ఎవడయితేనేం, పిలుస్తూ వుండనీ తెల్లవారనీ చూద్దాం.

మళ్లీ పిలుపు వినపడింది: "ఓయి పడవన్నా. రా, బైటికి వచ్చేయి. బహుమతీ ఇస్తాను."

చందియా మరి ఆగలేకపోయాడు. బహుమతి అన్నమాటలో ఎంత సమ్మోహనం వుందో! పడవాడి మాటకేం బహుమతి మాట వింటే పెద్దపెద్దవాళ్లే తేరి చూస్తారు. చందియా గుడిసెలోంచే జవాబు చెప్పాడు. "ఎవరు పిలుస్తున్నారండో! ఉండండి, తెల్లవార నివ్వండి. లక్షరూపాయలిచ్చినా ఇప్పుడు పైకి రాను నేను."

బాటసారి: చూడూ, పడవన్నా నాకు కటకంలో వాయిదా వుంది. వేగం వెళ్లాలి. ఇదిగో అయిదురూపాయిలు పుచ్చుకో.

అయిదు రూపాయిలు! ఏమిటీ విడ్డూరం! ఒక్క మనిషికి అయిదు రూపాయిలు! చందియా తనజీవితంలో ఎప్పుడూ ఇలాంటిది చూడలేదు. ఒక్కసారి ఎప్పుడయినా అయిదురూపాయలు తన చేతిలో పడాయో లేదో సందేహమే మాకు.

ఇప్పుడిప్పుడే అతడు ప్రతిజ్ఞచేసి చెప్పాడు లక్షరూపాయిలిచ్చినా నేను బైటికి రానని. లక్షలోంచి అయిదు తీసేస్తే, లక్షకీ ఇంకా ఎంత మిగిలింది? ఈ మాట ఆలోచించడమే అనవసర మనుకుని వుంటాడు వాడు.

ఇటు భయమూ పీకుతోంది, వొకవేళ బాటసారి తిరిగి వెళ్లిపోతే? లేదా తెల్లవారిపోతే? కానో పరకో మాత్రం దొరుకుతుంది!

చందియా గుడిసెలోంచి కేకవేశాడు:

"ఉండండి. వస్తానయితే."

కంపట్లో పూదివూది చందియా అక డొల్ల ముట్టించాడు. తెడ్డు చేత్తో పట్టుకుని పాకలోంచి బైటికి వచ్చాడు. కట్టుకున్న బట్ట బాగా ఎగగట్టి నడుంకి చుట్టుకున్నాడు. తలకి గావంచా చుట్టాడు. దానిమీద తల్లారీ పెట్టుకున్నాడు. బాటసారితో అన్నాడు.

"ఏదీ తెండి. ఏమిస్తారో ఇవ్వండి. మీరు కనక బసలోంచి బైటికి వచ్చాను. మరొకరయితే నేను లేచేవాణ్ణే కాదు." బాటసారి అయిదు రూపాయిలా పడవవాడి చేతిలో పెట్టాడు. పడవమనిషి ఒకటీ, రెండూ, మూడూ, నాలుగూ, అయిదూ అని ఈ చేతిలోంచి ఆ చేతికీ ఆ చేతిలోంచి ఈ చేతికీ మూడు సార్లు లెక్క పెట్టాడు.

డబ్బులు లెక్క పెట్టాలి

నీళ్లు వడ కట్టాలి.

డొల్ల బాగా గట్టిగా వొక పీలుపుపీల్చి, దాని అగ్గి వెలుగులో రూపాయలు వొకసారి చూసుకున్నాడు చందియా. పంచకొంగుని రూపాయలు ముడివేసి, బొడ్డుకింద దోపేసుకున్నాడు. ఆకాశం కేసీ, నాలుగుదిక్కులూ వోసారి చూశాడు. మరి రాత్రి లేదు.

బాటసారి అప్పుడే పడవ మొదటి కొసని కూచున్నాడు. పడవతను హెచ్చరించాడు, "బాగా జాగ్రత్తగా కూచోండి" అని. కుడిచెయ్యి పడవకి తగిలించి ముమ్మారు నుదుటికి అద్దుకున్నాడు. పడవకట్టు విప్పేసి, "జే గంగా మాతా" అంటూ పడవమీదెక్కి కూచున్నాడు.

నదిమీదినించి వరద వస్తోంది. పడవ తోసుకోడం కష్టంగా వుంది. తెడ్డె వేసీ వెయ్యడంలోనే పడవ బాగా కిందికి తేలి వెళ్లిపోతోంది. తోసుకుని పడవమీదికి పట్టేసరికి నదిలో ఇంచుమించు సగం దగ్గిరికి వచ్చేసింది పడవ. బాగా తెల్లారి పోతోంది. గోపాలపురం రేవు దగ్గిర వొక పాట వినపడింది.

ఓహో ఓ ఓ ఓ!

రామన్నా లచ్చుమన్నా లేడి వెంట వెళ్లంగా

పాక ఎదటికి వచ్చి నిలిచె సన్నాసీ.

ఏమేమే ఓ సీతా, బిచ్చమియ్యే నాకూ,

లేకుంటే రాముడికీ శాపమిస్తానో! ఓ ఓ

బాటసారి పడవమీద కూచుని మాటిమాటికీ గోపాలపురం రేవు దిక్కే చూస్తున్నాడు. పాట చీకటిని చీల్చుకుంటూవచ్చి చెవిలో పడడంతోనే, బాటసారి బెదిరి బెదిరి నుంచొని అదిక్కే పరికించాడు. పడవతని చెవిలో పాటపడలేదు. ఒకే ధ్యానంతో పడవనదుపుతున్నా డతడు. పడవ వొడ్డుదుడుకు కావడంతోటే కేకవేశాడు "కూచోండి, కూచోండి" అని. బాటసారి భావం చూసి పడవతనూ చప్పున వెనక్కి తిరిగి చూశాడు రేవు దిక్కు. "ఓహో టపావచ్చేసింది." ఇలా అంటూ పడవ వెనక్కి మళ్లించాడు.

బాటసారి వ్యాకులపడుతూ అన్నాడు: "ఓయి పడవన్నా, పడవ తిప్పెయ్యకు, తిప్పెయ్యకు. నన్ను ముందు అవతలకి దిగబెట్టెయ్యి."

పడవ మనిషి అన్నాడు:

"అయ్యో, బాపుందయ్యా! సర్కారుపని! నన్ను జైలు కెళ్లమంటారా ఏమిటి?

రాత్రి మరిలేదు. కొంచెం కొంచెం వెలుతురూ వచ్చేసింది. చందియా బెహారా చూశాడు, బాటసారి వొంటినిండా రక్తం. బట్టలనిండా రక్తం. చేతులునిండా రక్తం. మూటంతా రక్తం. హోలీలో భగ్గుండ పూసుకున్నట్టు అంతటా ఎర్రగా. భయంకరంగా అవుపిస్తోంది.

బెహారా తుళ్లిపడి అన్నాడు: "ఏమిటండోయి? రక్తం ఎలా వచ్చింది? మీరెవళ్లనయినా హత్య చేశారా?"

బాటసారి హటాత్తుగా మూట చేత్తో పుచ్చుకుని, బెహారా "హాం, హాం" అంటూవుండగానే ఏట్లోకి గెంతేశాడు. పది పదిహేను మూరలు ఈదుకుంటూ ఇళ్లాడ్లో లేదో ఎక్కడనించి వచ్చిందో వొక గోముఖం మొసలి టపీమని అతణ్ణి పట్టేసింది. మూట కొంచెం దూరం కొట్టుకుపోయి మునిగిపోయింది.

చందియా చూస్తూనేవున్నాడు. ఎవ్వరీ మనిషి? ఎక్కణ్ణుంచి వచ్చాడు? ఎక్కడికి బయల్దేరాడు? విన్నారండీ పాఠకమహాశయులూ! మేము గ్రంథకర్తలం. అంటే సర్వజ్ఞులం. ఇదిగో ఈ మొసలి పట్టుకుపోయిందే, అది ఎందుకు పట్టుకుపోయిందో, ఎక్కడికిపట్టుకుపోయిందో, అతడితో అది మర్యాదగా ప్రవర్తించిందో, అమర్యాదగా ప్రవర్తించిందో — ఈ గుప్త విషయాలన్నీ మాకు బాగా తెలుసు.

అయితే చందియా బెహారా ఎంచేతో ఈ సంగతి గుప్తంగా వుంచాడు. అంచేత మేము వెల్లడిచెయ్యడానికి ఇష్టపడము. బాటసారి పడవమీంచి నీటిలోకి

గెంతేసేటపుడు వొకకిట్ట తాటాకులు అతడి మూటలోంచి పడవలో పడిపోయాయి. ఆకట్ట చందియా బెహరా తన గుడిసెలో దాచివుంచాడు. కొన్నాళ్లయిపోయాక వొక బాటసారి అయ్యవారిచేత చదివించాడు. అందులో వొకటి అయ్యవారు ఇలా చదివాడు:—

శ్రీ శ్రీ ముకుందదేవు ఏడో సంవత్సరం కుంభమాసం కృష్ణపక్ష ద్వితీయ నాడు, వేళ రెండుఘడియలపుడు గోవిందపురం జమీందారు రామచంద్రమంగరాజు గారిదగ్గిర. సదరు గ్రామం కాపురస్తుకు తెలకలి శామసాహు రాయించి యిచ్చిన అప్పుపత్రం. నా కుమారుడు భీమన్న పెళ్లి నిమిత్తం తమ దగ్గిర పదిరూపాయలు బదులుపుచ్చుకున్నాను. వచ్చే ధనుర్మాసం నా కళ్లంలోంచి తమ కుంచంతో అప్పటి బజారిధరప్రకారం ధాన్యం కొలిపించేసి దానికి వడ్డీ నూటికి 50, లేదా కుంచంతో అసలికి సగం చొప్పున కొలిచేయగలవాడను. దీనికి సాక్షులు సూర్యచంద్రులూ. దశ దిశలున్నూ.

చందియా బెహరా పడవ నడిపేటప్పుడు పదమూడు రోజులదాకా సర్గా బాటసారి గెంతేసిన చోటు తేరి చూసేవాడు.

# 24

## ఖూనీ విచారణ

వేళ ఘడియో రెండు ఘడియలో అయివుంటుంది. ఇవాళ ఖర్చులేదు. గోపి సాహు నల్లటి చింకిగుడ్డ తలమీద వేసుకుని, దుకాణం తట్ట భుజంమీద పెట్టుకుని, చేతిలో తాళాలు పట్టుకుని దుకాణానికి వచ్చాడు. దుకాణం తెరిచి మిద్దెలేని గది కేసి చూశాడు. గదిలో అతడు చూసిందాంతో అతడి తల తిరిగి పోయింది. ఒంటి మీద స్మారకం తప్పిపోయింది. కర్రలా నిలబడిపోయాడు. నోటిలో మాట పెగ ల్లేదు. ఎన్నడూ లేంది, కనీవినీ ఎరగంది — వొక ఆడమనిషి మీది పెణకచూస్తూ చచ్చి పోయి పడివుంది. గది గదంతా రక్తమయంగా వుంది. విస్తరాకుల్లో రక్తం. పొయ్యిలో రక్తం. కూటికుండలో రక్తం. పిచికారీ కొట్టి గోడలనిండా రంగులు వేసి నట్టు వుంది రక్తం.

గోపీ పరిగెత్తికెళ్లి వూళ్ళో చెప్పాడు. ఊళ్ళో జనం చూసిందికి పరిగెత్తుకు వచ్చారు. ఊరిబారికి సంతియజెనా రిపోర్టు చేయడం కోసం ఫండి* కి పరిగెత్తాడు.

* ఫండి : అవుటుపోస్టు

మిత్రాకామపురం బాలాగస్తి ఠంకి గోపాలపురానికి రెండున్నర కోసుల దూరంలో వుంది.

సాయంకాలం పొద్దు వాల్తూ వుండగా బాలాగస్తి జమాదారు సేఖ్ తారాబల్లీ, కనిస్టీబు పితూసింగ్ నేరంజరిగిన స్థలానికి వచ్చి హాజరయారు. సేఖ్ తారాబల్లీ పండించి దిట్టమయిన ఉద్యోగి. చుట్టుపట్ల నాలుగు కోసుల మధ్య అతడి పేరువింటే జనం వణుకుతారు. గర్భిణీ అవయినా దారిచ్చేస్తుంది. చెట్లు నీళ్లుతాగవు. జమాదారు సాహెబుగారు నేరం జరిగిన చోటికివెళ్లి, ముక్కూ, గెడ్డామూ కప్పుకుని శవం పరీక్ష చేయడం మొదలెట్టారు.

శవం వొక స్త్రీ వ్యక్తిది. పట్టుబట్ట కట్టుకుని వుంది. మెళ్లోనూ, చేతులికీ వెండీ బంగారం నగలు ఎన్నో ఉన్నాయి. సాయిబులు కోడి హలాలు చేసినట్టు స్త్రీవ్యక్తి పీకకోసేసి వుంది. పక్కని రక్తంతో వొక మంగలికత్తి పడివుంది. శవం చెడిపో వచ్చింది. తేనెపట్టులో తేనెటీగలున్నట్టు కోతదగ్గిర వందలూ వేలూ ఈగలు ముసురు తున్నాయి. ఇల్లంతా జుమ్మంటూ ఎగురుతున్నాయి. శవం నాలుగంగుళాలు నాలిక పైకి వెళ్లబెట్టి. పళ్లిగిలించి వుంది. వెణకదిక్కు గుడ్లు వెళ్లబెట్టి చూస్తోంది. జుత్తు విడి పోయి వుంది. రక్తంతో అట్టుకట్టి వుంది. రెండు పక్కలా చెత్తికు దళసరిని రక్తం అట్టుకట్టి నల్లబడిపోయి వుంది. అందులోంచి భరించలేని వాసన వస్తోంది. బుగ్గలు రెండూ పొంగడాల్లాగా, కడుపు పెద్ద బుట్టలాగా పొంగిపోయి వున్నాయి.

ఎవరో వొక వ్యక్తి ఆమె జుత్తు వొకచేత్తో పట్టుకుని, మొహం వొక కాలుతో తొక్కిపెట్టి, మంగలికత్తితో ఆమె పీక కోసేసినట్టు వ్యక్తమవుతోంది. పీకకోసి నప్పుడు స్త్రీ వ్యక్తి కాళ్ళు బాదుకుని గింజుకోవడంవల్ల గదిలో నేల తవ్వుకుపోయి వుంది. కంపూ, ఆ భయంకర స్వరూపమూ భరించలేక జమాదారు సాహెబుగారు అక్కడ ఎంతోసేపు వుండలేకపోయారు. పైకి వచ్చేసి, తమ జ్ఞానమంతా వినియోగించి అది ఖూనీ అని నిశ్చయించేశారు. బందిపోటుమాత్రం కాదని తేల్చారు. బందిపోటే అయివుంటే శవం శరీరం మీద నగలు వుండేవి కావు.

జమాదారుగారి హుకుం మీద ఇద్దరు పాకీవాళ్ళు శవం కాలికి తాడుకట్టి ఈడుస్తూ పైకితెచ్చి ఏటి వొడ్డు దిబ్బమీద పడేశారు. ఈడ్చి తెచ్చేటపుడు ఆమె పట్టుబట్ట తీసేసుకోడంతోటే శవం మరింత భయంకరంగా అవుపించింది. సర్కారు వారికి పంపడంకోసం శవం వొంటిమీది నగలన్నీ వొలిపించి వొక తబుకులో

జమాదారుగారు పెట్టించారు. కాని గరండి కడియాలు రాలేదు. వాటివాళ్లు గొడ్డళ్ళతో పాదాలు నరికేసి ఆ కడియాలు పట్టుకుపోయారు.

ఆ మర్నాడు ఉదయానికి కేసు విచారణ ఆరంభమైంది. చుట్టుపట్ల అయిదు గ్రామాల్లోనించి అసామీలని, పోలీసు కానిస్టేబులూ, బారుకులూ వెళ్ళిపట్టుకు తీసుకు వచ్చారు. జమాదారుగారు మర్రిచెట్టుకింద కూచుని కేసు విచారిస్తున్నారు. మూడు నాలుగు వందల మందిని పట్టి తెచ్చారు. అయితే అందరికీ అక్కడ మాగపు లేదు. ఒక్కొక్కరూ విచారణ కావడంతోటే వెళ్ళిపోతూ వున్నారు. అసామీని పట్టితేవడంతోనే అతణ్ణి శవం దగ్గిర కూచోపెడుతున్నారు. శవం పొంగిపోయి నాలుగింతలు పెలమయిపోయింది. నాలుక చిన్న అరటి పువ్వులా కనిపిస్తోంది. కంపుమాట చెప్పనే అక్కరలేదు. శవం దిసమొలతో వుంది నిజమే. పైగా దాని పాదాలు లేవు. ఆపైన ఎలా నడిచేవో! ఇది రాక్షసా? అసామీలు ఎంతోసేపు దాకా శవం దగ్గిర కూచోనవసరం లేకపోయేది. కంపువల్లా, భయంవల్లా వెంట వెంటనే జమాదారుగారి దగ్గిర హాజరయిపోతూ వుండేవాళ్లు వాళ్లు.

మర్రిచెట్టుమొదట జమాదారుగారిక చేరీ. నది ఇసకలో పది పదిహేను వుండేలు రాంబందులు వొకేధ్యానంతో కూచుని చూస్తున్నాయి. కొన్ని ఎగిర వస్తున్నాయి. పదిపన్నెండు కుక్కలూ, నక్కలూ హాజరైపోయాయి. నాలుగైదు కుక్కలు వొక కాలి పాదంకోసం కాట్లాడుతున్నాయి. కొంచెందూరం రెండో పాదం పట్టుకుని ఏడు రాంబందులు పీకుతూవుంటే వొకనక్కవచ్చి వాటినితరిమేసి అదిపట్టుకుపోయింది. రాంబందులు కొంచెం జరిగిపోయి రెక్కలుచాపుకు కూచున్నాయి. జమాదారుగారు ఎంతోమంది వాజ్మూలం రాసేసుకున్నారు.

దుకాణదారు గోపి సాహుతాత సాక్ష్యంచెప్పాడు: బాబూనాకు మూడు కాలాలునిండాయి; వొక్క కాలం మాత్రం మిగిలివుంది. నేనీవయస్సులో అబద్ధం చెపుతానా? ఈవేళ ఏకాదశి, ఇంకా మొహమన్నా కడుక్కోలేదు. ఈవిష్ణు వృక్షం మొదలు నిజంచెపుతున్నాను. నేనీ కేసువిషయం ఏమీఎరుగను. ఆరుమాసాలైంది, కాయిలాతో ఇల్లుకదల్లేదు నేను. దుకాణానికిరాలేదు.

పడవ నడిపే చందియాబెహారా చెప్పాడు:

వర్షమూ తుఫానూ కారణంగా ఎవ్వరూ ఏరుదాటడంలేదు. తాను నాలుగు రోజులై ఏటి వొడ్డుకే రాలేదు.

ఈవిధంగా వూళ్లో అనేకమందినించి సాక్ష్యం పుచ్చుకున్నారు.

పొద్దు వాలిపోవచ్చింది. ఊళ్లో మరెవ్వరూ లేరు. అందరి దగ్గరనించీ సాక్ష్యం తీసుకోడం అయిపోయింది. కేసు ఈవేళతో పూర్తి చేసెయ్యడమా, రేపటిదాకా వుంచడమా అని కనిస్టీబూ, జమాదారుగారూ – ఇద్దరిమధ్యా ఆలోచన జరిగింది. ఆ సమయంలో చెట్టుమీంచి వొక బొల్లిగెద్ద రెట్టవేసింది. జమాదారుగారి గెడ్డాం సగంవరకూ తెల్లబడిపోయింది. తోబాతోబా అంటూ జమాదారుగారు లేచిపోయారు. గెద్దల్ని చూసి, కాంబఖ్త్, బేకూఫ్, హరామ్‌జాదా అంటూ తిడుతూ మండిపడ్డారాయన. చౌకీదార్లుకూడా తిడుతూ గెద్దలమీదికి రాళ్లు విసిరారు. జమాదారుగారి పొడవాటి గెడ్డాం శుభ్రపరచడానికి మూడు ముంతల నీళ్లు కావలిసివచ్చింది.

జమాదారుగారు కేసు ముగించేస్తూ జనందిక్కు చూసి అన్నారు :

"చూడండీ ఈ ఆడమనిషి ఎవ్వారో ఎవరికీ తెలీదు. బహుశా యాత్రికురాలయి వుంటుంది. ఈమె నెవ్వరు ఖూనీ చెయ్యలేదు. ఈమెని పాము కరిచేసింది."

గోపిసాహు దుకాణంముందుకి వచ్చి సాక్ష్యం చెప్పాడు :

"ధర్మావతారా! ఇక్కడ పాముల ఉపద్రవం చెప్పతరం కాదు. నది వరదలో ఎక్కణ్ణుంచో కొట్టుకువచ్చి, వేలువేలు పాములిక్కడ వున్నాయండి. పాముల భయంవల్లే వూరు ఇక్కడినించి లేచిపోయిందండీ. నేను నిన్న దుకాణానికి వచ్చానండి, పెద్ద గోధుమనాగు ఇక్కడ తిరుగుతూ వుండడం చూసి, భయపడి పారిపోయానండి."

బారికి ముటురుమల్లిక్ చెప్పాడు :

"ధర్మావతారా, ఇక్కడ పాములు గనండి. నేను ఆవాళ హుజూరికి ఈ దారిని వస్తున్నానండి. ఈ చెట్టుకింద పదిహేను నాగుపాములు పడుకుని వున్నాయండి. నేనూచూసి పరుగుచ్చుకున్నానండి."

మొన్నటి రాత్రి స్త్రీవ్యక్తి, గదిలో పడుకుని వుండగా ద్వారందగ్గిర వొక పెద్ద నాగుపాము తిరుగుతూ వుండడం చూశానని ముగపురం బారికి బుధైయిధ పటసింగు సాక్ష్యమిచ్చాడు.

జమాదారుగారు సాక్ష్యాలన్నీ రికార్డు చేసి, వొక పడమటి బిచ్చుకత్తె యాత్రికురాలు వూళ్లో బిచ్చమెత్తుకు తిరుగుతూ వుండేదనిన్నీ. దానికి మొన్నటి రోజున గోపాలపురం గ్రామంలో పాము కరిచేసిందనిన్నీ, శవం శరీరంలో పాం కరిచిన గుర్తు వుందనిన్నీ, ఈమె చావు విషయంలో మరేవిధమయిన సందేహం

కానీ, ఫిర్యాదు కానీ లేదనిన్నీ, వొక రిపోర్టు కేంద్రాపడా థానాదారోగా గారి దగ్గిరికి రాసి పంపేసి కేసు ముగించేశారు. దారోగా, మున్షీల మామూళ్లుకూడా చేర్చి రిపోర్టు పై థానాకి పంపబడింది.

జమాదారుగారి హుకుం ప్రకారం నలుగురు పాకీవాళ్లు శవం మెడకి తాడు కట్టి, ఈడ్చుకుంటూపోయి ఏట్లోతోసేశారు. పడవమనిషి చందియా బెహరా చూస్తూనేవున్నాడు, శవంనదిలో కొట్టుకుపోతూవుంటే — ఎక్కడయితే బాటసారిని మొసలిపట్టుకుందో సరిగ్గా అక్కడే పట్టుకుని శవం వొక మొసలి పట్టుకుపోయింది.

జమాదారుగారు పడవెక్కి నదిదాటుతూ కనిస్టేబుతో అన్నారు — "చూడూ, ఇంత పెద్దకేసు, రెండువందలయినా పూర్తికాలేదు."

కనిస్టేబు అన్నాడు — "ఖోదా మాలిక్, జోహుకుమ్ హువా."

గోపిసాహు అవాళనించీ మరి దుకాణానికి వెళ్లలేదు. కార్తీకమాసం మూడు రోజుల ముసురులో దుకాణం కూలిపోయింది. ఆదారీపడిపోయింది. చందియా బెహరా ఆరకోసుకింద హరిపురందగ్గిర పడవకట్టాడు. రాత్రిళ్లమాట అలావుంచండి. పట్టపగలు ఆదారిని జనంనడవడం మానేశారు. అమ్రిచెట్టుమీద వొకపెద్ద పిశాచిమూచుని కొమ్మలువూపేది. ఆపిశాచి ఎండవేళపుడు నదిలోని ఇసక ఎగర వేస్తూ ఆడుకోడంకూడా అనేకమందిచూశారు. గోపాలపురం రేవు పేరు మరిలేదు. పిశాచిమైదానమంటున్నారు జనం.

# 25

## మంగరాజుగారి ఇంటి పరిస్థితి

భూమాణో ఆవోగుంవో అంటే ఏమిటి? లోకప్రసిద్ధిచెందిన కోహినూరు వజ్రం ఎక్కడవుంటుందో అక్కడ వంశనాశనంచేస్తుందని చెపుతారు. అల్లావుద్దీను దగ్గిరనించి రణజిత్ సింగువరకూ దానికి ఉజ్వలమైన ప్రమాణముంది. కాని ఆ మనశ్వేత దీపవాసిని భారతేశ్వరి శిరోభూషణంగా వున్నప్పటినించీ ఇంగ్లాండు మహిమ రోజుకిరోజు జగద్వ్యాప్తమవుతూవుంది. ఇతర్లకి ప్రాణాంతకమైన గరళం దేవాధిదేవుడయిన శివుడి కంఠస్థమై అతడికి మహాదేవత్వం ప్రసాదించింది. సారాంశ మేమిటంటే తగినవస్తువు తగినచోటవుంటే ఏచిక్కూవుండదు.

ఆ పెద్దపెద్దవిషయాలు వదిలెయ్యండి. సామాన్యమయిన చిన్నవిషయం మన భూమాణో ఆవోగుంవో భూమివిషయం చూడండి. గోవిందపురం గ్రామం పల్లం

ఛోమాణో ఆఠోగుంఠో లాంటి సారవంతమైన భూమి మరిలేదంటారు జనం. అయితే పొలంమాత్రం కొంపలుముంచేపొలం. బాఘసింహావంశం చిందరవందరై పోయింది. శారియా ప్రాణమూ ధనమూ రెండూపోగొట్టుకుంది. మంగరాజుగారి విషయం వీధిలోనేవుందిప్పుడు. భూమిపుచ్చుకుని ఆరుమాసాలు ఆరుపక్షాలు కాలేదు. అవస్తమాషండి.

మంగరాజుగారు కటకంవెళ్లిన నాలుగోనాడు కొట్టుగది నాలుగుచోట్ల ముడుకులలోతు తవ్వివుండటం అవుపించింది. ఆవాళ ఉదయనించీ గోవిందమూ, చంపా లోగిల్లోకనపడ్డంలేదు. వాళ్లిద్దరూ ముందూవెనకా నడుస్తూ కటకంవెళ్లే దారిని పద్మపురం గోర్జిలో వెళుతున్నట్టు చూసినవాళ్లు వచ్చి వూళ్లో చెప్పారు. మంగరాజుగారి కుమాళ్లు ఇంతకాలమూ తండ్రికిభయపడి వొదిగివుండేవారు. ఇప్పుడు వాళ్లదే రాజ్యంలావుంది. పెద్దకుమారుడు మొదటినించీ పిచ్చిపిచ్చిగావుండేవాడు. ఇప్పుడు పగలూరాత్రీ గంజాయితాగితాగి పూర్తిగాపిచ్చెత్తిపోయాడతడు. తక్కిన ఇద్దరు కుమాళ్లకీ ముక్కుతుడుచుకుందికి తీరికలేదు. మకరసంక్రాంతి దగ్గరపడుతోంది. పిగిలిపిట్టలుపట్టడం జోరుగావుంది. పగలూరాత్రి ధాన్యం అమ్మకం జరుగుతోంది.

ఇవాళ ఊళ్లో మాంచి సందడిగా వుంది. మంగరాజుగారి ఇల్లూ వాకిలీ వేలాం జరుగుతుంది. వేళ సుమారు ఆరుఘడియ లవుతుంది. పోలీసు జమాదారూ, బంట్రోతులూ, బారకులూ మొత్తం ఎనమండుగురు మంగరాజుగారి వాకిట్లో నుంచున్నారు. జడ్జీదొరగారు మంగరాజుగారికి వెయ్యి రూపాయిలు జరీమానా వేశారనీ, చరాస్తి వేలం వేసి జరీమానా సొమ్ము వసూలు చేస్తామనీ జమాదారుగారు వచ్చారు. జమాదారుగారు ఇంట్లో ప్రవేశించి సామానులు తెచ్చి వాకట్లో కుప్ప చేస్తున్నారు. గోరపిట్ట గూటిలో జెర్రిపోతు దూరితే ఎలావుంటుంది, అదిగో అలావున్నారు మంగరాజుగారి కోడళ్లు. ఇంట్లోంచి పైకి వచ్చేసి పెరట్లో తోటలో సతమత మైపోతున్నారువాళ్లు. మంగరాజుగారి కుమాళ్లెవరూ 'ఇంట్లో లేరు. గుమాస్తా ఏదో చెప్పాలని వెళుతూంటే జమాదారు కళ్లెర్ర చేశాడు. దాంతో అతడు బుగ్గమీద చెయిపెట్టుకుని మాట్లాడకండా అరుగుమీద కూచున్నాడు. ప్రతీదానికీ చిత్తంబాబూ, చిత్తంబాబూ అంటూ ముకుందుడు ముందూ వెనుక లాడుతున్నాడు.

సామాన్లు వీధిలో వేలాం జరిగింది. వేలామంటే వేలాంకాదు. నిక్షేపం లాంటి ఎడ్లు నాలుగు రూపాయలని ఎప్పుడన్నా, ఎవరన్నా విన్నారా? పాలిస్తూన్న

ఆవులు మూపాయికి వొకటి, పైగా రెండేళ్ల పెయ్యలూ వాటితో వున్నాయి. మొదట మొదట వున్నవూళ్లో ఎవరూ వేలం పాడలేదు. ధరచూసి వొకళ్లమీద వొకళ్లు పాడారు. జమాదారుగారు వేలంవేసినవి వేసి సొమ్ము పట్టుకుపోయారు. మిగిలిన ఆవులూ, ఎడ్లూ ఏ పొలమంటే ఆపొలమూ, ఏవీధంటే ఆవీధి తిరుగుతున్నాయి. వాటిని కట్టడానికి దిక్కూలేదు. బంగాళీ గొడువాళ్ల మందలోకి కొన్ని వెళ్లిపోయాయి. కొన్ని దారితప్పడిపోయి మరో వూరు చేరిపోతూయి. కంబార్లకి రెండేళ్లయి జీతం దొరక లేదట. కొబ్బరితోటనించీ, పశువులనించీ వాళ్లు వసూలు చేసుకుంటున్నారట!

తులమాసం సగం దాటుతోంది. లఘుధాన్యం ఇంకా కోతలుఆరంభించ లేదు. పాత కంబార్లు నౌకరీ వదిలేసి పోయారు. పోయారంటే జీతాల తీరి పోయికాదు. ఏదో కుంచెడు దగ్గిర పడికెడు.

ఊళ్లో చిన్న నువ్వుగింజంతమాట పెద్ద తాటికాయంత అవుతుంది. సందేహంలేదు. అంతటా చెప్పుకుంటున్నారు, జడ్జీ దొరగారు మంగరాజుగారి దగ్గిర జమీందారీ తీసుకుని వొక వకీలుగారి పరం చేశారట! ఆ వకీలు వచ్చే మకర సంక్రాంతినాడు రెండువందలమంది బంట్రోతులూ, అయిదు గుర్రాలు, రెండు సవార్లూ పట్టుకుని ఊరు దఖలుపరుచుకుందికి వస్తాడట!

“గుర్రాన్ని దొంగ లెత్తుకుపోతే హాని కేమంటా,” అన్నారు రైతులు – “ఇక్కడవున్న దానావే అక్కడా వుంటుంది. ఎవరు రాజైతే వారి రైతుల మవుతాం. మనది మనకుంటుందికదా!” శత్రు పక్షంమనుష్యులు మాత్రం మాంచి హోషారీగా వున్నారు. మంగరాజుగారి బంట్రోతులు మాత్రం వూళ్లో మొహామెత్తి తిరగలేక పోతున్నారు. దుష్ట మనుష్యులు వాళ్లని చూస్తేసరి, చెట్టుమీదా పిట్టమీదా పెట్టి ఎత్తి పొడుస్తున్నారు.

# 26

## బా వా జీ ల లి తా దా సు

నిన్నటినించీ వూళ్లోకావలిసినంత సందడిగావుంది. బజార్లో, దార్లో, నీలాటి రేవునీ, వంటింట్లో, ఢేంకిశాల్లో* – ఎక్కడికివెళ్లండీ అంతటా అదేమాట. ఒకదగ్గిర మెల్లిగామాట్లాడుతున్నారు. ఒకదగ్గిర కేకవేసి చెప్పుకుంటున్నారు. ఒకడు చేతు

* ఢేంకిశాల: ధాన్యందంచే స్థలం.

లూపుతూ చెపుతున్నారు. ఒకడు తలతిప్పుతూ చెపుతున్నాడు. పదిమందీకూచుని అదేధ్యానంతో వింటున్నారు. విషయం బహురూపాల్లో నడుస్తోంది. మీకుదాని సారాంశం వినిపిస్తాం, వినండి.

మంగరాజుగారు కటకం వెళ్లిన ఏడ్రోజులనించీ పూరీక్షేత్రంనించి వొక బావాజీవచ్చి, గోవిందపురం భాగవతమందిరంలో మకాంపెట్టివున్నాడు. బావాజీపేరు లలితాదాసు. వయస్సు నలభైపైన. శరీరం చామనఛాయ. స్థూలకాయం. తలనున్నగా వుంది. కరుభోజా కాయ మూడికలాగ మధ్యని చిన్నపిలక. మెడలో పెద్దపెద్ద తులసిపూసలు అయిదుపేటలున్నాయి.

బావాజీగారు వేకువజామున చీకటితోనే లేచిపోయి ప్రాతఃస్నానం చేసేసే వారు. ముక్కుసగంనించి పిలకముడిదాకా చందనతిలకం పెట్టుకుండేవారు. డెక్ లెటరు ఆఫీసునించివచ్చిన బేరింగు వుత్తరంలాగ వొళ్లంతా ముద్రలువేసుకుని హరి నామం వినిపించడంకోసం వూళ్లోకి బయల్దేరేవారు.

ఒక కౌపీనమూ, దానిమీద వొక బహిర్వాసమూ వుండేదాయనికి. వీపున నామాలుఅద్దిన ఉత్తరీయమూ, చేతిని జపమాలాన్నూ. బావాజీగారు వూళ్లోతిరిగి హరినామం వినిపించేవారు. సాయంకాలమపుడు ఖంజిరీవాయించి కీర్తనలుపాడే వారు. ఆతరవాత చైతన్యభాగవతం పఠించేవారు. సాయంకాలాలు భాగవతమంది రంలో వొకటోరకం సమావేశంజరిగేది. ముసిలిముసిలి సేనాపతులు పదిహన్నెండు మంది ఉపదేశంపొందుతారనీ అనుకుంటున్నారు. బావాజీగారు లోభం అంటే ఎరగరు. ఎవరన్నా ఏదన్నాఇస్తే "హరేకృష్ణ, హరేకృష్ణ" అనేవారు. నిజంగా ఇంతటిసాధుని ఎప్పుడూ ఎక్కడా చూళ్లేదు.

ఇవాళ్కి రెండు రోజులయింది, బావాజీ ఎక్కడికో మాయమైపోయాడు. దాంతో మంగరాజుగారింటి మరువాని వెతుకుతున్నారు. కొంతమంది అంటు న్నారు, "ఆమె బావాజీగారితో బృందావనం వెళ్లిపోయిందని నిజంగా ఆమె సాధుసంసర్గంవల్ల తీర్థయాత్రకే వెళ్లిపోయిందనుకోండీ, అప్పుడు మేము ఆసాధు విషయంలోనూ, సాధ్వీవిషయంలో ఏదన్నాచెప్పి పాపంతెచ్చుకోలేము. అదిమాకు నచ్చనిపని. అయితే వొక్కమాటమాత్రం విన్నదగ్గిరనించీ మనస్సు మనస్సులో వుండకుండావుంది.

మంగరాజుగారి చిన్నకోడలుకి మరువామీద మహానమ్మకం. మరువా ఎల్ల ప్పుడూ ఆమెదగ్గిరే వుండేది. మరువాతోపాటు చిన్నకోడలు పెట్టెలోని నగలు

కూడా కనపడలేదిప్పుడు. కన్నవారూ, అత్తవారూ ఇచ్చిన నగదురూపాయలు కూడా ఆ పెట్టెలోనే వుండేవట! పెట్టె తెరిచేసివుంది, అందులోంచి పదార్థం మాత్రం మాయమైపోయింది. అందరూ ఆ నగలూ రూపాయలూ మరువాతో వున్నాయని ఊసులాడుకుంటున్నారు. చిన్నకోడలు రాగాలు తీసి ఏడుస్తోంది, పాపం. అందరూ విచారించి వూరుకున్నారు ; మరువాని వెదికేవాళ్ళెవరు?

ఏవాకిలి, రాత్రనకా పగలనకా మనుషులు వచ్చీపోతూ సందడిగా వుండేదో ఆ వాకిలి గడ్డి బలిసిపోయింది.

అసలు సంగతేమిటంటే అయిదారు మాసాల్లో సంపత్తీ గౌరవమూ, ఆధిపత్యమూ అన్నీ చిందరవందర అయిపోయాయి.

నిర్జగామ యదా లక్ష్మీః
గజభుక్త కపిత్థవత్.

# 27

## అపూర్వ మిళనం

మనిషి తాను చేసుకున్నది తాను అనుభవిస్తాడు. మంచి చెయ్యండీ, చెడ్డ చెయ్యండీ – దాని ప్రతిఫలం మాత్రం అనుభవించాలి, తప్పదు. ఓ బుద్ధిమంతులారా, ఎవ్వరూ లేకుండా చూసి మీరేదో చేశారనుకోండి, మనిషన్నవాడు చూడలేదుకదా అనుకుంనేరు! నేలమీద చిన్న విత్తనం పాతినప్పుడూ ఎవ్వరూ చూడక పోవచ్చు, కాని అది చెట్టయాకదాన్ని దాచిపెట్టడం మాత్రం సాధ్యంకాదు. మీరే చెట్టు పాతిపెడితే, ఆ ఫలం మీరు వంశపారంపర్యంగా అనుభవిస్తారు.

ఓ బలవంతులారా, ధనవంతులారా, గర్వితులారా, మీరు ఎవణ్ణి సామాన్య మానవుడని నీచంగా చూస్తున్నారో, వాడిచేత వొకనాడు ఏ కార్యం నెరవేరుతుందో మీరెరగరు. వంగ, బీహారు, ఒడిశా సుబేదారు వొక సామాన్య ఫకీరుని బాధపెట్టి తప్పించుకోలేక పోయాడు. శిఖుగురు గోవిందసింగు వూచి సాయిబుకి ఉపకారం చేసి, ప్రాణసంకటంలోంచి తప్పించుకున్నారు. ఐతిహాసికమయిన పెద్ద పెద్ద విషయాలు వదిలిపెట్టెయ్యండి. బాఘసింహులు ఇంట చాకిదార్లుగా వుండడం చేత రతనపురం బారుకుల్ని మంగరాజుగారు కుట్రచేసి జైల్లో వేయించారు. చిత్రం చూడండి, ఆ బారుకులుచేతే మంగరాజుగారివాళ్ళ అవమానం అనుభవిస్తున్నారు.

రతనపురం బారుకులు తొలిరోజు మంగరాజుగారిని జైల్లో చూసి_ "నేస్తం వచ్చారా? మామా వచ్చారా? సామంతుగారూ వచ్చారా" అంటూ, నవ్వుతా లాడి దండాలు పెట్టారు. ఎవడన్నా ఒక డబ్బున్నమనిషి జైలులోకి వస్తే పాత ఖైదీల్లో సర్దార్లు ఏదన్నా లాగుదామని ఆశపడి అతడిమీద జులుము చేయడం కద్దు. మంగరాజుగారు రతనపురం బారుకుల్తో కలిసి గానుగ తిప్పేటప్పుడు వొక తాపో వొక మాటిపోటో అతడికి తగుల్తావుండేది.

మేం వొకమాట చెప్పడం మరిచిపోయాం. అబద్ధం సాక్ష్యం చెప్పాడన్న నేరం కింద గోబరాజేనాకి వొక సంవత్సరం కఠిన శిక్ష పడింది.

రోజులు ఎవరికోసమూ కాసుకు కూచోవు. ఏకటాకీని పగలూ రాత్రీ పరిగెత్తుకు పోతున్నాయి. మంగరాజుగారు గానుగ తిప్పుతున్నారని రోజులు ఆగి పోవడమంటూ వుండదు. లోకులంటారు, "సుఖం రోజులు గుర్రంమీద వెళ తాయి. దుఃఖం రోజులు ఏనుగుమీద వెళతాయి" అని. మీరేమన్నా అనండి రోజులు తమ పని మరచిపోవు. షష్టి ఘడియలికి అవి అధికం పోవు. ఒకటీ - రెండూ - మూడూ - నాలుగూ అని మంగరాజుగారు జైలు దినాలు రెండు మాసాలు గడిపేశారు.

మంగరాజుగారు వుండే కొట్టు మరమ్మత్తుకి వచ్చింది. ఆయన్ని మరో కొట్టుకి మార్చారు. జైల్లో వొక్కొక్క కొటోనూ ఎనిమిదేసి మట్టి గడపలుండేవి. రాత్రిళ్లు కంబళ్ళు పరచుకు ఎనిమిదేసిమంది పడుకునేవాళ్లు. దైవికంగా రతనపురం బారుకులు ఆరుగురూ, గోబరాజెనా, మంగరాజుగారూ వొకకొట్లో వుంచబడ్డారు.

నాలుగు రోజులకింద మంగరాజుగారిమీద పెద్ద ఆపద వచ్చిపడింది. ఇప్పుడు కటకం దరఘా బజార్లోవున్న పిచ్చాసుపత్రి పూర్వం లేదు. పిచ్చివాళ్లని అప్పుడు జైల్లోనే వుంచేవాళ్లు. మంగరాజుగా రున్న కొట్టుకి కొంచెం దూరంలో పిచ్చివాళ్ల కొట్టుంది. అక్కడ వొక ఘోరమయిన పిచ్చివాడుండేవాడు. రాత్రిళ్లెప్పుడూ వాడు నిద్రపోయేవాడు కాదు. "నా శారియా, నా ఛోమాణో ఆత్తొ గుంతో" అని నాట్యం చేసేవాడు. గోల చేసేవాడు. కేకలు వేసేవాడు. మంగ రాజుగార్ని చూస్తేచాలు, కరవడానికి పరిగెత్తేవాడు. బంట్రోతులు పట్టుకుని ఆపేసే వాళ్లు. ఆవాళ హాటాత్తుగావచ్చి వాడు మంగరాజుగారిమీద పడ్డాడు. ముక్క కరిచేసి ముక్కలు చేసేశాడు.

ఇవాళ జైలు గేటుదగ్గిర గోల్మాలుగావుంది. ఇద్దరు రోగులు పడివున్నారు. ఒకడు వచ్చీ ప్రాణం పోయీ ప్రాణంతో వుండి చచ్చిపోయాడు. రెండోవాణ్ణి బాగా కడిగేసి నేటీవు డాక్టరూ, కంపౌండరు కట్టు కట్టేశారు.

తొమ్మిది గంటలు వేళపుడు డాక్టరుదొరగారువచ్చి శవం పరీక్షచేశారు. రోగి శరీరంయావత్తూ పరీక్షచేశారు. జెయిలు దారోగా రిజస్టరుచూసి చెప్పారు.

"శవం 977 నెంబరు ఖైదీ గోబరా జెనా" అని.

రోగి 957 నెంబరు ఖైదీ రామచంద్రమంగరాజు. రోగిశరీరమంతటా అక్కడక్కడ వాచివుంది. ముక్కుపగిలిపోయి రక్తం కారుతోంది. ఉండివుండి రక్తం వాంతులవుతున్నాయి. రోగానికికారణం దెబ్బలని డాక్టరు దొరగారు నిశ్చయించారు.

చాలాగందరగోళం జరిగింది. చాలావిచారణ జరిగింది. చాలాఎంక్వైరీ జరిగింది. దెబ్బలెవరుకొట్టారో తేలలేదు. రోగి మాట్లాడడానికి శక్తిలేకండావున్నాడు. రాత్రి పహారావున్న జవానుమాత్రం సగంరాత్రపుడు ధమ్‌ధామ్, గుమ్‌గామ్ శబ్దం విన్నట్టు సాక్ష్యమిచ్చాడు. గోబరాజెనా, మంగరాజుగార్లే పరస్పరం కొట్టుకున్నారని బారుకులు ఆరుగురూ సాక్ష్యంచెప్పారు.

కేసువిచారణ పూర్తయింది. డాక్టరు దొరగారు హుకుముచేశారు, "రోగి బతుకుతాడని ఆశలేదు. తగిన చికిత్సకోసం వాళ్లబంధువుల దగ్గిరికి ఖైదీని విడుదల చెయ్యాలి" అని. పోలీసులద్వారా గోవిందపురంలో అందింది దొరగారిహుకుం.

మంగరాజుగారి కుమాళ్లు ధాన్యంగది ఇంచుమించు ఖాళీచేసేశారు. తండ్రిని బాగాఎరుగుదురు వాళ్లు. ఆయనేతిరిగివస్తే మరిబతకనిస్తాడా! బుద్ధిమంతు డెవడన్నా ఆపదనెత్తిమీదికి తెచ్చుకుంటాడా?

ఆత్మానం సతతం రక్షేత్.

ఈనీతివాక్యం అందరికీ తెలుసు.

మునిసిలికంబారి ముకుందుడు రెండు కోడిపెయ్యలూ, నాలుగు గంతలూ అమ్మేసి వొకడ్డోలీపట్టించుకుని తడబడుతూ కటకం పరిగెత్తాడు.

# ఉపసంహారం

మూడు మాసాలకిందట తులసికోట దగ్గిర మంగరాజుగారి భార్య ఎలా పడి వుండేదో, సరిగ్గా అదేచోట సరిగ్గా అలాగే ఉత్తరదిక్కు తలపెట్టుకుని పాతచింకి చాపమీద మంగరాజుగారు పడివున్నారు. కాళ్లూ చేతులూ కదలడం లేదు. కంటిమీద రెప్ప వాలడంలేదు. ఒకేధ్యానంతో మీదికి చూస్తున్నారు. శిబాచమారూ, కార్తీక నాయకూ ఇద్దరు వైద్యులు చూస్తుండేవారు. నిన్న రాత్రి నించీ లాభంలేదని తప్పుకున్నారు వాళ్లు. సాలిగ్రామ గోపియా చూస్తున్నాడిపుడు. సాలి గోపియా పురప్పు గోపీ కవిరాజు పేరెక్కిన వొక గట్టి వైద్యుడు. నాలుగు వూళ్ళలో అతణ్ణి ఎరుగుదురు. పగలూ రాత్రి అతడికి వూపిరి తియ్యడానికి సమయముండదు. ఉదయాన్నే లేచి పచ్చడం నడుంకి చుట్టేసుకుని, భుజం మీద ఎర్ర గావంచా వేసుకొని, చెంకకింద మందులసంచి వేలవేసుకుని, వంక పెదురుకర్ర చేత్తో పుచ్చుకుని అతడు రోగులు చూసేందికి బయల్దేరేవాడు. సంచిలో డెబ్బయిరెండు రోగాల మందులు మాత్రలు వేరువేరు గుడ్డల్లో కట్టి వున్నాయి. గోపియా పెత్తండ్రి వొక పేరెక్కిన వైద్యుడు. అతడి మందు రోగి శరీరంలో చెకుముకిరాయిలా మట్టుకునేది. అతడు తయారుచేసిన మాత్రలు ఈపూటకే గోపి జాగ్రత్తచేసి పెట్టుకున్నాడు.

గోపి రోగి చాపకుడి పక్క కూచుని చాలాసేపుదాకా నాడి పట్టిచూశాడు. పైకి చూసి, కళ్ళు మూసేసి, పళ్ళు పైకి చూపిస్తూ రోగం నిదానించాడు. ముకుందుడు బలుబలు మంటూ కవిరాజు మొహం చూస్తున్నాడు. "కవిరాజుగారు ఏవిటిచూశారు" అని అడిగాడతడు. కవిరాజు గంభీరభావంతో స్థిరంగా కూచుని చెప్పాడు: "ఏ–ఏమంటే–'కంఠాశ్లేష ప్రణయినిజనే కిం పునర్దూర సంస్థే' అనగా కంఠంలో శ్లేషపడితే ప్రాణం పోతుంది. అది దూరం వెళిపోతే ఏమవుతుంది! అయితే నేను వీళ్ళలాగ చదువులేని కవిరాజునా? చూస్తూ వుండు నేను రోగం కొంగులో ముడేసి పట్టుకుపోతాను" అంటూ కవిరాజు కొంగు ముడి వేశాడు.

ముకుందుడు అడిగాడు: "రోగి శరీరం అక్కడక్కడా వాచిందేమండీ?"

కవిరాజు: ఏ–ఏమంటే, 'స్వర్ణాదష్ట గుణం శోథం' – అంటే శ్లేష్మ దోషంవల్ల వాపులు పోతాయి. వాస్తేనేం పరవాలేదు. కస్తూరి కడుపులో పడితే

అన్నీ వదలిపోతాయి. 'కస్తూరీ తిలకం' కడుపులోకి ఇస్తాను. ఇంకా తిలకం తయారు చెయ్యాలి.

కవిరాజు ముకుందుడి దగ్గిర నాలగణాల చిల్లర డబ్బులు పుచ్చుకుని వొక మాడ కస్తూరిపైకి తీశాడు.

"దీనికి అనుపానం కావాలి," కవిరాజన్నాడు — "శాస్త్రం చెపుతోంది 'ముస్తకం కటుకీ రాత్రి — శుంఠి పిప్పలి మేవచ'. ఏ—ఏమంటే — రాత్రి శొంఠి, పిప్పలీ, వసా, ముస్తలూ దంచాలి."

ముకుందుడు : ఇవన్నీ ఎంతెంత తేవాలి ?

కవిరాజు : ఏ — ఏమంటే 'అనుపాన విశేషణ కరోతి వివిదాన గుణాన్' అంటే అనుపానం విశేషంగా — అంటే అధికంగా ఇస్తే గుద్దినట్టు గుణమిస్తుంది.

కవిరాజు రోగనిదానం చేసి, మందు సిద్ధంచేసేలోగా రోగికి ఆఖరి దశ వచ్చేస్తోంది. క్రమేపీ ఎగసోష పుట్టుకు వచ్చింది. రెండు కళ్లనించీ రెండు ధారలు కన్నీళ్లు ప్రవహించాయి.

మంగరాజుగారు, నాలుగు దినాలనించీ పడివున్నారు. తదేక ధ్యానంతో ఆకాశం చూస్తున్నారు. ఎప్పుడయినా కళ్లు మూతలుపడ్డాయో తుళ్లిపడి పలవరిస్తున్నారు.

స్వరం క్రమంగా క్షీణిస్తోంది. ఆయన ఏవంటున్నదీ అర్థం కావడంలేదు. ఆయనకి కొంచెం మగతనిద్ర పట్టేసరికి ఆకాశంమీద వొక భయంకర మూర్తి అవుపించేది. పెద్ద తల విరబోసుకున్న జుత్తూ, సొత్తిముంపల్లాగ తెల్లటి పెద్దపెద్ద పళ్లూ, రెండుమూడు మూర్ల నాలికా — హాఁ ఆమ్మని ఆయన్ని తినేయడానికి వురికేదది. సాలివీధిలో భగియాచందు గడపమీద వొక స్త్రీ పంటికర్ర తిప్పుకూ వుండడం లోగడ మంగరాజుగారు చూశారు. ఆ స్త్రీయే భయంకరంగా వికటరూపం ధరించి ఇలా వికృతంగా తయారయిందని ఆయన అనుకుంటున్నాడు. ఆ భయంకర మూర్తి పిడుగులు పడిన ట్టరిచేది — "నా ఆరెకరాల ఎనిమిదికుంటలు నాకిచ్చెయ్యి"

మంగరాజుగారు పలవరించేవాడు.

ఆయనికి మరోసారి మమత పట్టింది. మరోనరకం కాళీమూర్తి ఆయనకవుపించింది. దిగంతరాళంలో శరీరందాచుకుని ఆనరకం కాళిం తనని మింగేయడంకోసం భయంకరంగా తొంగిచూస్తోంది. మంగరాజుగారికి తెలిసిపోయింది,పాలంలాక్కోడం

పల్లి. తిండిమానేసి. చచ్చిపోయిన వ్యక్తిమూర్తే ఇది. ఇంకా ఆయనకి అవుపించింది — భగీరథచంద్రుల్లాగ వంకర్లుంది, వెయ్యిమంది పిచ్చివాళ్లు నల్లమేఘాల్లోంచి పైకివస్తున్నారు. వాళ్లచేతుల్లోనూ కత్తులూ ముద్గరాలూవున్నాయి. ఆముద్గరాలన్నీ వొక్కసారి తననెత్తిమీదపడ్తున్నట్టు అనిపించిందాయనికి.

మంగరాజుగారు వెర్రికేక వేసి పారిపోవాలనిచూశారు. కాని శరీరంలో శక్తి లేదు. నోరువిడలేదు. నిరాధారుడైపోయి ఆయన భగవన్నామం హృదయంలో ధ్యానించడం మొదలపెట్టాడు.

ఇప్పుడాయనికి మరోదృశ్యం కనిపించింది. అనంతాకాశంలో సూర్యమండలం వెనక దూరంగా రత్నసింహాసనం మీద వొకజ్యోతిర్మయి, శాంతిమయి, ఆశాప్రదాయిని వొక స్త్రీమూర్తి దర్శనమిచ్చింది. పూర్వం మంగరాజుగారు మంచం పడితే ఆ స్త్రీమూర్తి దగ్గరకూచుని ఆయన శరీరం కోమలహస్తాలతో నిమిరేది. విమానంమీద, రత్నసింహాసనంమీద కూచుని వేళ్లతో సైగచేస్తూ మంగరాజుగారిని తనదగ్గిరికి పిలుస్తోందామె. ఆదివ్యమూర్తినే గురిపెట్టుకుని మంగరాజుగారి ఆత్మ పైకి పయనించింది.

మంగరాజుగారిలోగిల్లో వొకటేకేకలు — హరిబోల్, హరిబోల్, హరిబోల్!